



హేమంతము

చిత్రకారుడు: శ్రీ కె. సి. యస్. పణికర్.




ఖర
వైశాఖము

# భారతి

సంపుటము 28
సంచిక 5


# ఉన్మీలనము

●


శ్రీ దాశరథి


మల్లియచాటునుండి మధుమాసము తొంగిన యట్లు నీవు నా
యుల్లమునందు తొంగుము పయోరుహలోచన! కారు చీకటుల్
జల్లెడపట్టి తారకలు సాచినయట్టుల నీ శిరోజ సం
ఫుల్ల వినీలకాంతుల గుబుల్కొన నిమ్మొక కోటి మల్లికల్

అరుణ మందార సుందర కాతి సంతాన మధుకార వితర్ది నాడు వేళ
తరుణప్రవాళ విస్ఫుర దుగ్రరేఖలు నీలనేత్రములందు నిండునాడు
ఉదయభాస్కర కర మ్మెదిగి విభావరీవృద్ధకు తల కొంగు విడినయపుడు
ఆకలి కాగడా లాటాడి శాంతికి నిద్రపట్టగనీక 'నెగడు వేళ

పెద్ద పెద్దలు చీకటి గద్దె నీడ
దాగికొనుటకు తలక్రిందు తపము చేసి
కామినీ! నీదు పగడాల కంటి చూపు
లుంపలో కాళ్లు కాలి దుఃఖించినారు.

సంధ్యకును సంధ్యకును మధ్య సాగిపోవు
కాంతి పక్షి సంతానము చింత వీడి
నిద్దురించును రాతిరి నీడలందు—
నీ నవోచ్ఛ్వాస నిశ్వాస నానిలముల.

చేదయి పోయి జీవితము చిక్కని వేపముదుళ్లలోన ఆ
వేదనతోడ రోదనము పెంచినయప్పుడ యెఱ్ఱ నవ్వుతో
మోదుగు కొమ్మవై అనలముం గురిపించి దహించివేయ భా
మా! దయ సేసినావట ఉమాపతి రూక్షనిటాలకీలతో.

స్వర్ణకిరీటధారియయి వచ్చెను కుక్కుటరాజు నేడు ప్రా
గర్ణవ గర్భసీమ నుదయించగు భానునికన్న ముందుగా—
ఘూర్ణిలు 'కొక్కొరో' యనెడు గుంజ సెలంగగ, నిద్దు రించు నా
కర్ణము లాలకింప, గజగామిని! నీకనుబొమ్మలాడగా!

ఇక మేలు కొందమా! బా
లిక! కల్పాంతాల 'నిద్దురింపులు' స్వేచ్ఛా
కృకవాకు గళధ్వాన
ప్రకటనతో కన్ను విప్పఁ బడయుదు గాదే!

ఆమ్రశాఖల వైశాఖ మఁదగించె
గోపబాలుండు వేణువుఁ గుస్వరించె;
ఎండమావులు నీ మనోమండపమున
విడిది సేసినయట్లు కాన్పించుచుండె.

ఎండమావుల కాశ్రయ మిచ్చుచుంట
పూలవానలతో నున్న 'పుక్కిలింత'
నీకు నేర్పంగలాడనే నేడు నేను?
వే వసంతాల వెనుకటి వెలఁది వీవు.

హృదయ మొక కోటి కన్నీటి గదులు గాగ
పిడివడిన నాడు గిలిగింత వెట్టి నీవు

పూలబాణాలతో గదుల్ కూల ద్రోసి
మనసును వసంతశాలగా మలచినావు.

పూచిన వసంతలక్ష్మివై పొంగివచ్చు
నిన్ను సామాన్య వనితగా నెట్లు తలంతు!
కోటి అప్సరోభామల గుండెలందు
అగ్నిపుష్పాలు పూయింతు వంట, నీవు.

తారలు కాలిపోయెడి పథమ్ములలో గగనాంతభాగమం
దేరొ గడాని చీరెలు ధరించి సుధాంధుల కాలఁదన్ను శృం
గారముతో హిమాచల శిఖా మిహికన్ జలకమ్ములాడి నిన్
జేరగ వచ్చుచుండిరి; రచింతువటే సమతాకవిత్వముల్.

చావులో డాగిపోయిన జన్మలెల్ల
మొత్తుకొన్నవి తమగాథ మూఁదలింప;
వ్రాయుదును వాని వ్యథలు వజ్రాల పుటల;
మృత్యు వేశ్యా భుజంగుడ లెమ్మ నేను.



# పూర్ణ పురుష సంస్మృతి

★

'శాస్త్రి'

దేశోద్ధారకులు దివంగతులై అప్పుడే త్రయోదశ వత్సరములైనది అయినను వారి సత్కార్యాచరణ మేదోరూపమున ప్రత్యక్షమై దినదినమును ఆంధ్రులచే వారి పునీతనామము స్మరింపజేయుచునేయున్నది. పుణ్యపురుష సంస్మరణము జాతి కున్నతి సాధనము. అది అనుక్షణమును వ్యక్తియందును, జాతియందును ఆత్మ విమర్శన జ్యోతి వెలిగించి జీవన పథమున నొకయింత వెలుగు వెదజల్లుచుండును, మహాపురుషాదర్శ మనుసరింపలేని జాతిగాని వ్యక్తిగాని ఉన్నత పథ మనుసరింప జాలదు. ఇక స్మృతి మాత్రమున నైన నాత్మవిమర్శన మొనర్పలేని జాతికి పురోగమనమే శూన్యమై పోవునని వేరుగ జెప్పనక్కర లేదు.

కాశీనాథుని జీవనము విశ్వతోముఖమైనది. సామాన్య పౌరుని వలె జీవన రంగమున ప్రవేశించి, అష్టకష్టము లనుభవించి కేవలము స్వశక్తివలననే జాతి నాయకత్వము వహింపగలిగిన యామహాశయుని వైయక్తిక జీవనమే అద్భుతావహమైన యొక వీరపురుష చరితము.

ఆరోజులలో భారతజాతి స్వాతంత్ర్య రణరంగమున కురికినపుడు ధీరతతో ముందు నిలిచి పోరాడి, సామాన్య జాతీయ యోధుని వలె కారావాస క్లేశాదికము లనుభవించుచు జాతిస్వాతంత్ర్య సేనానాయకత్వము వహించిన నాగేశ్వరుని యోధశీల మా మహాపురుషుని చరితమున నింకొక సువర్ణఘట్టము.

సామాన్యముగ వెనుకముందు లాలోచింపకుండ కార్యరంగమున నురుకు కర్మవీరులకు కళాదృక్పథముగాని, వాఙ్మయ వ్యాసంగముగాని యలవడుట మిక్కిలి యరుదు. అట్లే నిత్యమును పరాత్మ పరిశీలనా శీలముగల సాహిత్యోపాసకునికి ధర్మాధర్మ పరిశీలనము లేకుండ కనులుమూసికొనికర్తవ్యరంగమున నురుకుట యొక క్లిష్టసమస్య యగుచున్నది. ఇట్టినిశిత పరిశీలనముగల కవితాత్మకు లోకమంతయు ధర్మమున్న దన్యాయ మార్గముగ గాన్పింపవచ్చును. అట్లే లోక సామాన్యదృష్టికి ధర్మముగభాసించినది అధర్మముగ భాసింపవచ్చును. కనుకనే సారస్వత వ్రతుల చారిత్రము లనేకములు సామాన్య దృష్టికి కేవలమును తాడులేని బొంగరముల వలె విశృంఖల ప్రవృత్తితో నున్నటులు కానబడుచుండును. నిశితమగు ధర్మాధర్మ దృష్టితో నడుగడుగునకు నాత్మ పరిశీలన మొనర్చుకొనుచుండు కర్మవీరుని కితరులకు వలె ద్రుతగమనమున నడుగు పడుట కష్టము. అడుగడ గడుగను కారాగార ప్రవేశాదిక్లేశము లనుభవింపవలసివచ్చినను దేశోద్ధారకుడు దైనందిన పత్రికా వ్యాసంగమునుగాని, సాహిత్య వ్యాసంగమునుగాని విసర్జింపలేదు. ఆంధ్ర వాఙ్మయ చరిత్రము, భగవద్గీతా వ్యాఖ్యానము, ఆంధ్ర, భారతీ పత్రికా నిర్వ



హాణమును, వారి నిత్యసారస్వత శీలమునకు దార్ఢ్యాణములు.

విశ్వవాఙ్మయ చరిత్రమునఁగాని, ప్రపంచ రాజకీయ చరిత్రమునఁగాని, ఈ రెండు విధములగు ప్రవృత్తులను సమన్వయ మొనర్చుకొనుచు పరస్పర వ్యాఘాతము రాకుండ

జీవయాత్ర సాగించిన మహాపురుషులను వ్రేళ్లతో లెక్కింపవచ్చును. ఇవి రెండును సమన్వితము లైనప్పు డుభయప్రవృత్తులకును నొక యలౌకికమగు సమతూలనా సౌందర్యము లేర్పడును. నాగేశ్వరని రాజకీయ జీవితమువలె సారస్వత జీవితముకూడ జాతి కళా వైజ్ఞానిక పురోభివృద్ధుల కనుదినమును ప్రోదిచేసినది. ఇంతవరకును సమగ్రముగ రచింపబడని వారి జీవచారిత్ర గమనమున నిదికూడ మరియొక మాణిక్య సోపానమే.

నాగేశ్వరుని రాజకీయ నాయకత్వమునకు మురిసిన ప్రజావాణియే వారిని దేశోద్ధారకులని కీర్తించినది. ఇది మహాత్ముని 'మహాత్మ' బిరుదమువలె ప్రజాగళమునుండి స్వయముగ నావిర్భవించినది. ఇట్లే విశ్వవిద్యాలయము వారిని గౌరవించి యర్పించిన "కళాప్రపూర్ణ" బిరుదమును, అనాసక్తి యోగశీలుడగు మహాత్ముడే స్వయముగ వారి కర్పించిన 'విశ్వదాత' బిరుదమును త్రివేణీ ప్రవాహమువలె త్రివిధముగా బ్రవహించిన వారిదైనందిన జీవనమునకు దార్కాణములుగ స్ఫురించును.

నేడు మన సంస్కృతి దృక్పథము, తారుమారైనటులున్నది. ఎవరైన దానశీలురున్నచో వారిని నవీనసంస్కృతి విధాతలు అహంభావపూరితులుగను, గర్వపూరితులుగను ఆత్మస్తోత్ర శీలురుగను చిత్రించుచున్నారు ఇది సరికాదు. అధమ దాతలైన వారిలోనే ఈ గుణములతో దానశీల మవలంబించుట కాననగును.

అసలీ దానశీలత సంపూర్ణమగు భారతీయసంస్కృతి దృక్పథమువల్ల నేమనజాతిలో జనించినది. ఈ సంస్కృతి నాకళించుకొనిన దాత అహంభావాదులతో నెన్నడును దాతృత్వ మవలంబింపలేడు. భారతీయ ధార్మిక సంస్కృతి నాకళించుకొన్న ధనికులకు తమ ధనమున దమకే మాత్రము స్వత్వము లేదనియు, తామత్యధికముగ గూడబెట్టిన ధనమునకు తాము కేవలమును ధర్మకర్తలము మాత్రమే యనియును దెలియును. భారతీయ ధర్మము సమగ్రముగ నవగాహన మొనర్చుకొన్న మహాత్ముడీ ధర్మకర్తృ సిద్ధాంత మాలంబనముగ గైకొనియే నేటి కాలపు మన జటిల సమస్యలన్నియు బరిష్కరింప బ్రయత్నించెను.

ప్రపంచ పాశ్చాత్య మేధావు లనేకులు నేటి సమస్యలను ఆర్థికముగను, రాజకీయముగను, సాంఘికముగను వేరు వేరుగ విభిన్న దృక్పథములతో పరిశీలించి, విభిన్న పరిష్కార మార్గములు సూచించిరి. వీరి యాశయాదర్శము లెట్లున్నను ఆచరణలో నవి నేడు ప్రళయభీషణ సమరమునకు దారి తీయుచు నొండొంటితో భయంకరముగ దలపడుటకు సిద్ధమగుచున్నవి. భారత సంస్కృతి నిర్ణేతలీసమస్యలు వేరు వేరుగ స్వీకరింపక, వ్యక్తిస్వార్థాహంకారాదులే వీని కన్నిటికి మూల బీజములనియు, వ్యక్తిలో సహజముగ ధర్మశీలత, అనాసక్తత్వము, ఉదారదృష్టియు అలవడినగాని, ఈ సమస్యలు సమూలముగ, నిశితముగ బరిష్కరింపబడ జాలవనియు నిశ్చయించి, వ్యక్తులలో నీవిధమగు సంస్కృతి బీజము లుద్భవింప జేయుటకు బ్రయత్నించిరి. భారతీయులు కేవల వ్యక్తికిగాని, కేవల సంఘమునకుగాని పారమ్య మంగీకరింపక,యీ వ్యక్తి

సంఘములు రెండును పరస్పరాశ్రితము లయిన భావములనియు, పరస్పర శ్రేయోమూలకమగు నొక ధర్మసూత్రము పరమప్రమాణముగ స్వీకరించినపుడే యీ రెండిటి సంపూర్ణాభివృద్ధికిని అవకాశము లేర్పడుననియు భావించిరి. అసలు అనాసక్త ధర్మ ప్రధానమయిన వారిదృష్టిలో వ్యక్తికిని సంఘమునకును ఈ నాడు కలిగినంత ప్రబల సంఘర్షణ మేర్పడుట కవకాశమే లేదు.

విశ్వదాత సహజముగ నీసంస్కృతి కాలవాలమయిన కుటుంబమున బుట్టి పెరిగిన వారు. ఆపై హైందవధర్మ గ్రంథమగు భగవద్గీత నామూలాగ్రముగ నాకళించుకొన్నవారు. మహాత్మునికివలె వారికి గూడ భగవద్గీతయే అను క్షణమును జీవన పథ దీపిక యైనది. కావుననే సహజముగ వారిలో నీయుదారాశయములు మొలకెత్తి వర్ధిల్లినవని తోచుచున్నది. కావుననే ఆ మహామహునికి మహాత్మునివంటి లోకోత్తరపురుషునిచే 'విశ్వదాత'యనికీర్తించుకొనగల దివ్యభాగ్య మబ్బినది. ఈ తరము వారిలో చాలమందికి భారతీయ సంస్కృతిలోని ప్రధాన సూత్రము లాకళించుకొనుట గూడ దుష్కరమై పోవుచున్నది. మన పురాతన సంస్కృతిని సంపూర్ణముగ తిరస్కరించినపుడు మానవతాధర్మ శూన్యమైన మరియే యాంత్రిక సంఘ సంస్కార మార్గమైన నవలంబింపక తప్పదు. నేటి ప్రపంచ సంక్షోభకారణమైన ఈ సమస్య సాధనకు శుష్కధర్మోపన్యాసకులుగాక, ఆ ధర్మోపన్యాస సారముమూర్తి కట్టిననాగేశ్వర రాయునివంటి మహాపురుషులే యొక్కుడుగ నాదర్శమూర్తులగుచున్నారు.

నేటి కాలమున నాంధ్రదేశమున నుద్భవించుచున్న రాజకీయాంధకారములో గూడ పంతులుగారి జీవిత మొక దివ్యతేజోదీపిక. ఆంధ్రదేశమున నేడుభయపక్షముల వారును నించుమించుగ కేవల మధికార పానతృష్ణతో తప్పటడుగులు వేయుచున్నట్లే కనిపించుచున్నది. ప్రజారాధన తత్పరులను ప్రజలే స్వయముగ నాయకులుగ వరింతురు. అట్టివో నాయకుల కధికారమునకై యగ్రులు చాచు నీ యహమహమిక యెందులకో తెలియదు. అధికారమును, ధనమును ధర్మాచరణమున కుపయోగింపక కేవలమును అధికార వాంఛా పరిపూర్తికే దారితీసినచో నవి యాయా వ్యక్తుల సమూల నాశనమునకే దారితీయుననియు మన సంస్కృతి నిర్ణేతలు గుర్తెరిగి, వీటిని ప్రజారాధన కుపయోగించుటయే పరమధర్మమని యాదేశించిరి.

నాగేశ్వర రాయనికి ఐశ్వర్యాధికారములు సంపూర్ణముగ హస్తగతములైనను ఆ మహాపురుషుడు వానినొక ధర్మకర్తగనే చేబూని నిర్వహించెననుట యొక చారిత్రక సత్యమును పునరుద్ఘాటించుటయే యగును. యీ విషయ మిపుడా మహాపురుషుని పుణ్యస్మరణ సందర్భమున గేవలమును స్తోత్రము చేయుటకుగాక, నేటి రాజకీయ నాయకుల యాత్మ విమర్శనమునకే మరల మరల జ్ఞాపకము చేయుచున్నాము.

కాంగ్రెసులో రాజకీయ నాయకులై యాంధ్ర రాష్ట్ర ప్రాప్తికిని, యాంధ్ర దేశీయ సర్వతోముఖాభ్యుదయమునకును వారు తమ జీవితమును ధారపోసిన విషయము నేటి

రాజకీయ నాయకుల కింకరు నొక సుదూరాదర్శముగనే యున్నది.

ఆంధ్ర, భారతీ పత్రికా వ్యవస్థాపక సంపాదకులై వారాంధ్ర విజ్ఞాన సర్వస్వమున ఆంధ్రులకు సర్వతోముఖవిజ్ఞానమును వెదజల్లుటకు చేసిన కృషి యాంధ్రులింకను పూర్తిగా గ్రహింప వలసియే యున్నది.

కేవలము స్వయంకృషి వలన నఖండైశ్వర్యము నార్జించియు నిర్లిప్తులై ఆంధ్ర దేశీయ సాంస్కృతిక సంస్థలన్నింటిని మాతృవాత్సల్యముతో సంరక్షించిన వారి యవ్యాజౌదార్యము నేటి ఐశ్వర్యవంతులలో చాలమంది కొక అప్రాప్యమగు లక్ష్యముగనే కానిపించు చున్నది. మరి యీసమస్య వీరుగాని సాకల్యముగ పరిష్కరింపక పోయినచో నది ప్రపంచముననే గాక భారత దేశమునను, ఆంధ్రమునను గూడ ప్రళయ ముద్భవింప జేయగల సూచనలగపడు చున్నవి.

పంతులు గారిలో నంత రాంతరములో పాదుకొని యున్న ఆధ్యాత్మిక దృక్పథము కూడ పైవాని కన్నింటికిని మూలభూతమైనదిగ మనము ముఖ్యముగ నొకసారి స్మరింపవలసియున్నది. వారు ఎన్నోవిధముల బాహ్య ప్రవృత్తిలోమునిగియున్నను సహజముగ నాధ్యాత్మిక భావసంపన్నులు. ఆయన సంపదలతో తుల దూగు చున్న కాలమున గూడ నొక్కదినమునను పరమేశ్వర పూజాభావము నేమరలేదు. కేవలము వారి ఛాయాచిత్రము పరిశీలించిన వారికి గూడ ఆర్ద్రమును, నిర్లిప్తమును, నిరాడంబరమును నగు ముఖభంగిమ స్పష్టముగ గోచరింపగలదు. ఆయన కేవలమును గీతాపారాయణముతో దృప్తినంద లేదనియు, అందలి ప్రతిశ్లోకమును ఆచరణలోనుంచుటకు ప్రయత్నించిన సాధకులనియు వారి పీఠికా సంపాదకీయములు పఠించినవారికి గోచరింప గలదు. నిశితమును అంతరాంతరములో గర్భితమును, బాహ్యాడంబరశూన్యమును నగు నాపూర్ణ పురుషుని ఈనిరంతరాధ్యాత్మిక భావమొక దివ్యజ్యోతియై వారి జీవనమునకు పరిపూర్ణత్వమును, సాఫల్యమును జేకూర్చి తేజస్వంత మొనర్చినది.

నాగేశ్వర రాయుని జీవన మంతయు పరిశీలించువారికి తిక్కనామాత్యుని యీక్రింది పద్యము స్మృతి పథమున స్ఫురించును. తిక్కన యీక్రింది పద్యమున సకల భోగ పరిపూర్ణుడును, నిర్లిప్తతతో నిత్యమును ధర్మశీలుడును నగు నొక రాజర్షిశీల మభివర్ణించినాడు. మనవారు రిక్తులకు విరక్తి మార్గ ముపదేశింపలేదు. అట్లుపదేశించినను ప్రయోజనము గూడ నుండ జాలదు. మరి సకల భోగ సంపత్తి కల వానికే వారీధర్మ మాదేశించినారు. ఆధర్మమును సంపూర్ణముగ నాచరణలో నుంచిన దేశోద్ధారకుని పుణ్యచరిత్రమే యీ మహాకవివాణి స్ఫురింప జేయుచటులున్నది.

రాజవు! రాగహీనుడవు!
  రాజిత సుందరమూర్తియట్టె! వి
భ్రాజిత సంపదున్నతవి
  భాసిత వర్తనుడట్టె! కామినీ
రాజిమనోజ్ఞ భంగిచతు
  రత్వధనుండవు! బ్రహ్మచర్యదీ
క్షాజిత మన్మథుండవు!
  జన్మము లిట్టివి యెందుఁ గల్గునే!

# హస్తక్షేపము



శ్రీ తల్లావఝ్ఝల శివశంకర శాస్త్రి

౧

"తమ కోమలహస్తము దీయ దగున్
ఘుమతోడ మందసమునుండి వెసన్!
భ్రమరంబును మాత్రము సైచు నెటో,
కమలంబు విహంగము నోర్చు నెటుల్?"

ఆతని పార్శ్వములందును వెన్కన్
ప్రీతమనస్కులు పెద్దలు కొల్వన్
నూతననాట్య మనూనవిలాస
స్ఫీతము సాగెను వెన్నెలరేయిన్.

౨

కోమల మంచును కోపముతోనే
భామిని, అంటివి—బాగు సరేలే!
ఏమని యెంచితి, వియ్యది హస్తం
బా, మదేభ కరమా, కుసుమాంగీ!

స్వీయభుజంబున చేయిడ నొక్కం
డే యది సిద్ధమహీశుడు చేసెన్
ప్రేయసి, ఓపిక పెట్టి వినంగా
న్యాయము—సమ్మతమా, లలితాంగీ!

సిద్ధనృపాలక (శ్రీ)జయసింహుం
డిద్ధర ఘూర్జరు నెల్లరు కొల్వన్
వృద్ధిని గాంచుచు వీరత, విద్యా
బుద్ధుల వృద్ధయి పొల్చెనలారెన్.

వేడుకతో పృథివీపతి పోయెం
జూడ విభావరి సుందరవేళన్
ఆడెడి నాటక మాలయసీమన్
ప్రౌఢ నటావళి పూర్ణసమాఖ్యన్.

ఆ జనసంఘమునం దొక హస్తం.
బోజను పార్శ్వమునుండి యథేచ్ఛన్
రాజభుజంబున వ్రాలిన దే!— ఉ
త్తేజము నొందక ధీరతతోడన్ —

స్వీయ కరమ్మున వీడెము కస్తూ
రీయుత ముంచెను రేడు ప్రియా, ఆ
వ్యాయతహస్తమునందున, కన్నుం
దోయి మరల్పక తూర్ణముగానే

ఆవల నాటక మంతయు కాగా
భూవిభు, డల్లన పోయెడివానిన్
ఆవలితాననుడై కనుగొంచున్
సేవకునోటను శీల మెరింగెన్;

స్వీయభుజమ్మున చే యిడువానిన్
ఏమెడ నుండిన నిచ్చటికిం దె
మ్మోయి, యటంచు నియుక్తుని జేసెన్
నాయకు, నామరునా డుదయానన్.

భీతమనస్కుఁడు వెల్లుగ, పృథ్వీ
నేతను గాంచి వణిక్సుతు డంతఁ
చేతులు మోడిచి శీర్షము వాల్చెఁ
ఆతురతఁ సభ నందరు చూడఁగ.

వసుధాభరముఁ వహియించెడి యీ
యసమానభుజం బవనీశ్వర, యీ
పసివాని తృణప్రతిమాన కరా
భ్యసనంబు భరింపగ జాలదొకో!

3

దరహాసముతో తన యంసముపై
కర మూని, వణిక్తనయుం గనుచుఁ
ధరణీధవు డాదరవాక్కున, 'త్వ
త్కరభారపు బాధ శమింప' దనెఁ.

సమయోచితమౌ సరసోక్తి ప్రయో
గముచేత సభాగతు లోహో యనఁ
సుముఖుం డను రాజు వణిక్కునకుఁ
సమకూర్చె విశేష బహూకృతులఁ.

అతిభీయుతుడై అరుదెంచు వణి
క్సుతు డానృపవాక్సుధ గ్రోలుటచే
మతి చల్లబడఁ, మహికాంతునితో
చతురంబుగ నీసరణిం బలికెఁ:

జయసింహ మహీశ్వరు డెంత జన
ప్రియుడో, రసికప్రియుడో తెలిసెఁ.
దయ చూపగదే దయితా, సమయ
వ్యయ మేమిటికే బహుమానముకు



కథానిక :

# పొగచూరిన గోడలు

●

శ్రీ బొమ్మిరెడ్డిపల్లి సూర్యారావు

ఒకబండీ, రెండెడ్లూ ఒకచిన్న మడిచెక్కా, తాటిపెండె—ఇదీ తన ఆస్తి. దీని సిగ తరగా, వొంటికి ఏభైఏళ్లొచ్చాక యీ మాత్రం చేసుకోవడానికి యింటిల్లపాదీ రెక్కలు విరుచుకోవలసివచ్చింది. ఛీ ఎదవబతుకు! అనుకున్నాడు అప్పన్న. అయితే యీ వూరిలో యీ మాత్రం ఎవడి కుంది, అని సంతృప్తిపడ్డాడు మళ్లీ.

బాగా రాత్రయిందేమో చీకటి దట్టంగా కాటుకలా వుంది. అయితే నేం, తన వూరు పొలిమేరకు వచ్చేశాడు అప్పన్న. ఈ ప్రదేశంతో తనకు ఏభైఏళ్ల పరిచయముంది. ఇంక తను కళ్లు మూసుకుని యింటికి చేరుకోగలడు. చెరువుగట్టుమీద, పురుగూ బుట్రా కాళ్లలో పడకుండా చేతిలోని మువ్వకట్టిన చేపాటి కర్ర చప్పుడు చేసుకుంటూ నడుస్తున్నాడు అప్పన్న. అంతా అతి నిశ్శబ్దంగా వుంది. కనుచూపు మేర దూరంలో, తన వూరిలో వొకటి రెండు దీపాలు వొకటిరెండు చిన్నచిన్న చలిమంటలు మసకమసగ్గా కనిపిస్తున్నాయి. ముసలితనంలో కొంచెం రేచీకటుంది అప్పన్నకి. అయినా అది తన పనుల కేమీ అడ్డురాలేదు యింతవరకూ. చెరువుగట్టుమీద వో నిముషం నిలబడి తలెత్తి వూరువేపు చూశాడు. చీకటిలో దృష్టి కేదీ సమంగా ఆనలేదు. ఇదేమిటీ వూరు అప్పుడే నిద్రపోతూందేమిటి అనుకున్నాడు. ఈవూరు తన తల్లితండ్రులు, తాత ముత్తాతలు, తను పుట్టిపెరిగిన వూరు. కాని యిప్పుడు యీ వూరంటే అసహ్యమేస్తూంది; వొళ్లు మండుతూంది. ఊళ్ళో ఎవళ్లకీ తాగడానికి గంజినీళ్లు లేవు. కాని బుర్రతిరుగుడు చూస్తే ఎక్కువ. మంచీ, మర్యాదా, న్యాయం, ధర్మం అనేవి ఎవరిదగ్గరా లేవు; ఎవడికీ బతకడం చాతకాదు; ఎవడైనా బతుకుతూంటే చూడలేరు. ఎవడూ మంచిగా వుండడు; ఎవడైనా మంచిగా వుంటే వుండనివ్వరు. తను కొత్తగా బండీ, ఎడ్లూ, కొన్నాడు. ఊళ్లో ఎవడికీ యిటువంటి ఎడ్లుగాని, బండిగాని లేవు. ఊరంతా కలిసి ఓ వందకొంపలున్నా పట్టుమని నాలుగుజత లెడ్లు లేవు. అవి కూడా రేపో ఎల్లుండో చచ్చేటట్లుంటాయి. అంచేత యీవూరివాళ్లందరికీ కడుపుమంట. ఛీ! అనుకుంటూ నడుస్తున్నాడు.

ఊళ్ళో అందరూ అసలే దరిద్రులు. దానికి తోడు చాలమంది సోమరిపోతులు. డబ్బంటే అందరికీ ఆశే. కాని ఎవడికీ ఆర్జించడం చాతకాదు. ఒకపూటకి గంజినీళ్లు దొరికితే రెండుపూటలు పని చెయ్యరు. కాని ఎవడైనా కష్టపడి సంపాదించుకుంటే మాత్రం చూడలేరు. అందరికీ దేవుడంటే పరమభక్తి, అతిభయం. కాని అంతా పాపాలు చేస్తూనే వుంటారు. చిత్రం!

తనంటే వాళ్ళకి ఈర్ష్య. తనకిమాత్రం ఏముంది? తన తండ్రి తనకాయిల్లూ, యీ చేపాటి కర్రా వదిలిపెట్టాడు. తన కష్టార్జితంగా ఎడ్లూ ఓమడిచెక్క సంపాదించేడు. ఈమధ్యబండీ ఎడ్లూ కొన్నాడు. అయితే తను కష్టపడి పనిచేస్తాడు. తన పెళ్ళాం పొలంలో పనిచేస్తుంది. కూతురు వీధిలో బండరాయిమీద చిన్న దుకాణం పెట్టి ఎండుచేపలూ, గోంగూర, మిరపకాయలు, వుల్లిపాయలు అమ్ముతుంది. పేడ తెచ్చి, పిడకలు పెట్టి బ్రాహ్మలకూ; కోమట్లకూ అమ్ముతుంది. కొడుకు చిన్నవాడైనా మంచి ప్రయోజకుడు. ఇలా యింటిల్లపాదీ కష్టపడి నాలుగు రాళ్ళు చేసుకుంటే వూరిబాబుగారి సొమ్మేదో పడేసుకున్నట్టు యీ వూరివాళ్ల కెందుకు కడుపుమంట?

తను బండీ, ఎడ్లూ కొన్నాక తన జాగాలోనే తన యింటిపక్కన సాల వేసుకుందామని, బ్రాహ్మలింటికెళ్లి మంచిరోజు కనుక్కుని, నేరడురాట తెచ్చిపాతేడు. ఊరువాళ్లందరికీ మహా కడుపుమంటగా వుంది. వీడు సాల ఎలా గేస్తాడో చూడమా అంటూ నలుగురూ చేరేరు. సాలవెయ్యడానికి వీలులేదన్నారు. అది తన జాగా అన్న విషయం లోకమందరికీ తెలు

పన్నాడు తను. వాళ్లు కాదన్నారు. అయితే మరి ఎవరిది? ఏ వొక్కడికీ ఆ జాగా తనదని చెప్పడానికి గుండె ల్లేకపోయాయి. అందులో వో తెలివైనవాడు, ఆ జాగా ఎవరిదీ కాదు అమ్మవారిదన్నాడు. ఇంకేం, మంచి సాకు దొరికింది. ఆ జాగాకి కొంత దూరంలో వొక రాయి వుంది. దానికి పూజా పునస్కారం జరుగుతుంది. కాని యీ జాగా మాత్రం తనదే నన్నాడు. కావేషీలు, పెరిగాయి; దొమ్మలాట జరిగింది. కోర్టు కెక్కుతానన్నాడు కాని కేసు పోతుందని తెలిసి వాళ్లు వూరుకున్నారు. కాని అప్పటినుండీ వాళ్లకి మరీ కడుపుమంటగా వుంది; కావేషీలు బాగా పెరిగిపోయాయి.

వాళ్లకి మనసులో కోపముంటే నాదగ్గర కొచ్చి చూపెంచరాదా? నోరు లేని జంతువు అదేం చేసింది? అనుకున్నాడు అప్పన్న. సలసల కాగిన గంజి తెచ్చి తన ఎద్దుమీద పోశారు; అరిచెయ్యి మేర నర్మ, కాలిపోయింది. ఎంత బాధ పడుతూందో? అరవదు, లేవదు, గడ్డి తినదు, కుడితి తాగదు. పాపం నోరు లేని జంతువు అదేం తప్పుచేసింది? అనుకుంటూ మెల్లిగా నడుస్తున్నాడు.

పోన్నారు మంగలాడికి పశువుల వైద్యం తెలుసునంటే అక్కడికి పరిగెట్టేడు అప్పన్న. వాడు పావలా పుచ్చుకుని నూనెలో మందు కలిపిచ్చాడు. ఈ నూనె రాసి జిల్లేడాకేసి కట్టమన్నాడు. రెండు రోజులకల్లా పుండు నల్లగా మాడిపోతుంది చూసుకోమన్నాడు. చేతిలో పట్టుకున్న కొబ్బరిచిప్పలో నూనె వుందో వొలికిపోయిందో అని వేలు పెట్టి చూసేడు అప్పన్న.

కొంచెం దూరాన్న మామిడిచెట్లమధ్య నల్లమారమ్మగుడి తెల్లగా కనిపిస్తూంది. లోపల చిన్న దీపం కూడా వెలుగుతూన్నట్టుంది. గుడివేపు తిరిగి, చేతిలో చిప్ప నేలపెట్టి దండం పెట్టుకున్నాడు. "తల్లీ, నల్లమారమ్మ, రచ్చించు తల్లీ, ఎద్దు నేచి తిరుగుతే నీకు కోడిపిల్ల నిచ్చుకుంటాను తల్లీ" అని మొక్కుకుని మళ్లీ నడక మొదలెట్టాడు అప్పన్న. కాలి కేదో గట్టిగా తగిలింది. "హైహ దీని సిగ్గొయ్య. ఏటది? నాగలిదుక్క. అరి! ఈళ్లు నా దారి కడ్డంగా వొగ్గిశారేటి?" అని తిట్టుకుంటూ కాలుతోటి దానిని చెరువులోకి తోసేశాడు. చెరువులో నీరు లేదులే తుమ్మచెక్క నానిపోవడానికి అనుకున్నాడు. తన వూరుకూడా యీ చెరువులాగే వుంది. పంటనూర్పులైన నాలుగు రోజులూ వూరు కలకలలాడినట్లే వర్షాలు పడిన నాలుగురోజులూ చెరువులో నీళ్లుంటాయి తరవాత కొలనుంతా చెరువుగర్భంలో బారెడుమేల బురదనీళ్లు; ఊళ్లో కొంచెం గంజి నీళ్లు,—అంతే. ఛీ! ఏం బతుకు! అనుకున్నాడు.

ఊరు దగ్గరపడింది. ఈ గట్టు దాటితే వూరు. చీకట్లో ఒక కాగడా, డోలక్కు భజనా తనవేపు వస్తున్నాయి. "నారాయణ, నారాయణ" అనుకుంటూ ఎవరో శవాన్ని మోసుకొస్తున్నారు. "ఇదేటి యింటికాడ కొస్తుంటే శవ మెదురుపడింది? చీతారాం, చీతారాం" అనుకున్నాడు అప్పన్న. బూరుగు చెట్టుకింద కొచ్చేసరికి భజన దగ్గరపడింది. మాలాళ్లు భజన చేస్తున్నారు. ఆ వూరికి భజనపార్టీ అదొక్కటే. ఎవరు చచ్చినా యీ మాల చిన్నిగాడి భజనపార్టీని పిలుచుకు పోతారు.

"ఎవరురా సిన్నిగా" అన్నాడు అప్పన్న.

"గొల్ల రామయ్య కొడుకు"

"అలాగా" అన్నాడు అప్పన్న పరధ్యాన్నంగా.

"రెండు మేకలున్నాయి గదా, నాలుగు రెమ్మలిరుద్దామని బాపనోళ్ల రావిసెట్టెక్కినాడు. నాగుపాము కుట్టేసింది."

"రామ, రామ"

"అక్కడ నాగుపాముందని అందరికీ తెలుసు, ఆడికీ తెలుసు. కాని ఆడి కరమం కాకపోతే ఆ మారాజు జోలి కెందుకెళ్లాలిడు, సెప్పు? మంత్రాలు తంత్రాలు ఏయించినారు. కాని ఏటి నాబం?" అని చెప్పుకెళ్లిపోతున్నాడు సిన్నిగాడు. అప్పన్నకిదంతా వినాల్నని కుతూహలం లేదు. "పోనీ సేరా, ఎందుకా సొద, ఆడి కాయురుదాయం సెల్లింది. ఎవ డేటి సెయ్యగలడు. కాని సిన్నిగా, మాయింటివిప్పుగాని ఎల్లినావేట్రా, ఎద్దు కెలాగుందో ఏమైనా తెలుసా" అన్నాడు అప్పన్న ఆత్రుతగా.

"నీ ఎద్దు కేట్రా. మారాజులా గుంది. చాకలి సత్తిగాడు దిష్టి తీసి జిల్లేడాకు కట్టమన్నాడట. నీ కోడలు కొడవలి కాల్చి, అగ్గి తీసి, బుగ్గితీసి దిష్టితీసి పెంటమీద వొడేసింది. జిల్లేడాకు లేరి ఆవడంలో

ముంచి కట్టేసింది. ఎద్దు మారాజులా నెగిచి తిరుగుతూంది," అని చెరచెర నడిచివెళ్లేడు సిన్నిగాడు. తన్ను వదిలిపెట్టి భజనపార్టీ వెళిపోతూంది. పరుగెత్తి వెళ్లి కలుసుకొన్నాడు. "గూటిలోని రావసిలకా గూడు దాటీ పోయెరా..." అని పాడుకుంటూ భజన పార్టీ సాగిపోయింది. "అమ్మయ్యా, బతికింది ఎద్దు. ఇంతకీ తన పెళ్లాం తెలిసైంది," అనుకుంటూ తాటి పెండెలోంచి నడిచేడు అప్పన్న. ఇల్లు దగ్గరపడింది. ఇంకేముంది ఈ తాటిపెండె దాటితే తన యిల్లు.

"అమ్మయ్యా, ఎద్దు బతికింది. తల్లి మాలచ్మి, నల్లమారమ్మ రచ్చిత్తే యీ వూరోళ్ళేటి సెయ్యగలరు" అని మళ్లీ ఆలోచనలో పడ్డాడు. ఎద్దు చస్తే నూరు రూపాయలు నష్టం. కానీ పరకా, గనుక నా—ఇంతకీ తన పెళ్లాం పిల్లలూ అదృష్టవంతులు. ఈ బండి-కాని సంతలకి తోలితే వొకేసారికి అయిదారురూపాయలు దొరుకుతాయి. పట్టుమని నాలుగు నెలలు తోలితే నూరురూపాయలు చెయ్యవచ్చును. కూతురికి భజంత్రీ మేళం, గేసులైటూ పెట్టి పెళ్లి చెయ్యొచ్చును. పట్నం సంబంధమే చెయ్యాలి. పట్నం పోతే నాలుగు మెతుకులు తింటుంది. ఛీ. వూళ్ళో సంబంధంమాత్రం చస్తే చెయ్యకూడదు. గంజికి లేని దరిద్రులు.

గొల్లుమని గోల వినిపిస్తూంది. పరధ్యాన్నంనుండి వొక్కసారి మేలుకొని తలెత్తి చూసేడు. ఇంకేముంది ఊరు అంటుకుంది. మంటలు ఎర్రగా ఆకాశానికి ఎగురుతున్నాయి. "ఓరి బాబోయ్, సాలలో ఎడ్లుండి పోనాయ్ బాబో, యిప్పినారో లేదో..." అని అరుచుకుంటూ పరిగెత్తేడు అప్పన్న.

ఊరంతా అల్లకల్లోలంగా వుంది. మంచాలూ, చింకిపాతలూ అవీ దారికడ్డంగా పారేశారు. ఆడాళ్లూ పిల్లలూ అటూ యిటూ పరుగెడుతున్నారు. ఏడుపులు మొర్రలు, తిట్లు, శాపాలు.

అప్పన్న పరిగెత్తుకుంటూ ఇంటిదగ్గర కొచ్చేడు.

"ఎడ్లు, ఎడ్లు, నచ్చీ" అని కేకేశాడు. లచ్చి ఏడుస్తూ, తిట్టుకుంటూ వచ్చి "ఇప్పేసి బాపనోళ్ల దొడ్లో వొగ్గిసినాను మామా" అంది. అప్పన్న మనసు కొంచెం కుదుటబడింది. తన సాల కాలిపోయింది.

బండి కాలుతోంది. దగ్గరి కెవ రెళ్లగలరు? ఎవ రార్పగలరు?

"మన సాలకి జాతిసచ్చినో డెవడో ఆగ్గెట్టేసినాడు" అంది లచ్చి తిట్టుకుంటూ. పల్లెటూర్లో ఇంటికి నిప్పుపెట్టడం అతి తేలిక, అతి సాధారణం. "సూడలేని యెదవ మన సాలొక్కటే కాలి వూరుకుంటుందనుకున్నాడేటి" అని, వేపచెట్టు కిందకొచ్చి రాతిబండమీద కొచ్చి చతికిలబడ్డాడు. అప్పన్నకి మతిపోయింది. అతడి కేమీ అర్థం కావడం లేదు.

మంటలు పూర్తిగా ఆరిపోయాయి. ఊళ్లో అల్లరి సద్దుకుంది. "ఊళ్లో సగం కొంప కాలిపోనాది, మామా" అంటూ లచ్చి దగ్గరగా వచ్చి అప్పన్న వొంటిమీద చెయ్యివేసింది. అప్పన్న వొక్కసారి కళ్లెత్తి లచ్చి వేపు చూసేడు.

"ఎలాగున్నావ్"

"బండి కాలిపోయింది. మళ్లీ బండి సేయించాలంటే ఎనబైరూపాయిలవుతాది, ఎక్కడ తెచ్చేది సెప్పు?"

"సరి నే, మన మేటి సెయ్యగలం. నేను, మంచమేత్తాను తొంగుందువుగాని..." అన్నాది లచ్చి.

"ఆళ్లు బతకనేరు, యింకోరిని బతకనివ్వరు. ఎదవ జలమ. మనిసిజలమ ఎత్తగానే సరా." అంటూ లేచి, చెవిలోంచి చుట్టపీక తీసి ఎలిగించి, చెట్టుకింద మంచంమీద నడుంవాల్చి పడుకున్నాడు అప్పన్న.

చీకట్లో ఆకాశంమీది చుక్కలు మిలమిల మెరుస్తున్నాయి. వేపచెట్టుమీద గబ్బిలాలు రెక్కలు చప్పుడు చేస్తున్నాయి. అప్పన్నకి నిద్ర పట్టడం లేదు. ఇలా తనీ వూళ్ళో ఎంతకాలం బతగ్గలడు? ఊరంతా విరోధులే. తనెవ్వరికీ వుపకారం చెయ్యని మాట నిజమే. కాని తను ఎవ్వరికీ అపకారం కూడా చెయ్యలేదు. తను ఎవడికడుపూ కొట్టి అన్యాయంగా డబ్బు సంపాదించలేదు. తను రెక్కలు విరుచుకుని, చెమటోడ్చి నాలుగురాళ్ళు చేసుకున్నాడు. అయితే మరి వాళ్ల ఈర్ష్యకు కారణమేమిటి? దారిద్ర్యం, మూర్ఖత్వం, అజ్ఞానం, అవినీతి వ్యాపించివున్న యీ వూళ్ళో కానీ లాభ ముందంటే ఎటువంటి పాపాలు చెయ్యడానికైనా వెనుదియ్యరు. అయితే తన్ను బాధించడంవలన వాళ్లకేమిటి లాభం? ఏమీ లేదు.

కాని నీతి అన్నది పూర్తిగా చెడిపోయినతరువాత పచ్చగావున్న వాడిని చూడలేక పోవడమే నీతి

అయింది. అయితే పిల్లతో విరోధంగా యీవూళ్ళో యింక బతకడం కష్టం. వాళ్లతో రాజీ చేసుకోవాలి, అని ఆలోచిస్తూండగా ఎప్పుడో నిద్రపట్టింది అప్పన్నకి.

"సెగు, సెగు తెల్లోరింది." అన్నాది లచ్చి.

అప్పన్న లేచి కళ్లు నులుపుకొని, చుట్ట వెలిగించి, కాలిపోయిన మొండిగోడలవేపు చూసేడు - అప్పటికే అంతా యిళ్లు తుడుచుకొని, యిళ్లల్లో సామాను సద్దుకుని వీధుల్లో తిరుగుతున్నారు. వెదురు బద్దలూ, తాటి కమ్మలూ, వున్నవారు వొక రిద్దరు, నేతకూడా మొదలు పెట్టేరు. ఎవరి మొహాల్లోనూ యిళ్లు కాలిపోయాయనే విచారం ఏమీ లేదు. అప్పన్నకెందుకో ఆశ్చర్యమేసింది—

"ఇళ్లు కాలిపోతే మారాజుల్లా తిరిగేస్తున్నారేటి ?" అన్నాడు అప్పన్న—

"నేకపోతే వురెట్టుకోమంటావేటి ! మంచోడివే—" అంటూ లచ్చి మంచం ఎత్తి యింట్లోకి పట్టుకుపోయింది—అవును నిజమే, ఈ నెథవ వూరు ఏడాదికి రెండుసార్లయినా కాలుతుంది. రోజూ చచ్చేవాడి కెక్కడకని ఏడుస్తారు.

"నచ్చి, ఇలా బతకనేమే యీవూర్లో. ఎంత కాలమేటి యీ ఇరోదం." అన్నాడు అప్పన్న.

"ఏటి సేత్తారేటి ? జాతిసచ్చిన యెదవలు! రానీ కళ్లాపు జల్లుతాను. తీసేరా నాయనా, నా దగ్గ రీ యాసాలు—"

"నచ్చి, నీకు గ్యానం లేదే. నువ్వే కయ్యానికి కాలు దువ్వినావు. మొదటి కాడినుంచీ, ఆడోళ్ల నందరినీ నోటికొచ్చినిట్టు తిట్టినావు—అల్లని నానా మాట లాడినావు. తప్పు కాదా ?

అల్లతో యిరోదం ఏటి నాబం సెప్పు ?" "అంటూ బోధపరిచాడు. లచ్చికి డబ్బుందన్న గర్వం లేకపోలేదు. తక్కినవాళ్లందరినీ తక్కువగా చూడడం, నానామాట లాడడం కూడావుంది.

"అయితే ఏటి సెయ్యమంటా వేటి ? అల్లకాళ్లొట్టుకోమంటా వేటి ?"

"అది కాదే ఎర్రిదానా, అల్లతోటి యిరోదం మానుకొని, కలిసి మెలిసి నడుసుకపోతే సరి. అల్లతో, యిరోదం పెట్టుకుని మనం బతకనేం. ఇయ్యాలతో రాజీ అయిపోవాల—" అని లేచి నాలుగు చల్ది మెతుకులు తిని కరణంగారింటికి బయలుదేరేడు.

కరణంగారి యిల్లు పెంకుటిల్లు. ఇంటిముందు ఎత్తుటరుగు లున్నాయి. ఈ అరుగులకి పక్కనే వున్న వేపచెట్టు నీడనిస్తుంది. కరణంగారు అరుగుమీద ఠీవిగా కూర్చుని చుట్ట పొగ వదులుతున్నారు. చుట్టూ చాలమంది కూర్చున్నారు. ఇళ్ల నేతకి వెదురు బద్దలు, రాటలు, తాటికమ్మ— వీటిగురించి సలహాకొచ్చేరు—

"రామిగాడి తాటిపెండెకమ్మ సాలదు బాబు. తమరో నాలుగు రేకులు సాయం సేత్తే సాలు బాబయ్యా" అన్నాడు గొల్ల వెంకడు.

"ఇద్దును గాని, వోచిన్న చిక్కొచ్చిందిరా. మా అన్నయ గారి కుమార్తెకు వచ్చే శ్రావణంలో వివాహం. ఇక్కడే చేసుకుంటారట. మా వెనక సాలం ఆవుల సాల నేయించాలి. పెరట్లో దడి కట్టించాలి. పందిరి వేయించాలి. అందేత యిప్పుడు వీలుపడదురా. లేకపోతే నెథవకమ్మరేకులు భాగ్యమా ఏమిటి ?" అన్నాడు కరణం.

ఒక సారిచ్చి అలవాటు చేస్తే ప్రతీసారీ అడుగుతారు - నెథవ వూరు తెల్లారితే కాలుతూనే వుంటుంది అనుకున్నాడు కరణం. కమ్మరేకులు వాళ్లకి పెద్ద సమస్య అయింది. ఎలాగ ? ఊళ్లో ఎవడిదగ్గర వున్నాయి.

అప్పన్న మెల్లగా వచ్చి కరణానికి దండం పెట్టి కూర్చున్నాడు-

"ఏమోయ్ అప్పన్నా ఏమిలా వచ్చావ్" అని పలకరించాడు కరణం -

"ఏం నేదు బాబు. వూరు కాలిపోయింది గదా" అన్నాడు అప్పన్న.

"అయితే నీకేటి నేరా. ఏం లేనోడివా ? యీసారి అప్పన్న పెంకుటి ల్లేయిస్తాడు బాబూ" అన్నాడు గొల్ల వెంకడు- గొల్ల వెంకడు ఎండిపోయిన ములంచెట్టులా వుంటాడు. గోచీ తప్ప రెండోబట్ట కట్టి ఎరుగడు.

అప్పన్నకి విసురు అర్థమయింది. కాని తను దెబ్బలాటకి రాలేదు. ఎలాగైనా రాజీ చేసుకుందా మనే సంకల్పంతో వచ్చాడు.

"కమ్మరేకులుగురించి మాటాడుతున్నామోయ్. నీకు తాటి పెండె వుంది కదూ." అన్నాడు కరణం.

"నేకేం బాబూ-అయితే వో సిన్న మనవి బాబు, యినండి. తొలీత మా యిల్లంటుకుంది. ఎలా గంటుకుందో ఆ పాపం పుణ్యెం బగమంతుడి కెరిక. పోతే పోనీ, ఊరంతా కాలిపోనాది కదా. ఎవరేటి సెయ్యగలం. కాని బాబయ్యా ఈ ఇకోదాలు ఎంతకాలం బాబయ్యా. ఒకూర్లోవున్న తరువాత కట్టమొచ్చినా సుకమొచ్చినా వొకడి కొకడు కాకపోతే ఏనాగు! బాబు ఈళ్లతో నాకు యిరోదం నేదు; నే నెవడికీ అపకారం సెయ్యనేదు బాబయ్యా. నాసేత నయితే సాయం సేయడానికికూడా తయారుగున్నాను. ఈ ఏలతో అంతా సరుదుకుపోవాల," అన్నాడు అప్పన్న.

"బయలుదేరినాడు బాబు కావందు - అందరినీ ఆదుకుంటాడిక-" అన్నాడు రామునాయుడు. రామునాయుడి శరీరమంతటికీ మీసాలే బలంగా కనిపిస్తాయి. గొట్టిపందేల్లో డబ్బంతా కర్చయిపోయినా మీసాలుమాత్రం చెక్కు చెదరకుండా మిగిలాయి. అప్పన్న యీ మాటలను లక్ష్యపెట్టక మళ్లీ అందుకున్నాడు. "బాబో నాకు తాటిపెం డుంది. కమ్మరేకులు వొత్తుగున్నాయి. నాయింటికీ, సాలకీ కాక మరో రెండిళ్లకి సరిపోయే రేకులున్నాయి. కట్టమునేది అందరికీ వొత్తాది. ఒకడి నొకడు ఆదుకోకపోతే ఎనాగ? కావలసి నోడొచ్చి నాలుగు రేకులు కొట్టుకోమను బాబు - నే వొద్దన్నా నేటి - అవుసరం అందరికీ వొత్తాది. అంతేకాదు బాబయ్యా-నా బండి కాలిపోనాది - నా గొడ్లకి పని నేదు - ఏరువూత కాలం గదా - ఊర్లో అందరం వూసుకోవచ్చు నాటిని - ఏటి బాబు - ఏటుండి పోతాది? పోయే నప్పుడొట్టికెల్లి పోతా మేమిటి బాబయ్యా- సెప్పండి బాబు తెలిసినోరు-" అన్నాడు అప్పన్న —

సభలో గుసగుసలు బయలుదేరాయి. రామునాయుడి కిది యిష్టంలేదు. రామునాయుడు వాళ్లందరికీ నాయకుడు. అతని కదే గర్వం. అప్పన్నంటే వాడికి మహా కోపం. ఈర్ష్య - కారణం అప్పన్న డబ్బున్న వాడు. డబ్బుతో వాడికి పలుకుబడికూడా రావచ్చునను. అప్పుడే తన విలువ తగ్గిపోతుందేమో నని అతనికే అనుమానంగా వుంది. అప్పన్నని విచ్చలవిడిగా వొదిలేస్తే ఇంకేముంది. మరో నాలుగు రోజులు పోతే వాడిముందు తను దిగదుడుపు అవుతాడు.

"చాల్లేరా, నువ్విచ్చినావు మే ముచ్చుకున్నాము-" అన్నాడు మీసాలు మెలివేస్తూ. కాని కొంతమందికి అప్పన్న సలహా సబబుగానే వుందనిపించింది. కష్టమొచ్చినసమయంలో సాయంచెయ్యడానికొచ్చేడు. ఈ సమయంలో యింకోడైతే వీళ్లందరినీ ఏడిపిస్తాడు.

"అప్పన్న సెప్పింది సబువుగానే వుందేస్. ఎల్లకాలం యిరోద మేటి? పొన్నారో డెవడేనా సూత్తే మొగంమీద దూసేత్తాడు," అన్నాడు చాకలి సత్తిగాడు. సత్తిగాడిని కొంతమంది బలపరిచారు. అప్పన్న మంచివాడు, వాం డెవరికీ అపకారం చెయ్యలేదన్నారుకూడా కొందరు; "బాగుందేస్, అప్పన్న సెప్పిందే సత్తెం - నేకపోతే ఆడు వూర్లోపుట్టి పెరిగినాడు, ఆడితోటి యిరోద మేటి, మూరకత్వం —" అన్నాడు గొల్ల వెంకడు. గొల్ల వెంకడు యీ మాటనడం కొందరికి ఆశ్చర్యమేసింది. వాడు రెండో నాయకుడు - ఇంకేముంది అంతా దారిలోకొచ్చేరన్న మాట. అప్పన్నకి ధైర్యమొచ్చింది. ఫలించింది తన పథకం. కాని కొంతమంది వొప్పుకోలేదు - వాడి దగ్గరయిరోజు నాలుగు కమ్మరేకులుపుచ్చుకుంటే మరీ అలుసయిపోతామన్నారు కొంతమంది. రామునాయుడి యిష్టంలేదు అప్పన్నతో రాజీచేసుకోవడం - కాని గొల్ల వెంకడు మాత్రం అప్పన్న సహాయం తోసిపుచ్చకూడదన్నాడు - అంటే నాయకత్వం చీలిపోయింది. కాని ఎవరూ వొక నిర్ధారణకూ, నిర్ణయానికి రాలేక పోయారు - రామునాయుడు వయసులోనూ, జాతిలోనూ, పలుకుబడిలోనూ, పెద్దవాడు - నిరాటంకంగా నాయకత్వం నిర్వహించినవాడు - ఛటుక్కున లేచి, కోపంగా కర్ర నేలకు కొట్టేడు; మీసాలు మెలివేసి గుడ్లెర్రజేసేడు. కూర్చున్నవాళ్లంతా వాడివేపే చూస్తున్నారు - అందరినీ తనవేపుకి మెల్లిగా లాక్కున్నాడు. చివరినిర్ణయం తనచేతిలోకి వచ్చింది - వీటో ప్రయోగించేడు —

"ఓ రెల్లంద్రా - మా గనమైన దర్మరాజు బయలుదేరినాడు - నెగండ్రా." అని గబాలున లేచి, తుబుక్కున వుమ్మి బయలుదేరేడు - అంతా పాలోమ్మని లేచారు. పకపక నవ్వుకుంటూ నాయుడివెనకాతల వెళ్లిపోయారు.

అప్పన్న కేమీ తోచలేదు. ఏ అర్థం కాలేదు. ఇంటికొచ్చి వీధిలో నులకమంచంమీద కాళ్లు చాచుకుని పడుకున్నాడు - ఎదురుగుండా మసిబారిన మొండిగోడలు నవ్వుతున్నట్లు కనిపించేయి!

# అవ్యక్తగీతి



శ్రీ భట్టిప్రోలు కృష్ణమూర్తి

తన వెనుక పుట్టి గీతికాత్వమును గొనిన
వెన్ని భావనలో! కతమేమొ గాని
నా మనోవీథి తుది నిరంతరము గదలు
గీతికాభావ మొకటి యాకృతిని గొనదు!

ఆ వెలికి రాని గీతిక అంతరార్థ
మింతయును నే నెఱుంగను-శాంతిదమ్మొ,
భయదమో, వ్యథావిలమొ, శివంకరమ్మొ,
ప్రేమమయమొ, విధురవిష ప్రేరితమ్మొ!

తన్నిరాకార భావగీతమున కసలు
వెనుక తెర యేదో? పుచ్చపూలను హసించు
పాలవెన్నెలలో, అమావాస్యనాటి
కానుగుల తోటలోని చీకటుల ఛటలో?

అది రచింప లేఖినిని బట్టుదును గాని
ఇంతలో తేటగాని నా హృత్పథాన
నేవో శిలలు కంటకము లా భావగమన
మునకు నడ్డుగ వచ్చి యాపును తటాల్న.

పేర్చుకొన్నాను మాటలు వేయిసార్లు
కూర్చుకొన్నాను స్వరములు కోటిసార్లు-
కాని వెలువరింపగబోవ గలుగు నేవో
నిస్సమాధానమైన సందియము లెన్నొ!

అంతమే లేని ఆ సందియముల కసలు
రూప మిదని జాగ్రన్మనోలోచనములు
సరిగ తెలియవు—హేమంతశర్వరు లటు
స్వాప్నికప్రతిసీరపై చాయ లవ్వి!

ఏమయిన, దృఢముగ విశ్వసింతు విశ్వ
మునకు శ్రేయస్సు నదిగూర్చు ననుచు నేను
విశ్వమన సమకాలికవిశ్వ మొకటె
కాదు—స్థలకాలభేదము లేదు నాకు!

ఒకటె యనుమాన మెన్నడే నురలిపైకి
వచ్చునా అది, భావనాబంధ మూడి?
కుములునా లేక, అల్లె నా గొంతులోనె
వగలబ్రదుకి దే మూర్తమో క్రగులువనుక?

---

# కులములు: కులసంఖ్యలు



శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మ

ప్రత్యేకముగా మనదేశము సాంఘికచరిత్రమును గురించి యెవ్వరు నింతవఱకు కృషిచేయుట లేదు కాని దేశము ప్రాచీన రాజకీయచరిత్రము కంటెను అది యెక్కువ హృదయాకర్షకము గను, ఉల్లాసకరముగను ఉండును. నిజముగా మనదేశ చారిత్రము మన దేశపరిస్థితుల ననుసరించి సాంఘిక చారిత్రమే కాని రాజకీయ చారిత్రము కాదు. పాశ్చాత్యవిద్యా వాసనాబలమున మనము రాజకీయచారిత్రమున కధిక ప్రాముఖ్యము నిచ్చి సాంఘికచరిత్రము విషయమున నశ్రద్ధ చూపుచున్నాము. అదియునుగాక నేటి పరిస్థితులలో సంఘమునుగురించియు, వేలు వేలు కులములను గురించియు వ్రాయుట సముచితము కాదను నభిప్రాయముకూడ విద్యాధికులలో నే ప్రబలుచున్నది. ఇది దురభిప్రాయమే కాని సదభిప్రాయము కాదు. మన హిందూసంఘము మౌర్యయుగమునాటినుంచి ఇప్పటివఱకు పొందిన పరిణామము అద్భుతమయినది; ఆశ్చర్యకరమయినది. మౌర్యయుగమునకు పూర్వము, అనగా నిప్పటికి రమారమి రెండు వేల సంవత్సరములకు పూర్వము సంఘ మెట్లుండెనో తెలిసికొనుటకు మన కాకరములు తక్కువగా నున్నను ఇటీవలి కాలమునకు వచ్చినకొలది నవి యెక్కువగుచు వచ్చినందువల్ల ఒక విధముగా నప్పటినుండి యిప్పటి వరకు మన సంఘమెట్లు మార్పు చెందుచు వచ్చినదో తెలిసికొనుటకు గొంత యవకాశము కలదు. ఈసాంఘికపరిణామమును దెలిసికొనుటవలన యథార్థచరిత్ర జ్ఞానము కలిగి మనలోని దురభిమానములు, దురభిప్రాయములు తొలగుటకు దారి యేర్పడగలదు. మన సంఘమునందలి ప్రతికులమును సరిగా రెండు వేల యేండ్లక్రిందట నెట్లున్నదో యిప్పటికి నట్లే యున్నదని యనుటకు అవకాశము లేదు. మతవిషయకములైన పరిణామములవలనను, రాజకీయములైన విప్లవ, పరివర్తనములవలనను మన సంఘమున నెన్నియో మార్పులు కలుగుచు వచ్చినవి. కడచిన రెండు వేల సంవత్సరములనుండి యే కులమున కా కులము తన పరిశుద్ధతను పోషించుకొనుటకును, దనవ్యక్తిత్వమును, కుల సంస్థలను నిలుపుకొనుటకును, తనకులమునకు జెందిన విద్యను కాపాడుకొనుటకును, విశేషించి హిందూ సంఘమున కాలక్రమమున నున్నతపదమును గడించి యొక్కొక మెట్టు పై కెక్కి యభివృద్ధినొందుటకును ప్రయత్నించుచువచ్చినది. ఉన్నత గౌరవపద ప్రాప్త్యభివృద్ధుల నిమిత్తము వేలు వేలు కులములు కావించిన కృషిపరిణామచరిత్ర జ్ఞానము పురోభివృద్ధి హేతువుకాని అభివృద్ధినిరోధకము కాజాలదు. అదియే మనదేశ ప్రజాచరిత్రము. చరిత్రమునుగురించిన యభిప్రాయములు వెనుకటికి నిప్పటికి చాల మారుచున్నవి. చరిత్రమన్న నేమి, చరిత్ర తత్త్వమెట్టిది అను విషయమున ఒక్క మనదేశమున ఇంకను అంత జిజ్ఞాస, తర్కము ప్రబలలేదు కాని పాశ్చాత్యదేశములలో పాలసముద్రమథనము జరిగినట్లు మథనము జరుగుచున్నది. ఈ మథనములో నొకవేళ తాత్కాలికముగా హాలాహలము పుట్టిన బుట్టవచ్చును కాని కడకు అమృతము దొరకకపోదు. దానితో లోకమునకు శ్రేయము కలుగకమానదు. మన కులముల లోని యాచారములు, కులములకు సంబంధించి తర తరములుగా, మనలో పరంపరగా వచ్చుచున్న గాథలు కడచిన యేబదియేండ్లలో సంఘమున గలిగిన గలుగుచున్న మార్పువలన నంతరించినవి; ఏ కొద్దిగనైన నింకను నున్నను అవి కూడ నంతరించుచున్నవి. ఈ గాథలు నాటనేట బుట్టినవి కావు; పురాతన కాలమునుండి వచ్చుచున్నవి. ఇవి ఉత్తినే పుట్టినవి కావు; అర్థరహితములైనవి కావు. ఈ గాథల ద్వారముననే మన కులముల చరిత్రమును దన్మూలమున మన సాంఘిక పరిణామమును దెలిసికొనుటకు వీలగుచున్నది. ఈ గాథలు కొన్ని మన సంఘములో గలిగిన పరిణామమువలన నవి యే యే కులములకు సంబంధించినవో యా యా కులములవారికి తాత్కా

లికముగా కష్టమును గోపమును గలిగించి వారి నుద్రేకపూరితులను జేయుననుటకు సంశయము లేదు. ఆ గాథలను విన్నపుడు మన కులాచారము లిటువంటివా యని విభ్రమము కలిగి మనసునకు విన్నదనము తోపవచ్చును. యథార్థమున కభిముఖమై నిలిచి దానిని నిజమే యని యంగీకరింప గలుగుట కష్టములలోని కెల్ల కష్టము. అయినను మన మభ్యసించు విద్యవలన సత్యమును గుర్తించి యంగీకరించుటకు ధైర్యమును స్థైర్యము నందవలెను; అట్లు కానిచో విద్యవలన బ్రయోజనము లేదు. జీవనోపాధికి మాత్రమే కాదు, విద్య; అది మానవుని. సత్యజ్ఞాన నిరతుని, ధైర్యస్థైర్యాన్వితుని జేయవలెను. కులాచారములను గాథలను పరిశీలించి సాంఘికచరిత్రమును వ్రాయుటయు కష్టమే; వ్రాసినదానిని సాంఘికులు నిర్వికారముతో జదువగలుగుటయు కష్టమే. అయినను సాంఘికచరిత్రము రాక తీరదు; అది ప్రజాచరిత్రము. దురభిమానమువలని ప్రయోజనము లేదు; లేని గౌరవము నాపాదించుకొన్నందువలనను, ఉన్న సత్యమును మరుగు పరిచినందువలనను గలుగు లాభమును లేదు. సాంఘికచరిత్రమే మన నిజమైన చరిత్ర.

పూర్వపు కట్టడులు, పూర్వపు ఆచారములు, పూర్వపు సంప్రదాయములు, పూర్వపు విద్యలు అన్నియు శిథిలమైనవి. నేటి దొక సంధియుగము; నేటి దొక క్రొత్త ప్రపంచము. దేశ, కాలపరిస్థితులకు తగినట్లు మన సంఘమును దిద్దుకొన బ్రయత్నించుచున్నాము. సంస్కరింప జూచుచున్నాము. ప్రజలలో విద్య వ్యాపించినచో ఈ సంస్కరణము సులువుగా గలుగుట కవకాశము కలదు. ప్రజలు దేశములో గలుగు మార్పును గ్రహించి దానికి సుముఖులగుటకును, ప్రస్తుత పరిస్థితిలో దేశక్షేమమున కనువుగ వారు ప్రవర్తింపగలుగుటకును సాంఘికచరిత్ర అత్యావశ్యకము. సాంఘికచరిత్రయావశ్యకమును దెలిపి కొన్నికొన్ని కులములకు సంబంధించిన విషయములను వెల్లడించుటయే యీ వ్యాసము ప్రయోజనము.

౨

గ్రంథములలో నెక్కడను గానరాని విషయములు కొన్ని మనదేశములో దొరికిన పూర్వకాలపు శిలాశాసనములలోను తామ్రశాసనములలోను గావచ్చును. గ్రంథముల ప్రయోజనము వేఱగుటవలన నందవి యప్రసక్తములు. లోకవ్యవహారము నిమిత్తము వేసినవగుటచేత శాసనములలో నవి యుచితములు, నుపయుక్తములును. మన సంఘములోని కులములకు సంబంధించి శాసనములవలన మాత్రమే తెలియవచ్చు విషయములును, అటువంటివానిని బోలినవి గ్రంథములలో నున్నచో నట్టివియు ఇందు గొన్ని దెలుపబడును.

బ్రాహ్మణులలో వేగినాట్లు, వెలనాట్లు, పాకనాట్లు అని శాఖలున్నట్లే ఇతర కులములలోగూడ పూర్వముండెనని తెలుపుట కవకాశము కలదు. కోమట్లలో నిప్పుడిట్టి శాఖ లేవియు లేవు కాని పూర్వముండెనని తోచుచున్నది. బ్రాహ్మణులలో కమ్మెలు కమ్మనాటి బ్రాహ్మణులున్నట్టే పూర్వము కోమట్లలో కమ్మకోమట్లు అని యుండెడివారు. చూడు డీ క్రింది పద్యము :

పరగగ గమ్మవైశ్యవిధి
    భట్టి పురేసుడు ప్రోలిసెట్టి కం
బురుహదళాక్షి ప్రోలమ సు
    పుత్రుడు యాయ్యమసెట్టి పెట్టె శ్రీ
సరసిపురంబు కృష్ణునకు
    సందియ దీపము శాశ్వతంబుగా
బురకర కైరవాప్త శశి భూరి
    శకాబ్దము లుర్వి బర్వగాన్.

ఇది ఏలూరులోని మసీదుస్తంభములలో ఒకదానిమీద చెక్కిన శాసనములోనిది. శకవర్షము ౧౧౨౩ అనగా క్రీ. శ. ౧౨౦౧ నాటిది. దీని ననుసరించి చూడగా నిప్పటికి రమారమి ఏడువందల యేబది సంవత్సరములకు బూర్వమువరకు వైశ్యులలో బ్రాహ్మణులలోవలెనే కమ్మవైశ్యులను శాఖ యొకటి యుండినట్లు స్పష్టమగుచున్నది. ఈ శాఖ యంతకింకను పూర్వమునుంచియు గలదనుటకు బాపట్ల భావనారాయణస్వామి యాలయములోని శకవర్షము ౧౦౭౧ నాటి శాసనమే తార్కాణము. ఇది కమ్మవైశ్యులలో నొకడును, 'నకర పురుషుడు'ను అయిన నగరీశ్వర తమ్మిసెట్టియైన బమ్మిసెట్టి కిని జక్కమనాయకురాలికిని సుపుత్రుడయిన కన్నిసెట్టి దీపదానము నిమిత్తము నిత్యము మానెడు నేయి వోయుటకు

ఇచ్చిన పదమూడు బిరుదమాడలను దెలుపుటకు పుట్టినది. నకర మన్నది వైశ్యసంఘమునకు పేరు. ఇది యొక శ్రేణి (*guild*). పెనుగొండ వైశ్యుల యాదిమ స్థానము. నకర మన్నది పెనుగొండనగర మను దాని సంక్షిప్తరూపము; అది పెనుగొండనగర వైశ్యశ్రేణికి పేరు. పూర్వకాలములో ఏ కులమున కా కులమునకే, యే వృత్తి కా వృత్తికే యిట్టి శ్రేణు లుండెడివి. ఇట్టి కులసంఘములకు, వృత్తిసంఘములకు సమయము లనియు పేరు. వైశ్యవర్ణములో ఈ పెనుగొండనగర వైశ్యప్రముఖుల దొక ప్రత్యేకసంఘము. అసలు వైశ్యులు సహస్రగోత్ర పవిత్రులట. వారిలో పెనుగొండ నగరేశ్వరు లొక ప్రత్యేకసంఘమువారు. వైశ్యులు అసలు వేయి గోత్రములవారు. వీరిలో పెనుగొండనగర ప్రభుముఖ్యులయిన వైశ్యులు నూటరెండు గోత్రములవారు. గోత్రమన వంశమునకు, కుటుంబమునకు పేరు. నూటరెండు, వేయి యను సంఖ్య లిప్పటికిని వైశ్యసంఘ సూచకముగా నున్నవి. నిజముగా జూచినయెడల వైశ్యసంఘ మిప్పుడు వేయి కుటుంబములకు, వేయి వంశములకు మించి విస్తరిల్లినది. అందువలన నిజముగా నీ సంఖ్యల యర్థమేదో, యవి వేటిని సూచించునవో తెలియదు. ఆంధ్రదేశ బ్రాహ్మణులలో ఆఱువేలవారని యొక శాఖ కలదు. ఇట్లే తమిళ బ్రాహ్మణులలో అష్టసహస్రమువారని యొక శాఖ కలదు. ఈ శాఖల కీ పేర్లు వా రాదిమ కాలమున నివసించుచువచ్చిన నాటినిబట్టి కలిగినది. నా డనగా దేశ విభాగము. అందువలన నా శాఖల సంఖ్యలకును, పై నుడివిన వైశ్యకులసంఖ్యలకును పోలిక లేదు. అవి నాడుల ననుసరించి వచ్చిన సంఖ్యలుమాత్రము కావు.

ఇట్లే మఱికొన్ని కులములకు సైత మిట్టి సంఖ్య లుండెనని తెలియవచ్చుచున్నది. దేవాంగపురాణ మని యొక గ్రంథమున్నది. అది యేడాశ్వాసముల ద్విపద గ్రంథము; బ్రహ్మాండ పురాణాంతర్గతమగు గ్రంథ భాగము ననుసరించి దీనిని భద్రకవి లింగకవి యను నతడు పదపీటి దేవాంగప్రభువుల కోరికపయి రచియించెను. ఇందలి విషయ మిది :

"ఇందలి ప్రథమాశ్వాసమున మను మహాముని యీశ్వరునకు దేవాంగఋషిగా జన్మించుటయు, దేవతావస్త్రముల నిర్మాణము చేయుటయు మొదలగు విషయములు వర్ణింపబడినవి. విద్యాధర పుష్పదంత బేతాళ వరరుచి దివసాళి దేవరదాసి నామధేయములతో నతడు మఱియా అవతారముల నెత్తినాడట. ఆ యా అవతారముల వృత్తాంతములును దక్కిన యా యాశ్వాసములలోను వర్ణితములైనవి."

ఈ గ్రంథమునుగూర్చి పుస్తకపరిశీలకు లిట్లు వ్రాసియున్నారు : "ఈ యవతారములు ప్రాయికముగా ఇంద్రజాల రసవాద వైద్యాది విషయములను పెంపొందించుట ప్రయోజనముగా నేర్పడినట్లు కలదు. కడపటి యవతారము దేవాంగకులమున నెత్తెనట. దేవరదాసి జైనులను ఖండించి శైవమును బెంపొందించె నట." ఏ తద్గ్రంథకర్త దేవరదాసి వంశ్యుడట. ఈ గ్రంథములోని యీ క్రింది

పరగిన కశ్యపబ్రహ్మ గోత్రజులు
స్థిరలీల బదపీటి దేవాంగఘనులు
పరమ సమ్మదముతో బది వేలకులము
నరుదార సింహాసనాసీనులగుచు

అను ద్విపదపంక్తులవలన దేవాంగులది పది వేల కుల మని తెలియుచున్నది.

ఇట్లే వెలమలది వేయికులమని శాసనములందు గలదు. అరవమున వెలమకులమువారిని వెళ్లాళర్ అని వ్యవహరింతురు. వీరు ప్రధానముగా సేద్యముచేసి జీవించువారు. 'వెలము వేయ' అని తఱచుగా శాసనములలో గానవచ్చును. వెలము పదము సమూహవాచకము; వెలము కులజులు, వెల మకులోద్భవులని దాని యర్థము. వెలము వేయ యన వెలమలు సహస్రగోత్రములవారని యర్థము చెప్పవలసియుండును.

వెలమలవలెనే ప్రధానముగా వ్యవసాయము చేయువారు రెడ్లు. ప్రాచీనకాలమునుంచియు తెలుగుదేశమునందలి వ్యవసాయక కులములన్నిటిలో బ్రసిద్ధమైనది, ప్రముఖమైనది రెడ్డికులము. సంస్కృతమున వీరిని రాష్ట్రికూటులనువారు. ప్రాచీనకాలమున నాంధ్రదేశమున ప్రతిగ్రామమునను వీరే మోతుబరి రైతులు. ఏ గ్రామమునుగాని, దానిలోని కొంతభూమిని కాని విడదీసి యగ్రహారముచేసి దానమిచ్చునపుడు ప్రాచీనకాలమున మహారాజులు ఏ రాజ్యవిభాగమున నా గ్రామ మున్నదో యా విభాగమున నివసించు మోతుబరి రైతులను—రెడ్డి ప్రముఖుల నందఱిని ఆహ్వానించి వారికి దాము దానముచేయుచున్న విషయమును దెలిపి

అంతటినుండి యా దత్తగ్రామమునుండి తమకు జెల్లుచు వచ్చిన పన్ను పర్యాయాదులు మర్యాదలు ప్రతిగ్రహీతకు జెల్లవలెనని, వారు యథోచిత మర్యాదతో బ్రవర్తింపవలెనని కోరుట యాచారము. ఈ యాచారము తెలుగుదేశమున క్రీ. శ. పదునొకండు, పండ్రెండు శతాబ్దులవఱకే యుండినట్లు కన్పట్టును. ఈ రెడ్లకు పంటరెడ్లనియు, పంటకాపులనియు వ్యవహారము గలదు. పంట యన్నది ప్రాచీనకాలపు ఆంధ్రదేశ విభాగములలో ఒక విభాగమునకు పేరు. ఈ విభాగమును బంటరాష్ట్రమని వ్యవహరించువారు. రాష్ట్రము, విషయము, నాడు, దేశము అనునవి ప్రాచీన దేశ విభాగములను దెలుపు పర్యాయపదములు. తిక్కనసోమయాజి కాశ్రితుడైన చోళ భూవరుడు మనుమసిద్ధి పినతాతయైన తమ్ముసిద్ధి హస్తిశైలేశ్వర స్వామికి పంట రాష్ట్రములోని ముట్టియంపాక గ్రామమును దానముచేసెను. (దేవాయాస్మై హస్తిశైలేశ్వరాయ స్వాయమ్భువే మ్నే సారయోగీశకాఙ్క్షే...దిం పంటరాష్ట్ర ప్రధానం ప్రాదాత్ గ్రామం ముట్టియం పాక్క సంజ్ఞమ్). ఈ ముట్టియంబాక పంటరాష్ట్రములోని ప్రధాన గ్రామ మట. ఈ ముట్టియంబాక నెల్లూరుజిల్లా గూడూరు తాలూకాలోని ముట్టెంబాక. అందువలన గూడూరుతాలూకా యంతయు గాకపోయినను గొంతభాగమైనను పూర్వపు పంటరాష్ట్రములోనిది కాగలదు. పంట రాష్ట్రములోని చతుర్థ కులజులకు పంటకాపులని, పంటరెడ్లని పేరు. పంటకాపులది పదునాలుగు కులము. పంట పదునాల్గు కులములని ప్రతీతి. ఈ పదునాలుగు కులములను వివరించునట్టి యొక సీసపద్యము ఆరవీటి బుక్కభూపతినాటిది కలదు. అది యిది :

పంటాన్వయమునను బదునాల్గుశాఖల
జక్కగా వివరింతు సత్యమరసి
మోటాటి వెల్నాటి మొరస నేరె డయోధ్య
పంట పొంగలినాటి పాకనాటి
భూమంచి కురిచేటి మున్నూటి దేసటి
యొనర గండియకోట యోరుగంటి
యనబరగుచు నుండు నంధ్రావనీ స్థలి
గౌరవాధిష్ఠిత కాపు కులము
పంట పదునాల్గు కులములం చంట జగతి
దరతరంబుల నుండియు వరలెడి నుడి
వీని కుపజాతు లున్నవి వివిధములుగ
భుజబలాటోప ! పిన్నమ బుక్కభూప.

ఈ సీసపద్యమునకు పాఠాంతరములు కలవు. వానిలో జేర్కొనబడినవి, దీనిలో జేర్కొనబడినవి కొన్ని కులములు భేదించును. అట్టివి చాల కొద్ది. ఈ కులముల పేర్లను బరిశీలించుచో అవి చాలవఱకు నాడుల ననుసరించి కలిగినవని తెలియగలదు. పాకనాడు, వెలనాడు, మొట్టవాడి, మొరస, మున్నూటి విషయము, పంట, నేరేటి, పొంగలినాడు—ఇవి యన్నియు దేశవిభాగములే. మున్నూటివిషయము ములికినాడు (ములికి మున్నూఱు). నేరేటియన్నది నలవాడి యన్నదాని యపభ్రంశరూపము. ఇది కర్నూలుజిల్లాలోని విషయము. మైసూరులోని కోలారుప్రాంతము మొరసనాడు మొట్టవాడిరూపమే వ్యవహారమున మోటాటియైనది. ఇది గుంటూరు, కర్నూలుజిల్లాల సరిహద్దున, కృష్ణా, తుంగభద్రా నదుల దక్షిణతీరమున నున్నది. పొంగలినా డెచ్చటిదో తెలియదు. ఈ కాపులలోని అయోధ్య, ఓరుగంటి, కురుచేటి, గండికోట కులములు పురముల ననుసరించి యేర్పడినవి. అయోధ్య, ఓరుగల్లు, కురుచేడు, గండికోటలు ప్రసిద్ధములైన పురములు. దేసటి యనునది పురమైన గావచ్చును; దేసటి యను పురమున్నది ; లేదా అది రెడ్లలోని ఒక తెగకు పేరైన గావచ్చును. భూమంచి యన్నదికూడ గ్రామనామమేమో. మొత్తముమీద వ్యవసాయమే ప్రధాన వృత్తిగాగల పంటకాపులది పదునాలుగు కులమనుట నిశ్చయము.

ఇట్లే తెలుకులవారిది వేయకులము. తెలుకుల వారికి గానుగవాండ్లనియు వ్యవహారము. వీరిని ప్రాచీన శాసనకర్తలు 'తెలికి వేవురు' అని వ్యవహరించినారు. తెలికి వేవు రనగా తెలికివేయకులమువారు అని యర్థము. పూర్వకాలమున వ్యాపార, పారిశ్రామిక సంస్థలలో వీరి దొక గొప్పసంస్థ. చాల బలమైన గొప్ప సంఘము వీరిది : వీరికి పెద్దవక్కణ—బిరుదప్రశస్తి కలదు. గమనించుడు

"యమ నియమధర్మపరా
యణులు, బ్రహ్మసంభూత
మను వంశాధినాథ
సంభవులు, సకలశాస్త్ర విశా

రదులు, కనకపురి,
గజపురాధినాయకులు, అ
యోధ్యాపుర వరేశ్వర
భృత్యులు, చాళుక్య రాజ్య
మూల స్తంభాయ
మానులు, సత్యశౌచాచార
విరాజితులు, గురుదేవ
పాదారాధకులు, భగవత్
లబ్ధవర ప్రసాదులు,
కపిల మత ప్రతిష్ఠితులు,
పౌలస్త్య సహస్ర
శాఖాన్వయ గోత్రులు,
బెజవాడ శాసనులు"

ఇక కొన్ని శాసనములలో ఈ ప్రశస్తిలో ఇంచుక మార్పు కలదు; అయినను విషయ మదే. 'బ్రహ్మ సంభవ పౌలస్త్యకుల క్రమాగత మనువంశోద్భవు'లని, 'కనకపురి, అయోధ్యాపురి, గజపురాధినాయకు'లని, 'ఇంద్రకీలనగ శ్రీకృష్ణ వేణ్యానదీ తీర శ్రీ విజయవాటీ పురాధినాయకు'లని 'కపిల మహామునివర ప్రసాదలబ్ధ చాళుక్య రాజ్యమూల స్తంభాయమాను'లని వారు ప్రకీర్తితు లయినారు. మన దేశమును పూర్వము పరిపాలించిన చాళుక్య భూవరులు అయోధ్యాపురవరేశ్వరులు. వారుఅయోధ్య నుంచివచ్చిన వారని ప్రతీతి. వారి భృత్యులు వీరు. వీరును ఉత్తరహిందూస్థానమునందలి అయోధ్యాపుర, గజపురములనుండి వచ్చినవారే. బ్రహ్మసంభూతుడయిన మనువు వంశమున బుట్టినవారట వీరు— పౌలస్త్యసహస్ర శాఖాన్వయగోత్రులు. వేయిగోత్రములవారు. ఈ వేయిగోత్రములును పౌలస్త్యునినుండి కలిగినవట. పౌలస్త్యుడన కుబేరుడనియు, రావణుడనియు నర్థము. ఈసందర్భమున ఆంధ్రవ్యాకరణములు రచించిన యత్యంత ప్రాచీనులలో రావణు డొక డను విషయము స్మరింపదగినది.

ప్రాచీనవర్తక వ్యాపారశ్రేణులలో ఈ తెలికి వారి దొకటి. వీరికి మనువంశపురాణమని ప్రత్యేక మొక పురాణముకలదు. ఖండకపాలాఖ్యానమను సంస్కృతగ్రంథమున కిది తెలుగు సేతయట. దీనిని శాండిల్యగోత్రుడును వీర భద్రమంత్రి పుత్రుడు నయిన వీరనామాత్యుడు రచియించెను. వీరు "నిటలాక్ష సద్భక్త గుణ మండిత పండితారాధ్య దేశిక కరుణా కటాక్ష వీక్షణామృతధారాపరిషిక్త శరీరు" లట. ఈ పండితారాధ్యు విజయవాడ నివాసియైన శ్రీపతిపండితులు; తన శివతత్వసారమున:—

'ఒక్కడె దైవము శివుడని
నిక్కము సేయుటకు ముడిచె నిప్పులు సీరన్
గ్రుక్కక శ్రీపతి పండితు
డొక్కజముగ విజయవాడ నల జమ్మి శివా,

యని మల్లికార్జున పండితారాధ్యుడు ప్రస్తుతించిన దీ శ్రీపతిపండితునే. ఈ శ్రీపతిపండితుడు పశ్చిమ చాళుక్యభూపతియైన ఆరవ విక్రమాదిత్యుని దండనాయకుడును, వేగిదేశ విజేతయు నైన అనంత పాలునికి సమకాలికుడు. క్రీ. శ. పదునొకండవ శతాబ్ది అంతమునను, పండ్రెండవశతాబ్దిఆరంభమునను నున్నవాడు. పూర్వము మనువంశసంభూతులయిన క్షత్రియులు విశ్వంభర మునిశాపము కారణముగా నిప్పటి తెలుకులవా రయిరని యీగ్రంథమున దెలుపబడినది.

తెలుకుల కులము ఇప్పుడు వేయి కుటుంబములకు మించిన కులము. కాని యిప్పటికిని అది వేయి కులమనియే వ్యవహారము. ఈ వంశమునందలి వేయి గోత్రములు నేవో, వాటి పేరులేవో, వేయికులమని దీని కెందులకు పేరు కలిగినదో తెలియదు. ఈ తెలికి వంశమువారు క్రీస్తుశకము పదునొకండవ శతాబ్దినాటికి బాగుగా బలపడి గొప్ప సంఘముగా వర్ధిల్లిరి. వీరి ప్రస్తావముగల శాసనములలో క్రీ. శ. ౧౦౭౮ నాటి రాజరాజ చోడగంగభూపతి శాసనము మొట్టమొదటిది. ఈతడు రాజరాజనరేంద్రుని మనుమడు; కులోత్తుంగ చోడ భూవరుని కుమారుడు. తండ్రి మరణాంతరమున గొంతకాలమునకు కులోత్తుంగచోడ నృపాలుడు మాతామహరాజ్యములోన చోళదేశమునుగూడ స్వవశము చేసికొని తెలుగుదేశమును, తమిళదేశమునుగూడ పరిపాలించెను. ఇతడు ఉభయదేశములకును రాజయిన పిదప రాజధానిని తెనుగుదేశమునుండి యరవదేశమునకు మార్చి, తెనుగుదేశము నేలుటకు దన కుమారులను దన ప్రతినిధులుగ బంపుచువచ్చెను. అట్టి రాజప్రతినిధి చోడగంగను రాజరాజ భూపతి. ఈ శాసనమున

నీ తెలికివారు దక్షిణాశావిజయైషియైన యయోధ్యాధీశ్వరుడు విజయాదిత్య భూభుజునితో వచ్చినట్లు తెలుపబడినది. అంతియేకాక వీరు 'జలమనూళ్లు, పత్తిపాలు, నరియూళ్లు, కుముడాళ్లు, మట్టూళ్లు, పోవంట్లు, స్రావకులు, ఉంద్రూళ్లు, అనుమగొండలు, అడ్డనూళ్లు మొదలయి వేయిభేదములచేత ప్రసిద్ధులయిన తెలికి కులలబ్ధజన్ము లనియు, స్వధర్మకర్మనిష్ఠిత మనస్కు లనియు చెప్పఁబడినారు. పైని చెప్పిన గోత్రభేదములలో అనుమగొండలను నది తక్క మిగిలిన వేవైన దియు దెలియరాదు. అనుమగొండ లనునది అనుమకొండ నివాసముగాగల తెలికివారని యర్థము. క్రీస్తు శకము ౧౦౭౪ వఱకు వివాహోత్సవసమయములందు గూడ నిఖిలపుర నగరగ్రామపట్టణాదులలో ఈ తెలికి కుల వధూవరులు గుఱ్ఱమునెక్కి యూరేగుటకు అధికారము లేకుండెను.

రాజరాజచోడ గంగు కాలముననే అట్టిమర్యాద వీరికి లభించినది. ఈ మర్యాదను దెలుపుటకు పుట్టినదే ఈ శాసనము. వీరులలో వధూవరులు గుఱ్ఱముమీద నెక్కి యూరేగి వివాహోత్సవావసానమున రాచనగరికి వచ్చి రాజశ్రీపాదమూలమున మహార్ఘమయిన వస్త్రయుగ్మమునుంచి ప్రణమిల్లవలెను. అప్పుడు రాజు పూర్వమర్యాద ననుసరించి వారికి తాంబూలము నిచ్చును. ఇది. ౧౦౭౪ లో జరిగిన యేర్పాటు.

"విజయవాడ ప్రముఖనిఖిల పురనగర గ్రామ పట్టణ ప్రభృతిషు స్థానేషు సర్వేషు వివాహోత్సవేషు ప్రవర్తమానేషు మిథునస్య వీథీషు తురగారోహణేన పర్యటన మథ వివాహోత్సవావసానే రాజశ్రీపాద మూలే మహార్ఘవాసోయుగలం నిధాయ ప్రణతానామేషాం తాంబూల ప్రదానంచ పూర్వమర్యాదా సమాగత మధునా పరమ భక్తిపరితోషితైరస్మాభి రాచంద్రార్కం శాసనీకృత్య దత్తమితి విదితమస్తు."

ఈరీతిని పూర్వకాలమున నొక్కొక్క కులము వారు సంఘమును రాజును భక్తిశ్రద్ధలతో కొలిచి కొన్నికొన్ని మర్యాదలను బడయుచు వచ్చి తమ వంశగౌరవ ప్రతిష్ఠలను బెంపొందించు కొనుచుండువారు. గణనీయమైన సంఘసేవ చేసిననే కాని ఈ కులముల కెట్టి మర్యాదలును లభించెడివి కావు. కులములకు దొరికిన యిట్టి మర్యాదల ననుసరించియే సంఘమున నా కులములకుగల గౌరవప్రపత్తులు గణించుచుండువారు. గుంటూరుజిల్లా బాపట్ల భావనారాయణస్వామి యాలయములోని శాసనములవలన తెలికికులములోని ముసునూళ్లు, వెలందునూళ్లు అను మరి రెండు కులములు తెలియవచ్చుచున్నవి. ముసునూళ్లు అన్నది పురోక్త రాజరాజ శాసనమువలన దెలియరాని క్రొత్త గోత్రముపేరే. ఇక వెలందునూళ్ళనునది వెలుమనూళ్లన్నదాని రూపాంతర మగునేమో, లేదాయదికూడ ఒక క్రొత్త గోత్రముపేరగునో? ఎట్లయినను మనకు తెలికికులము వేయిగోత్రములను దెలియవచ్చుటలేదు.

ఇట్టిదే మఱియొకకులము విశ్వకర్మ ముఖోద్భవులది. బ్రహ్మ కుమారుఁడయిన విశ్వకర్మకు అయిదుగురు కుమారులు కలిగిరి. వారైదుగురును స్వర్ణకారకము, వడ్రంగము, శిల్పము, కమ్మరము, కంచరము అను నయిదు వృత్తుల నవలంబించి 'విద్దాయు' లను పేర బరగిరి. వీరికి 'పంచాణమువార'ని కూడ పేరు. ఈ విశ్వకర్మ కులజుల ప్రశస్తిని దెలుపు ప్రాచీనశాసనము లనేకములు కలవు. వీరికి కర్మతులని కూడ వ్యవహార ముండెను. ఈ విశ్వకర్మ కులజులలో గూడ బ్రాహ్మణులలోవలెనే ప్రాచీన కాలమున దేశ విభాగముల ననుసరించి యేర్పడిన కులము లుండెనని శాసనములవలన విదితమగుచున్నది. ఈ విషయమును సూచించు శాసనములు గుంటూరుజిల్లా పల్నాడు తాలూకాలోనివి. వీటిలో శకవర్షంకాని, బార్హస్పత్యమానాబ్దముకాని లేదు; అయినను వీటిలోని లిపి ననుసరించి యివి యెప్పటివో యించుమించుగా దెలుపవచ్చును. ఈ శాసనములు ప్రాచీన చాళుక్యారంభకాల లిపిలో వ్రాసియున్నవగుటచేత నివి క్రీస్తుశకము ఏడవశతాబ్ది పూర్వార్థమునాటివని నిస్సంశయముగ జెప్పవచ్చును. వీనిలో ఒక శాసనము పల్నాడు తాలూకా పులిపాడు దగ్గఱనున్న అయ్యంగారిపాలెమునందలి శిథిలమైన బొబ్బనాగిగుడిలోని మంటప స్తంభముమీద చెక్కియున్నది. ఇది యింకను ప్రకటితముకాలేదు. ఈ శాసనవిషయమునకు శాసనశాఖవారు 'జలేశ్వరదేవాలయ నిర్మాత స్థపతి మయిందరామ నామాంతరముగల (?) చతుర్థకులజుఁడు

కల్గరాభరణాచార్యులు1 ' అను నర్ధమిచ్చు ఇంగ్లీషు పంక్తులు వ్రాసిరి. చతుర్థకులజుడు స్థపతి యగుటకాని, అచార్య బిరుదాంచితు డగుటకాని కని విని యెఱుగని విషయములు. ఈ శాసనములను గుఱించి ౧౯౩౬ - ౩౭ వ సంవత్సరపు ఆర్కియలాజికల్ డిపార్టు మెంటువారి వార్షికనివేదికలో కొంత వ్రాసియున్నది. దాని భావ మిది: 'జలేశ్వరదేవాలయ నిర్మాతయైన మైందరాముడు (మహేంద్రరాముడు) అనుకల్గరాభరణాచార్యుడు చతుర్దవర్ణములోని కమ్మకులమునకు చెందినవాడు. కమ్మకులమునుగుఱించిన తొలుదొల్తటి సూచనలలో ఇది యొకటి2 '. చతుర్థకులజుడు స్థపతి యగుట, యాచార్య బిరుదాంచితుడగుట కని విని యెఱుగని విషయములు. ఇచ్చటనే మరి రెండు శాసనము లాలిపిలోనే కానవచ్చినవి. అందొకటి కల్గరాభరణాచార్యుని, రెండవది జల్పేశ్వరపురాచార్యుడును, విశ్వకర్మకులభూషణుడు నైన కల్గరాభరణుని శిష్యుడు చామోజ్ఞను పేర్కొను చున్నది.

పల్నాడు తాలుకా పొందుగల గ్రామమునకు నాలుగుమైళ్ళ దూరమున నున్న 'బొబ్బనాయక' దేవాలయములోని ఒక స్తంభముమీద ఒకశాసన మున్నది. ఒకానొక మైందరాముడను నతడు జల్పేశ్వరాలయమును గట్టిన విషయమును దెల్పి యీ శాసనము స్థపతి శ్రేష్ఠుడయిన కల్గరాభరణాచార్యుని పేర్కొనుచున్నది. అచ్చటిదే మఱియొక స్తంభముమీది శాసనము జల్పేశ్వర మహాదేవుని, విశ్వకర్మకులజుడైన కల్గరాభరణాచార్యుని పేర్కొనుచున్నది. మైందరాముడు కల్గరాభరణుడు ఒక్కరయినను, కాకపోయినను ఒక్కటే లిపిలోనున్న పూర్వోక్తశాసనములన్నిటిలోను వచ్చు కల్గరాభరణాచార్యుడు ఒక్కడే యనియు, అతడువిశ్వకర్మకుల జుడనియు నిరాక్షేపముగా నిశ్చయింపవచ్చును. అందువలన అయ్యంగారి పాలెము శాసనములోవచ్చుకమ్మకులము విశ్వకర్మకులము కానిచతుర్ధవర్ణమునకు చెందిన కమ్మకులము కాదు. ఒకవేళ ఆ శాసనమున లేఖకుడు విశ్వాకర్మకులమనుటకు పొరపాటున కమ్మకులమని వ్రాసియుండవచ్చును. అట్లువ్రాసినను అది పొరపాటు కాదు. కమ్మకులమని శాసనముననే యున్నచో దానిని విశ్వకర్మకులములోని కమ్మకులమని సమర్థింప వచ్చును. ఇట్లయినచో వైశ్యవర్ణమునను బ్రాహ్మణ వర్ణమునను కమ్మకులమున్నట్లే విశ్వకర్మ వంశోద్భవులలోగూడ కమ్మనాడను దేశవిభాగము ననుసరించి యేర్పడిన కులము వారు కమ్మకులజు లుండిరని నిశ్చయింపవచ్చును. ప్రాచీన కాలములో దేశవిభాగముల ననుసరించి యేర్పడిన శాఖాభేదములు బ్రాహ్మణులలో తక్క ఇప్పు డితరవర్ణములలో కాలక్రమమున నంతరించిపోయినవని యూహించుట సమంజసము.

దేశవిభాగముల ననుసరించి యేర్పడిన శాఖాభేదములమాట యటుండ, ఈ విశ్వకర్మకులోద్భవులలో చాల కులము లుండిన ట్లూహించుట కవకాశము కలదు.

అనంతపురముజిల్లా హిందూపురము తాలూకా కొండాపురము శివారు గ్రామమయిన గొనివారి పల్లికి చెందిన పొలములోని ఒక రాతిమీద నున్న మొదటి వీరప్రతాప దేవరాయల శాసనమువలన పాంచాల సంఘము డెబ్బదినాలుగు కులములదని తెలియు చున్నది. పంచాణము వారికే పాంచాలకులమనియు పేరు. రాచనగరిలోని హజారసింహాసనమును జేసినందుకు రెండవ హరిహర దేవమహారాయలు డెబ్బదినాల్గు కులాలవారయిన పంచాలకులజుల కొసంగిన మర్యాదలను దెలుపుటకు పుట్టిన శాసనమది,

1: *In Characters of the 7th Centnry A. D. States that the temple of Galpesa was built by the architect Maindarama alias (?) Kalgarabharanacharya of the fourth Caste.*

2. *The mext important inscription fron the Palnad taluk of the Guntur district which is engraved in the Chalukyan characters of the 7th Century A. D., furnishes the interesting information that the temple of Galpesa was constructed by the architect Maindarama (Mahindrarama). who was otherwise called kalgarabharanachrya and belonged to kammakula of the fourth caste. This is lhe one of the earliest references to "Kammakula,"*

పైని చెప్పిన కులముల వంటిదే మఱియొకటి దొమ్మరకులము. ఈకులమువారు పేరుమోసిన విద్యావంతులు. విజయనగరాధీశ్వరుల కాలములో వీరు తమ విద్యానైపుణి జూపి ప్రభువుల ప్రశంసతోపాటు మడి మాన్యములను సంపాదించినవారు. వీ రెక్కువగా నంద్యాలలో ఉండుట వలననేమో దానికి దొమ్మర నంద్యాలయని పూర్వము పేరుండెడిది. ఈ దొమ్మరలకే దొంబరలని పేరు. ఈ దొంబరలది ఇరువదినాల్గు కులమట. వీరి శాసనమొకటి పదునేడవ శతాబ్దినాటిది కందుకూరులో నున్నది. ఒకప్పుడు వీరు కందుకూరులో గడలు వేసికొని మోకులమీద నెక్కి తమ విద్యను ప్రదర్శించు చుండగా ఒకడు మోకుమీదనుండి క్రిందపడి మృతినొందెను. అప్పుడచ్చటి సభవారి విన్నపముమీద కసుబా కాపులు కరణాలు స్థలకరణాలు అందఱును గలసి సమ్మతిమీద ఆ దొమ్మరలకు కొంత మడిమాన్యమిచ్చి "ఇరువైనాలుగు కులాల దొమ్మరలకు" పన్ను పర్యాయములు లేకుండ జేసిరట. ఈ విషయమును దెలుపుటకే యీ శాసనము పుట్టినది. ఈశాసనమువలన దొమ్మరలది ఇరువదినాలుగు కులముల తెగయని తెలియుచున్నది. ఇట్లే దొమ్మర లిరువదినాలుగు కులముల వారని తెలుపు శాసనము లింకను గలవు. వాటి నిచట జేర్కొనుట యనవసరము.

ఇంకను ఇతరకులములకు సయితమిట్టి యంకె లుండిన నుండవచ్చును. ప్రాచీనకాలపు శాసనముల వలన నిప్పు డింతవఱకు పైనిచెప్పిన కులములకు మాత్రమే యవి తెలియవచ్చినవి. ఈసంఖ్యలు దేనికి గుర్తు? ఇవి యేమి తెలుపును అన్నది ఒకసమస్య— ఇంతవఱకు విడని చిక్కు. వీరందఱు పూర్వము వేలువేలు తెగలవారై, వారిలో అన్నన్ని కులము లైన నుండవలెను, లేదా వారి కులవ్యవహారములను బరిష్కరించుకొనుటకు, వృత్తి వ్యాపార విషయముల నరయుటకును పూర్వోక్తకులము లొక్కొక్క దానిలో అంకెలుసూచించు నంతమంది ప్రతినిధులతో గూడిన కులసభయైన నుండవలెను అని తోచుచున్నది. ఎట్లయినను ఇవి వట్టి యూహలే. ఇంతవఱకు కులములకు జేర్చియుండు నిట్టి సంఖ్యలనుగూర్చి వితర్కించినవారు ఒక్క మన తెలుగుదేశమున నే కాక హిందూదేశమున నెచ్చటను లేరు. ధర్మసూత్రములును ధర్మశాస్త్రమును పురాతనకాలము నుంచియు కులసభ లుండినట్లును, కులములకు సంబంధించిన సర్వ వ్యవహారములను అవియే చక్కబెట్టు చుండినట్లు తెలుపుచున్నవి. కులములకు సంబంధించినట్టిగాని వృత్తులకు సంబంధించినట్టి కాని యిట్టిసభలకు శ్రేణులని పేరు. వీటి నిపుడు 'ట్రేడ్ గిల్డ్సు' అనుచున్నారు. నిజముగా నీయంకె లట్టి శ్రేణులకు సంబంధించినవే యగుచో నందలి ప్రతినిధుల నే పద్ధతి నెన్నుకొనువారో, ఆ ప్రతినిధుల కుండవలసిన యోగ్యత లెట్టివో, వ్యవహారము నెట్లు జరపువారో ఈ సంగతులేవియు మనకు దెలియవు. ఇంకను ఇతర కులములకు వేనికైన నిట్టి యంకె లున్నవేమో తెలియదు.



# మయూరకవి - సూర్యశతకము



శ్రీ యామిజాల పద్మనాభస్వామి

'ఆరోగ్యం భాస్కరాదిచ్ఛేత్' అను సూక్తి విననివారు మనలో నుండరు. నిత్యము సూర్యనమస్కారము లొనర్చుచు ఎంతటి వార్ధకావస్థయందును దేహబలము చెడక జీవించు నదృష్టవంతులును కలరు. కనుకనే సూర్యుడు ప్రత్యక్షదైవమని యనుకొను చున్నాము. అంతేకాక జగత్తున స్థిర చర జీవములన్నిటికి దినదినము నూతన తేజోవికాసస్వాస్థ్యమున లందిచ్చు శక్తి సూర్యుని యందున్న దనుట యెల్లరకును విదితచరమే. సూర్యుని ప్రశంసించుటలో వేదపురాణవాఙ్మయమంతయు ఏకకంఠముగ ప్రవర్తించినది. కాని లౌకిక వాఙ్మయమున సూర్యమహాత్మ్యమును ప్రతిపాదించు కావ్యములు చాల తక్కువ. సంస్కృతభాషలోకూడ కాళిదాసాది మహాకవీశ్వరు లనేకు లున్నను సూర్యపారమ్యము నుద్ఘాటించిన కీర్తి మయూరకవి కొక్కనికే దక్కినది. ఆ మయూరుని కవితాసామ్రాజ్యమునకు సూర్యశతకము విజయపతాకము.

శ్రీ మయూరుడు కాదంబరీ రచయితగా ఖ్యాతిగాంచిన భట్టబాణునకు సమకాలికుడు. బాణుడు శ్రీహర్షుని ఆస్థానకవి. మయూరుడు ఉజ్జయినీ ప్రభువయిన వృద్ధభోజుని ఆస్థానకవియని, బాణునకు మామగారని చెప్పుటకు ఆధారములు కలవు. ఒకటి, మానతుంగాచార్యప్రణీత మయిన భక్తామరాఖ్యస్తోత్ర టీకా ప్రారంభమందలి ప్రశంస. రెండవది, మేరుతుంగాచార్య ప్రణీతమయిన ప్రబంధచింతామణి యను జైనమతగ్రంథములోని ప్రశంస. రెండవదానిలో బాణుడు మయూరునకు బావమరదికూడ అయియున్నట్లు చెప్పబడి యున్నది. ఇది యెట్టి సంబంధమో నిర్ణయింపజాలము గాని శ్రీహర్షునికాలము ననుసరించి బాణమయూరులు సమకాలికులని చెప్పుటకు మాత్రము ఈ ప్రశంసలు మన కుపకరించుచున్నవి. మరియు శార్ఙ్గధరపద్ధత్యాది ప్రసిద్ధ రాజశేఖర వచనము,

'అహో ప్రభావో వాగ్దేవ్యాః
యన్మాతంగ దివాకరః
శ్రీహర్షస్యాభవత్సభ్యః
సమో బాణమయూరయోః'

అనునదికూడ బాణమయూరులు సమకాలికులని చెప్పుటకు తోడ్పడుచున్నది. కనుక మయూరకవి క్రీస్తుశకము ఏడవ శతాబ్దమున పూర్వార్ధమందుండెడి వాడని చెప్పనొప్పును.

సాహిత్య ప్రయోజనములలో కల్యాణసంధాయకత్వము ఒకటియని నిరూపించుటకు మయూరుని కవిత ఏకైకనిదర్శనముగ నున్నది. మమ్మటుని కావ్యప్రకాశము - ఈ యర్థమునే పోషించుచు 'ఆదిత్యాదేః మయూరాదీనాం ఇవ అనర్థనివారణం' అని యన్నది. మమ్మటుడు క్రీ. శ. 1050 నాటివాడు. దీనికి జయరాము డను వ్యాఖ్యాత

'మయూరనామా కవిః శతశ్లోకే నాదిత్యం స్తుత్వా కుష్ఠా న్నిస్తీర్ణః ఇతి ప్రసిద్ధిః' అని వ్రాసినాడు. నాగోజీభట్టు ఉద్యోతమందు 'మయూరశర్మా సూర్య శతకేన కుష్ఠా న్నిస్తీర్ణ ఇతిచ ప్రసిద్ధిః' అన్నాడు. ఈవాక్యములనుబట్టియు మయూరుడు తన సూర్యశతకములో అక్కడక్కడ చెప్పినవానిని బట్టియు మయూరుడు కుష్ఠరోగియై ఆ రోగమును బాపుకొనుటకు ప్రత్యక్షదైవమయిన సూర్యుని అభివర్ణించినట్లు మనము తెలిసికొనుచున్నాము. ఈ క్రింది శ్లోకము ఆ శతకము నందారవది.

శీర్ణఘ్రాణాంఘ్రిపాణీన్ వ్రణిభిరపఘనైః
ఘర్ఘరావ్యక్తఘోషాన్
దీర్ఘాఘ్రాతానఘౌఘైః పునరపిఘటయ
త్యేక ఉల్లాఘయన్ యః
ఘర్మాంశోః యస్యవోంతర్ద్విగుణ
ఘనఘృణానిఘ్ననిర్విఘ్నవృత్తేః
దత్తార్ఘాః సిద్ధసంఘైః విదధతు ఘృణయః
శీఘ్ర మంహో విఘాతమ్.

దీనికి మత్కృతమగు ఆంధ్ర సూర్య శతకమునుండి అచ్చటచ్చట నుదాహరణము లిచ్చుచున్నాను—

కాలుం జేతులు ఘ్రాణముద్దెగి పురా
కర్మోద్భవవ్యాధులన్
చాలన్ కుయ్యిడువారి గాంచి కరుణన్
సర్వార్థసిద్ధిప్రభా
శీలుండై రుజలన్ హరించి యొకడే
చేకూర్చి యారోగ్యమున్
లీలన్ బ్రోచెడు ఘర్మభానుని ఘృణుల్
మీపాపము ల్గూల్చుతన్.

కనుక మయూరుడు సూర్యశతకము నెందుకు రచింపవలసివచ్చెనో దానివలన ఆత డెట్టి సత్ఫలమును పొందెనో నిర్ణయించుకొనుట మన బాధ్యత.

మయూరుని వయస్సుతో తపస్సు, వాక్సిద్ధి, అనుభవములు పండి సూర్యశతక రచనతో సంస్కృతవాఙ్మయమున ఏవారును పొందరాని ఉన్నతపీఠమును ఆతనికి ఇచ్చినవి. కనుకనే భగవత్ప్రసాదము కవిత్వమును గారడీగా నుపయోగించుకొని రాజులకడ తలయెగురవైచు కవులకంటె మయూరునియందు ఒక వైశిష్ట్యము వెల్లడియైనది. మయూరుని కవితాపద్ధతి చూచినచో వైదిక వాఙ్మయమునకును, లౌకిక వాఙ్మయమునకును మధ్య మయూరుడు రాయబారిగానున్నట్లు కాన్పించును.

అతిప్రాచీనమయిన వేదమహత్త్వ మతని రచనయందు వెల్లివిరిసినది. 'విశ్వాత్ముడయిన సూర్యుడు ఆతని కెంత కైవసమయినాడో గాని తాను తరించి ఇతరుల తరింప చేయుటకు మానవ లోకమునకు మయూరుడు రెండవ సూర్యుడై

శ్లో॥ కాలోకస్య భూత్యై. శతమితిరచితాః
శ్రీమయూరేణ భక్త్యా
యుక్తశ్చైతాన్ పఠేద్యః సకృదపిపురుషః
సర్వపాపైర్విముక్తః
ఆరోగ్యం సత్కవిత్వం మతిమతుల బలం
కాంతిమాయుః ప్రకర్షం
విద్యామైశ్వర్యమర్థం సుతమపి లభతే
సోऽత్ర సూర్యప్రసాదాత్.

అనినాడు.

లోకక్షేమకృతిన్ మయూరకవి సు
శ్లోకుండు చేసెన్న మో
వాకంబుల్ శతకంబుగా, నిది పఠిం
పన్ భక్తిసత్పుత్రవి
ద్యాకాంతుల్ సిరిసంపదల్ మతికవి
త్వంబాయు రారోగ్యముల్
శ్రీకైవల్యసుఖంబులున్ రవికృపన్
సిద్ధించు మీ కెప్పుడున్.

—ఆంధ్రసూర్య శతకము

కవులెల్లరు కూడ తమ రచనలలో భగవంతుని ప్రార్థించునపుడు 'మాం మవతు' 'మాంపునాతు' అని స్వార్థముగా భక్తిని భగవంతుని వినియోగించుకొన్నవారే. కాని మయూరుడు ప్రతి శ్లోకమునందును 'వోవ్యాత్' మంగళం వోదిశంతు'— మిమ్ము రక్షించుగాక, మీకు శుభము లిచ్చుగాక అని ప్రయోగించినాడు. అవి మన కెల్లరకు నాశీస్సులు. ఈ శతకమునకు అవే మాణిక్యమకుటములు.

శతకవాఙ్మయములో నెల్ల అత్యున్నతపదవి నందవలసిన యీ సూర్యశతకమునకు వాఙ్మయమున ప్రత్యేక స్థానముండి తీరును. వాఙ్మయచరిత్రలు రచించిన పెద్దలు దీనిని లక్ష్యపెట్టకపోయినను శ్రీనాథునివంటి కొమ్ములు తిరిగిన పండిత కవులు సూర్యశతకమునకు దాసానుదాసులయినారు.

శాతః శ్యామాలతాయాః పరశురివతమో-
రణ్యవహ్నేరివార్చిః
ప్రాచ్యేవాగ్రే గృహీతుం గ్రహకుముదవనం
ప్రాగుదస్తోऽగ్రహస్తః
ఐక్యంభిందన్ ద్యుభూమ్యోరవధిరివ విధాం
తేవ విశ్వప్రబోధం
వాహానాం వో వినేతా వ్యపనయతు విప
న్నామ ధామాధిపస్య

—సూర్యశతకము

శ్రీనాథుడు,

'చిరుసానబట్టించి చికిలిసేయించినగుబ్ర గొడ్డలి నిశాగహనలతకు' అనునది మొదలుగా కాశీఖండమునందు ప్రథమాశ్వాసమున 121నుండి 132వ పద్యము వరకు మయూరుని శ్లోకములకు అనుకృతులు దించినాడు.

కరకుం గొడ్డలియై నిశాలతకు, ప్రా
క్తన్వంగి హస్తాగ్రమై
మెరుగుంజుక్కల కల్వదోట చిదుమన్
మింటిన్ భువిన్ దెల్పగా

సరిహద్దై దవవహ్నియై యిరులగా
ల్చక సృష్టి తెల్వొందగా
సరసీజాసనుడౌ ననూరుడు వడిన్
శాసించు మీ యాపదల్

— సూర్యశతకమునుండి

ఉన్నది యున్నట్లు చెప్పవలసినచో ఉభయభాషాప్రౌఢిమగల శ్రీనాధకవిసార్వభౌముని వంటివాడు తన ఉత్తమరచన యయిన కాశీఖండమునందు వింధ్యగర్వాపహరణ కథాఘట్టమున సూర్యోదయ వర్ణనము అను శీర్షికతో వ్రాసిన పద్యములు మయూరుని సూర్యశతకశ్లోకములకు తెలుగుసేత యనుటకు సందేహము లేదు. కాశీఖండమునందితర ఘట్టములలో గూడ శ్రీనాధుడు మయూరుని శ్లోకముల ననుసరించిన వెన్నో యున్నవి. క్రీ. శ. పదునాలుగువ శతాబ్దమునందున్న భాస్కరరామాయణరచయితలలో యుద్ధకాండము తరువాయి వ్రాసిన అయ్యలార్యుడు సూర్యాస్తమయవర్ణనలో —

'తరువులయందు పల్లవపదస్థితి...' అను పద్యము కూర్చుటలో మహాకవి మయూరుని —

మూర్ధన్యద్రే ర్ధాతురాగః తరుషు కిసలయో
విద్రుమౌఘస్సముద్రే
దిఙ్మాతంగోత్తమాంగే ష్వభినవనిహిత
స్సాంద్రసిందూరరేణుః
సీమ్ని వ్యోమ్నశ్చ హేమ్నః సురశిఖరి
భువోజాయతే యః ప్రకాశః
శోణిమ్నా ఽసౌ ఖరాంశోః ఉషసి దిశతు
వః శర్మ శోభైకదేశః

అనుశ్లోకము మాతృకమై యొప్పుచున్నది.

చిగురై చెట్లకు వార్ధికిన్ పవడమై
సిందూరమై వెల్ల యే
నుగు నెమ్మోమున ధాతురాగము గుమన్
పూర్వాద్రి పై మింట స్వ
ర్ణగసౌవర్ణ విభూషమై యరుణిమన్
ప్రాభాతశోభాస్పదం
బగుచున్ భాసిలు తిగ్మభానురుచి సౌ
ఖ్యం బిచ్చు మీ కెప్పుడున్.

సూర్య శతకము

ఈ శతకమందలి శ్లోకములన్నియు స్రగ్ధరావృత్తమును వరించి గంధసింధురములవలె నడచినవి. ఇంతకును ఆ భాష అందలిధ్వని గాంభీర్యములు, అందలి హాయి సూర్యశతకమునందు మూర్తీభవించుటలో తమ అమరత్వమును మయూరునకును ఆపాదించిపోయినవి. అదిగాక మయూరుని జీవితానుభవమంతయు సూర్యశతక రూపమున కిరుడు గట్టి సంస్కృతవాఙ్మయమునే ధన్యము గావించిపోయినదో!

ఇందు కుదాహరణగా చూడదగినది.

ప్రాతః శైలాగ్రరంగే రజని జవనికా
పాయ సంలక్ష్యలక్ష్మీః
విక్షిప్యాపూర్వపుష్పాంజలి ముడునికరం
సూత్రధారాయమాణః
యామే ష్వంకేష్వివాహ్నః
కృతరుచిషు చతుర్ష్వేవ జాతప్రతిష్ఠాః
అవ్యాత్ప్రస్తావయన్వో జగదటనమహా
నాటికాం సూర్యసూతః

—మయూరుని సూర్య శతకము

తొలగన్ రేతెర దర్శనీయకళతో
తో తెంచి, ప్రాక్పర్వతా

గ్ర లసద్రంగమునన్ సుమాంజలిగ
చుక్కల్ చిమ్మి నాల్గంకముల్
వెలయన్ జాముల నాటికన్ కృత
రుచిన్ విశ్వాటనాఖ్యంబునన్
తొలి నాందిన్ తగు సూత్రధారు డిన
సూతుం డొప్పు మిమ్మేలుతన్
—సూర్య శతకము నుండి

ఈ శతకమున సూర్యుని సంసారమంతయు చక్కగ వర్ణింపబడినది. కిరణప్రసారవర్ణనతో మొదలుపెట్టి పందొమ్మిది శ్లోకములలో కిరణపుంజము సాంద్రమగు క్రమము వర్ణించెను. అటుపై నలుబది మూడవ శ్లోకమువరకు ద్యుతివర్ణన కావించి నలుబది తొమ్మిదవశ్లోకముగుర్రములను చిత్రించెను. తరువాత అరవై యొకటవ శ్లోకమువరకు, సారథిని ప్రశంసించి డెబ్బది రెండవశ్లోకముపర్యంతము రథమును శ్లాఘించెను. పిమ్మట ఎనుబదియవ శ్లోకమువరకు, మండలశోభను కొనియాడి అటుపై నూరవ శ్లోకమువరకు సూర్యభగవానుని స్తుతించినాడు. సూర్యుని వర్ణించుటలో స్వభావోక్తి ప్రధానముగ గైకొనినాడు. అయినప్పటికి మయూరుని వర్ణనలు ప్రకృతిశోభను మాత్రమే చిత్రించునవి కావు. వేదసూక్తములలోని మంత్రశక్తి, అతీంద్రియదర్శనము మయూరుని శ్లోకములలో నిగూఢముగ వ్యాపించి ఈ శతకమున కసాధారణమహిమను కూర్చినవి. మచ్చునకు—

దేవః కిం బాంధవః స్యాత్ ప్రియసుహృదథవా
చార్య ఆహో స్విదర్యో
రక్షా చక్షుర్నుదీపో గురురుత జనకో
జీవితం బీజ మోజః।

ఏవం నిర్ణీయతే యః కఇవ న జగతాం
సర్వథా సర్వదాఽసౌ
సర్వాకారోపకారీ దిశతు దశశతా
భీషు రభ్యర్థితం వః.

అను పద్యమునందలి భావమునకు

'ఆదిత్యోవై తేజ ఓజో బలం యశ శ్చక్షుః......'

అను సూర్యోపస్థానమంత్రము ఆధారముగ కన్పించుచున్నది.

దేవుండో గురుడో సుమిత్రమొ జగ
ద్దీపంబో బీజంబొ ప్రా
ణోపంద్యుండొకొ చుట్టమో నయనమో
ఓజం బాకొ తండ్రియో
జీవంబో భువనాల కంచును అని
శ్రేయుండుగా సర్వరూ
పావిర్భావమునన్ సహస్రకరు డీ
ప్సార్థంబు మీ కిచ్చుతన్.

—సూర్యశతకము నుండి

ఈ శతకము తరతరములనుండి సౌరమతావలంబులకు వీరశైవులకు నిఖిలశిష్టులకు గూడనుపాస్య గ్రంథమై యున్నదనుటకు పాల్కురికి సోమనాథుని పండితారాధ్య చరిత్రమున్నగు గ్రంథములవలన తెలియనై యున్నది. దీనికి ఇరువదియైదు వ్యాఖ్యలు వెలువడినవి. అమెరికాలోని కాలిఫోర్నియా యూనివర్సిటీ వారు మయూరుని సూర్యశతకమునకు ఆంగ్లభాషలో విపులమయిన టీక అనువాదము ఉపోద్ఘాతము చేర్చి ప్రకటీకరించియున్నారు.

తెనుగులో క్రీ. శ. 1898వ సంవత్సరమున శ్రీ వ. సు. రాయడు సరస్వతి పత్రికలో ఆంధ్రసూర్యశతక మను పేర ప్రకటించినారు. 1905వ సంవత్సరమున బెరన్ హైమన్ అను పాశ్చాత్యపండితుడు ఇటాలియన్ భాషలోనికి అనువదించినాడు. సింహలీస్‌లో కూడ ఒక అనువాదమున్నట్లు వినికి. సంస్కృతభాషాపరిచయమే కొఱవడిన యీ దినములలో కవితాప్రౌఢి వెల్లివిరిసిన మయూరుని వచోవిజృంభణములు అనేక దేశభాషలలో ప్రతిధ్వనులీనగలుగుటకు కారణము శ్రీ మయూరకవి పరమకారుణిక హృదయసంశుద్ధి మాత్రమే.

# కీర్తిశేషులు శ్రీ విక్రమదేవవర్మ

'శిల్పి'

ఆంధ్ర విశ్వవిద్యాలయం ప్రోత్సాహకులు శ్రీ విక్రమదేవ వర్మగారి స్వర్గమనంతో తెలుగుదేశం వదాన్యశేఖరుడు, ఉదారసాహిత్యపోషకుడు, నిరంతరసారస్వతోపాసి అయిన ఒక విద్వత్ప్రభువును కోలుపోయింది.

ఇంచుమించుగా ౧౯ వ శతాబ్ది అంతంవరకు మన దేశంలో సాహిత్యానికీ, కళలకూ సంస్థాధిపతులు చేసిన సేవ అమూల్యమయినది. ఈ శతాబ్ది ఆంధ్ర వాఙ్మయచరిత్రలో ఆ యా సంస్థానాధిపతులైన సాహిత్యపోషకులు ఆయా వాఙ్మయశాఖల అభివృద్ధికి అవలంబించిన ఔదార్యము ప్రత్యేక సంస్మరణీయము. జయపురాధీశ్వరులయిన శ్రీ విక్రమదేవవర్మ భూపతి మహోదారులయిన ఇటువంటి సాహిత్యపోషకప్రభువుల కోవకు చెందినవారు.

జయపురసంస్థానం ఆంధ్రోత్కళ దేశాల సరిహద్దులలో ఉన్నది. రాజకీయ కారణాలవల్ల ప్రస్తుతం ఇది ఉత్కళరాష్ట్రాంతర్గత మైనది. అయినా ఈ సంస్థానంలో ఆంధ్రోత్కళభాషలకు రెండిటికీ ప్రాముఖ్యం ఉన్నది. జయపురాధీశ్వరులు చిరకాలం ఆంధ్రదేశంలో ఉండి ఆంధ్రదేశీయులే అయినారు. అయినా సంస్థానాధికారం హస్తగతమైన తరవాత వారు పక్షపాతదృష్టి విడిచి ఉభయదేశ వాఙ్మయాలు సమానదృష్టితోనే ఆదరించారు.

ఆంధ్ర విశ్వవిద్యాలయం ఉదారులయిన వారి సహాయంవల్లనే ఎక్కువగా ఇతర భారత విశ్వవిద్యాలయాలతో సరితూగజాలుతూన్నదని అనవచ్చును. వారు ఏటేటా మన విశ్వవిద్యాలయానికి లక్షరూపాయల విరాళం ఇస్తూన్న విషయం తెనుగువారందరికీ తెలిసినదే. ఇదిగాక, ప్రత్యేకంగా మన విశ్వకళా పరిషత్తు సాంకేతికవిద్యాభవనానికి వారు ఆరు లక్షల విరాళం ఇచ్చారు. ఇలాగే ఉత్కళ విశ్వవిద్యాలయానికి కూడా వారు లక్షలకొలది విరాళాలిచ్చారు. రాజమహేంద్రవరంలో ప్రత్యేకంగా వారి ధనసహాయంతో నిర్మించిన విక్రమహాలు రాజమహేంద్రనగరంపై వారికి గల ప్రత్యేకాభిమానానికి తార్కాణము. ఇంతేకాక ఆంధ్రదేశంలోని అనేక ధార్మికసంస్థలకు, సారస్వత సంస్థలకు వారు, అత్యధికంగా విరాళాలిచ్చి అనేకవిధాలుగా ఆంధ్రదేశ సంస్కృతికి దోహదం కలిగించారు. ఇంతేగాక ఈ తరంలోని ప్రసిద్ధకవుల నేకులకు వారు మిత్రులై, పోషకులై వారి సారస్వత రచన లెంతో గౌరవించి ఆదరించారు.



స్వయంగా విక్రమదేవవర్మగారు బహు ఆంధ్ర గ్రంథకర్తలు. సంస్థానాధికారానికి వచ్చిన తరవాత కూడా వారు ప్రధానాధికారులపై సంస్థాన పరిపాలన భారం విడిచి సారస్వతగోష్ఠిలోనే ఎక్కువగా కాలం గడుపుతూ ఉండేవారు.

౧ శ్రీనివాసకళ్యాణనాటకము, ౨ మానవతీ చరిత్రము, 3 నీతి గీతి శతి, ౪ బాల గోపాల శతకము, ౫ విక్రమదేవవర్మ రచనలు మొదలయిన వారి స్వీయకృతులు తెలుగుపాఠకులకు సుపరిచితమైనవే.

స్వీయమైన కృతికర్తృత్వంతో తృప్తిపడక వారు సుప్రసిద్ధమైన అనేకాంధ్రసాహిత్యరచనలకు కృతిపతులై అత్యుదారంగా ఆయా రచయితలను సన్మానించారు.

గిడుగురామమూర్తిపంతులు సవరభాషా గ్రంథానికి వారు కృతిభర్తలు. ఇంతేగాక 'శ్రీపాద కృష్ణ

మూర్తిశాస్త్రిగారి లక్ష్మీ పరిణయము, చెళ్ళపిళ్ళకవీశ్వరుని విక్రమ చెళ్ళపిళ్ళ, మల్లాది సూర్యనారాయణ శాస్త్రిగారి ఆంధ్ర భాషానుశాసనము, అప్పల్ల జోగన్న శాస్త్రిగారి వైయాకరణ సిద్ధాంత కౌముదీ శరదాగమము, శెట్టి లక్ష్మీనరసింహకవి ప్రభావ శాపవిమోచనము మొదలైన గ్రంథాల కెన్నిటికో వారు కృతీశ్వరు లైనారు.

సంస్కృత, ఆంధ్రోత్కళాది భాషలలో శ్రీ విక్రమదేవవర్మగారు తలస్పర్శియైన పాండిత్యం గలవారు. ఆంధ్రభాషలో నేకాక ఉత్కళభాషలో కూడా వారు బహుగ్రంథరచనం చేసి ఆ వాఙ్మయంలో విద్వాంసుల మన్నన లందుకొన్నారట. ఉత్కళభాషలో వీరు రచించిన కావ్యాలు, రూపకాలు, మొదలయినవి సుమారు ౧౬ దాకా ఉన్నాయి. ఉత్కళులకు ఆంధ్రులకు అంతగా సాంస్కృతిక సన్నిహితత్వం ఏర్పడలేదు. ఆంధ్రోత్కళ భాషాభిజ్ఞులయిన శ్రీ విక్రమదేవవర్మగారు తెలుగులోనించి కొన్ని తెలుగుగ్రంథాలు ఓఢ్రభాషలోకి అనువదించి, ఉత్కళులకు కొంతవరకు తెలుగు సాహిత్యరీతులు చవిచూపించారు. మన కళాపూర్ణోదయంవంటి ఉత్తమ ప్రబంధం వారు ఉత్కళ భాషలోకి అనువదించిన విషయం తెలుగువారికి చాలామందికి తెలిసిఉండకపోవచ్చును. ఇట్లాగే ఈశావాస్య, బృహదారణ్యకోపనిషత్తులు కూడా వారు సంస్కృతంలోనించి ఉత్కళంలోనికి అనువదించారు. ఇంకా వారు ఉత్కళంలో సంగీత రాధామాధవము, బుద్ధచరిత్రము, తులసీ విక్రమరామాయణము మొదలైన గ్రంథా లెన్నో రచించి ఆ వాఙ్మయంలో సుప్రసిద్ధు లైనారు.

ఈవిధంగా ఆంధ్రోత్కళభాషలలో కృతికర్తృత్వ, కృతిపతిత్వాలవల్లనే గాక, విక్రమదేవ వర్మగారు తీరికసమయాలలో భారతి మొదలయిన ప్రసిద్ధ పత్రికలలో వ్యాసాలు వ్రాసి, వాఙ్మయగోష్ఠులలో పాల్గొంటూ అత్యధికంగా భాషాసేవ చేశారు. శరన్నవరాత్రాది ఉత్సవసమయాలలో వారు, ఏటేట జయపురంలో విద్వత్సభలు జరిపించడమూ, ఈ సమావేశాలకు సుప్రసిద్ధ విద్వాంసులను ఆహ్వానించడమూ, నిత్యము సారస్వతప్రసంగాలలో మునిగితేలుతూండడము ఆంధ్రదేశీయు లందరికి తెలిసిన విషయమే. ఇంతేగాక తెలుగుదేశంలో ఏ సారస్వతసమావేశం జరిగినా స్వయంగా వారా సమావేశాలకు విచ్చేసి విద్వాంసుల వాదోపవాదాల్లో తాము కూడా పాల్గొంటూండేవారు.

జయపురం సాలీనా సుమారు ౨౨ లక్షలు ఆదాయం వచ్చే సువిశాలమైన సంస్థానము. ఈ సంస్థానాధిపత్యం బాల్యనించీ విక్రమదేవవర్మగారికి లభించలేదు. కొంత వయఃపరిణతి వచ్చినతరవాతనే వీరికి సువిశాల సంస్థానాధిపత్యం సంక్రమించింది. సహజంగా బాల్యంనించీ నిరాడంబరంగా జీవయాత్ర సాగిస్తూ వాఙ్మయ వ్యాసంగం సాగించే జయపురాధీశులు, సంస్థానాధిపత్యం లభించినతరవాత కూడా పూర్వపద్ధతిలోనే నిరాడంబరంగా జీవయాత్ర సాగిస్తూ నిర్లిప్తతతో వాఙ్మయవ్రతులై కాలం గడిపేవారని తెలుస్తున్నది. వీరు తమ సంస్థానానికి కళాప్రపూర్ణ త్రిపురాన సూర్యప్రసాదరాయ కవిగారినీ, కవిరాజు పెనుమెచ్చ సత్యనారాయణరాజుగారినీ, కవిభూషణ శెట్టి లక్ష్మీనరసింహ కవిగారినీ ఆంధ్రాస్థానకవులుగా నియమించి ఈ కవుల సాహిత్య వ్యాసంగాల కెంతో సాహాయ్యం చేశారు.

ఇలాగే ఉత్కళభాషకు మహామహోపాధ్యాయ రామనాథ నందశర్మగారిని ఆస్థాన కవిగా నియమించి తమ ఆస్థానంలో ఆయా దేశభాషలకు గౌరవం కలిగించారు.

జయపురంవంటి గొప్ప సంస్థానానికి అధిపతులయినా వారిలో వుండే నిరాడంబర జీవితము, సరళస్వభావము, నిత్యసారస్వత వ్యాసంగము, సారస్వతవ్రతులలోనే గాక జనసామాన్యంలో కూడా వారియెడల గల గౌరవభావం ఇనుమడింప జేశాయి.

బాహ్యంగా రాజ్యపరిపాలనాదికం నిర్వహిస్తున్నా వారి ప్రకృతి నిత్యము వాఙ్మయాభిముఖమై ఉండేది. ఐశ్వర్యాద్యధికారాలు అపరిమితంగా హస్తగతమైన దినాలలోకూడా వారి నిత్యవాఙ్మయ వ్యాసంగం ఎప్పుడూ ఏమరలేదు. ఇదిగాక నిత్యనిగర్వత వారిలో గల ఈ ప్రవృత్తుల కన్నిటికీ మనోహరమైన మార్దవము, సంపూర్ణత్వము చేకూర్చింది.

పరిణత వయస్కు లయినా వారి స్వర్గమనము, ఆంధ్రవిశ్వ విద్యాలయానికేగాక, ఆంధ్రవాఙ్మయానికీ, సారస్వతోపాసకులకు ఆంధ్రదేశీయ ప్రజాసామాన్యానికీ అత్యంతము అనుతాపం కలిగించగలదు. భౌతిక దేహం అస్తమించినా నిత్యసారస్వతవ్రతి, వాఙ్మయ పోషకుడు, ఆంధ్ర విశ్వవిద్యాలయాధారమూర్తి అయిన శ్రీ విక్రమదేవ వర్మగారి మధుర స్మృతి తెలుగునాట, తెలుగు వాఙ్మయచరిత్రలోనూ నిత్య సౌరభములు వెదజల్లుతూ ఉండగలదు. వారి పుణ్యాత్మకు భక్తిపూర్వకంగా మా శ్రద్ధాంజలు లర్పిస్తున్నాము.

# రాచమొలక

శ్రీ కర్రా చంద్రశేఖరశాస్త్రి

సాయంకాలం 7 గంటలకు పట్టణానికి 6 మైళ్ల దూరంలోఉన్న బాణాల మెరకకి చేరుకున్నాడు త్రివిక్రమభూపతి. ఈమృగయావినోదయాత్ర చాలకాలం క్రిందటే తలపెట్టాడు. కాని పట్ట మహిషి అవరోధాలవల్ల ప్రయాణం వెనకబడి పోతోంది. అయినా ఎప్పటి కిప్పుడే తానే దార్లు, రైతులూ వచ్చి వన్యమృగాల బాధలు నివేదించుకొంటూ మొర్ర పెట్టు కోవడంవల్ల నేటికి తప్పనిసరిగా బయలు దేరవలసివచ్చింది. సముచిత పరివారాన్ని కావలసిన సంబారాలతో వెంటబెట్టుకొని బయలు దేరాడు. తెల్లవారితే శరత్పూర్ణిమ. అంచేత కౌముదీ విహారంకూడా కలసి వస్తుందనే కుతూహలంతో తాను కూడా వస్తానని ప్రాథేయపడింది పట్టమహిషి. పాపం ఇంతవరకు పతిని విడిచి ఒక్క రోజైన మసిలిన మనిషికాకపోవడంవల్ల ఆలోచనలో పడ్డాడు. భార్యను తీసికొని వెడితే ఏకైక పుత్రుడు కూడా వెంటబడతాడేమో, వెళ్లేది వన్యమృగాల వేటకోసం, కూడా వచ్చేది రాణీవాసం అయితే, కార్యభంగం అవుతుందేమో- చివరకు మృగయావినోద, కౌముదీ విహారాలకు పొత్తు కుదరదని రాణికోరికను నిరాకరించాడు. పదునాలుగేళ్ల కుమారునికి ప్రధాన మంత్రి రుక్కప్ప గారిని సహాయంగా ఉంచి వాళ్ళిద్దరిమీదా రాజ్యభారంపెట్టి రాజధానిలోనే హెచ్చరికలు చేసి వారిని ఉంచేశాడు.

పాలకీలోంచి త్రివిక్రమ భూపతి వీరన్న మంత్రి వెంటరాగా బాణాలమెరకంతా చుట్టివచ్చాడు. ఈ మెరకమీద తన పూర్వులంతా ధనుర్వేదం సాంగంగా నేర్చుకొని ఉండడంవల్ల ఈ బాణాల మెరకంటే వెర్రిఅభిమానం త్రివిక్రమభూపతికి. ఆ మెరకమీదుగా ఎక్కడకు ప్రయాణం అయి వెళ్లవలసి వచ్చినా ఆ మెరకమీద మజిలీ చెయ్యకుండా వెళ్ళడు. చంద్రమండలం అప్పుడే ముఖం క్రిందు మీదులకు కదపక్కరలేని సమదృష్టిలోకి కనుపిస్తోంది, ఆకాశంలో చకోరాలు చంద్రికల్ని జుఱ్ఱుపదునుగా బారులుతీర్చి ఆస్వాదిస్తున్నాయి.

గుంపులోంచి చెదిరిపోయిన నాలుగు మూడు తలక్రిందుపక్షులు రెక్కలు తపతపా కొట్టుకొంటూ ఆవాసవృక్షాన్ని చేరుకొంటున్నాయి. జ్యోతిర్లేఖానదికి పది గజాల దూరంలోఉన్న ఆ బాణాల మెరకమీద ఏర్పాటు చేయబడ్డ గుడారాల్లోవిడిది చేశారు రాజూ పరివారమూను. గుడారాలన్నిటికి మధ్యనా సుందరమైన పట కుటీరమొకటి నిర్మించారు-భూపతికోసం. దానికి కుడిపక్క-వీరన్న మంత్రిగుడారం. ఎడమ ప్రక్క సేనాని కుటీరం. ఇంకా కొంచెం

దూరందూరంగా వంటశాల, మజ్జన భోజనాదిశాలలు, దండువిడియడానికి పాకలు, పందిళ్లు నిర్మింపబడ్డాయి. దూరాన ఉన్న తమాల వృక్షాలతోపుల్లో బండ్ల ఎడ్లనూ, గుర్రాల్ని దాణాలు పెట్టి నీళ్లు త్రాగించి కట్టివేశారు. సేవకులు పరిచారకులు బండ్ల మీదనుంచి మూడు రోజులకూ సరిపోయేలా తెచ్చుకున్న సామానుల నన్నిటిని దింపి గుడారాల్లోకి చేరవేస్తున్నారు. భూపతికి ప్రత్యేకశాలలోను, మిగత పరివారానికి పాకలలోను పందిళ్ళలోను వంటలు తయారవుతున్నాయి ఆయా శాఖలకు చెందిన సేవకులు కొందరు భూపతికి చేయతగ్గ ఉపచారాల్లో నిమగ్నులై యున్నారు. కొందరు ప్రయాణపర్యంకాన్ని దోమ తెరతో సహా భూపతి శయ్యాగారంలో అమరుస్తున్నారు. ఒకమూల గంటలు తెలియజేయడానికి ఒక పెద్దగడియారము దాని ప్రక్క గంటలు కొట్టడానికి పెద్దకంచుదిమ్మ ఏర్పాటు చేసి అక్కడ ప్రత్యేకంగా ఒక సేవకుణ్ని నిలబెట్టారు. ఎత్తుగా నిర్మించిన వితర్దుల మీద ఆసీనులై సాయంభేరీ, నగారా మ్రోగిస్తున్నారు మాగధులు. ఆయుధాలకట్టలు విప్పి మెరుగుపెడుతూ మందులు దట్టిస్తున్నారు కొందరుసిపాయిలు. ఈవిధంగా ఎక్కడ చేయతగ్గ హంగులు అక్కడ అమరుస్తూ ఒక గంటలో ఆ బాణాల మెరకని ఒకచిన్న మజిలీ నగరంగా తయారు చేసేశారు. విడుదులు, బాటలూ విద్యుద్దీపాలతో మిలమిలా మెరిసి పోతున్నాయి. ఇంతకు ముందు ఆ మెరక మీదుగాపోయి తిరిగి వచ్చే గ్రామీణులు ఈ హఠాత్సృష్టిని తిలకించి విస్తుపోతున్నారు. పహారాజవానులు ఏమరకుండా విచ్చుకత్తులతోటి బారుచేసిన తుపాకులతోటి మెరకంతా కలియ దిరుగుతున్నారు.

అందరూ తమతమ కాలోచిత కృత్యాలు నిర్వర్తించుకొన్న తర్వాత వీరన్నమంత్రి భూపతి గుడారానికి వేంచేసి నిర్దిష్టమైన ఆసనంపై ఉపవిష్టుడై తెల్లవారితే చేయతగ్గ దినచర్యతో ప్రారంభించి క్రమంగా పురాణాల్లోని పూర్వపు నృపతుల మృగయావినోదాలవరకు ప్రసంగం సాగించి గోష్ఠివినోదం ప్రసారం చేస్తున్నాడు. పర్యంకం మీద ఒడ్డింపుగా పండుకొన్న భూపతి ఒక్కసారి హఠాత్తుగా లేచి కూర్చొని వీరన్నగారూ! రాజ్యభారం అంతా అబ్బాయిమీద ఉంచి వచ్చాను; ఈ వేట పనులు రెండు రోజులలో తెముల్చుకొని మనం పట్టణం చేరుకోవాలి. మాటిమాటికీ ఆ రైతులు, జానపదులు వచ్చి మృగాలబాధ నివేదించుకొంటూండడంవల్ల తప్పనిసరిగా ఈ వేటకు రావలసి వచ్చింది. ఈ రెండు రోజులూ పదునాలుగేళ్ళ అబ్బాయి రాజ్యభారం ఎల్లా నిర్వహించుకో గలుగుతాడో? అయినా దుక్కప్పగారిని ప్రధానకార్యాలు స్వయంగా చూచుకొంటూ అబ్బాయికి ఒత్తిడి కలుగనీయవద్దని ముమ్మారు చెప్పి వచ్చాను. కానీ...'

వీరన్నమంత్రి:—ఏం ప్రభూ! ఏం సెలవీయదలచారు?

భూపతి:—అబ్బే వచ్చేటప్పుడు రాణి 'మీకు మృగయావినోదం, నాకు కౌముదీ విహారంకూడా కలసి వస్తుంది నన్నూ కూడా రమ్మని సెలవా' అని ఉత్సాహపడింది; కాని నిరాకరించాను.

వీరన్న:—ప్రభూ! రాణీ సర్కారుని కూడా వెంటబెట్టుకొని రావడంలో అధిక శ్రమం మనకేం కలుగబోదని ప్రభువులకు తోచకపోయి ఉండదు. మరిదేని కుపేక్ష వహించారోకాని.

భూపతి:—మరేంలేదు వీరన్నగారూ! రాణీ నిమిత్తం మరికొంతమంది స్త్రీజన పరివారాన్ని తరలించుకు రావలసి వస్తుందని విరమింపచేశాను. అయినా వేట వీరవిహారం, కౌముదీవినోదం ఉద్యానక్రీడ కాదుటండీ, అంచేత కూడా కొంత ఉపేక్ష వహింపవలసివచ్చింది.

వీరన్న:—కావచ్చు ప్రభూ! కాని స్థలభేద సమయ భేదాలనుబట్టి రెంటినీ సమన్వయపరుచుకోవచ్చు. అయినా తాము తలచినది కూడా కొంత సమంజసమే.

ఈ విధంగా కొంతసేపు సంభాషణ జరిగిన పిమ్మట 'సరే వీరన్నగారు! చాల ప్రొద్దుగడచింది, మీరు వెళ్ళవచ్చు' అని మంత్రికి సెలవొసంగి భూపతి తల్పంమీద మేను వాల్చాడు. సేవకుడు తొమ్మిది కొట్టాడు.

తల్పంమీద వెల్లకిలా పండుకొని ఏవో రాజ్యతంత్రాలు, వేటలోని సుఖవులూ, అవీ, యివీ ఆలోచిస్తూ ఉన్నాడు. మనస్సులో ఒక్కొక్క ఆలోచనే ఒకదాని తరువాత మరియొకటి తొంగి చూచి పోతున్నాయి. స్పష్టంగా కొన్ని, అస్పష్టంగా కొన్ని మెరకమీద పహరావారి బహుపరాకులు వినిపిస్తున్నాయి. పటకుటీరంలోంచి పైన ఆకసంమీద చంద్రుడు వెండిపళ్లెంలా మసక మసకగా గోచరిస్తున్నాడు. తన్మయత్వంతో ఆ శరచ్చంద్రుణ్ణి చూస్తూండడం వల్ల తనకు తెలియకుండానే కొన్ని అంతఃపురభావాలు మనస్సులో పుట్టడం, అవి చెలరేగడం కూడా మొదలుపెట్టాయి. ఆవలింతలు ముమ్మరంగా వస్తున్నా నిద్ర మాత్రం పట్టడంలేదు. తల్పానికి మధ్యగా దిండ్లు లాక్కొని ఆని కూర్చున్నాడు. అక్కడికి కూడా కొన్నికొన్ని భావాలు తరుముకు వచ్చాయి. లేచి గుడారంలోనే పచారు చేయ మొదలుపెట్టాడు భూపతి. అక్కడికీ వెంటాడాయి కొన్ని భావాలు. పటద్వారం ప్రక్కకు తొలగించి బయటకు వచ్చాడు. ఎదురుగా పూచిన రెల్లువనం, నదీసైకతాలు, స్వచ్ఛజలాలు వెన్నెలలో కలిసిపోయి వేరుపరచ వీలులేకుండా ఉన్నాయి. పది, అడుగులు ముందుకుసాగి నలువైపులా దృష్టిని సారించాడు. పహరావాళ్లు కూర్చుని కొందరు, నిలబడే తుపాకి మడమలమీద గడ్డాలు ఆన్చి కొందరు కునికిపాట్లు పడుతున్నారు. నదిఒడ్డునేఉన్న వెదురుగడల చివళ్ళ వ్రేలాడే తలక్రిందు పక్షులు కిలకిలమని అర్చి రెక్కలు తపతప కొట్టుకొంటూ ఎగిరిపోయి మరోచోట వ్రాలాయి. వలయాలుగా వంగియున్న గడలు పక్షులు లేచి పోవడంతోనే జువ్వుమని నిట్రబాటుగా నిలబడిపోయాయి. పొదలలోఉన్న కీచురాళ్లుఅన్నీ ఒకసారి ఈలలు కొట్టాయి. ఎండుటాకుల మీదనుంచి తొండ ఒకటి మర్మరధ్వని చేస్తూ పారిపోయింది. ప్రకృతిలో బయలుదేరిన యీ అలికిళ్ళకు పహరా వాడొకడు మేలుకొని 'పహరా హుషార్' అని అరిచాడు. దానికి జవాబుమాట రాలేదు. మళ్ళీ రెట్టింపు గొంతుతో అరిచాడు. నలుమూలల

నుంచి జవాబులుగా ఒకడి తరువాత ఇం కొకడు ఈ మాటలే అరిచారు. పదిహేను నిముషాలు ముందుకుపోయిన గడియారం కేసిచూసి చకితుడైకొద్ది విసురుతో పదకొండు గంటలు కొట్టాడు సేవకుడు. భూపతి కుటీర ద్వారం వద్దనున్న దావారికులిద్దరూ తొల గింపబడియున్న ద్వారంలోంచి చితుకు గుండెలతో లోనికి తొంగితొంగి చూచారు. పాన్పుమీద ప్రభువులేడు. దిగ్భ్రాంతు లయి పోయారు. కంగారుపడి నలుమూలలూ పరి కించారు. ఆపుడు వెన్నెలలో కలిసిపోయిన దుస్తులతో ఒకవ్యక్తి మెరకమీద నిలబడి యున్నట్లు పొడకట్టగా మళ్ళీ జాగ్రన్నినా దాలు ఉచ్చైస్స్వరంతో పలికారు. వెంట వెంటనే మెరకంతా పహరా జవాన్ల నినా దాలతో మారు మ్రోగిపోయింది. నిమి షంలో గుడారాలన్నీ మేలుకున్నాయి. దూరానఉన్న భూపతి 'ఎవరక్కడ' అని అరిచాడు. ఎవర్ని ఉద్దేశించి వేసిన ప్రశ్నో తెలియకపోవడంవల్ల జవానులు ఒకరివైపు ఒకరు చూచుకున్నారు. ఉచ్చంగా మళ్ళీ అల్లాగే కేకవేశాడు భూపతి. ఒక సిపాయి ఈలవేసి తుపాకి ఝుళిపిస్తూ మ్రోలకువచ్చి వంగి సలాంచేశాడు. గుడారాలన్నీ ఒక్క సారిగా గుసగుసలు పోయాయి. 'వీరన్న మంత్రిని పిలు' అన్నాడు అధికారసర్వంతో భూపతి. మాట వెంబడినే జవాబుగా మంత్రి వచ్చి ఎదుట వినమ్రుడయాడు. క్షణమూర కొని తలపంకించి 'బోయీలను పంపి రాణీ గారిని' అన్నాడు భూపతి. మంత్రి ఎంత ప్రొద్దు అయిఉంటుందా అన్నట్టు ఆకాశాని కేసి చూచాడు. దూరంగా చక్రవాకం ఎగురుతూ ఎగురుతూ తూలి ఓపట్టి కొట్టి సగం క్రిందకు పడిపోయి మళ్ళీ ఎగిరి పోయింది. వీరన్నమంత్రికి సంగతంతా అవ గాహన అయిపోయింది. విసవిసా నడచి వెళ్ళి చేయతగు ఏర్పాట్లు చేసి భూపతి ఎదుటికి వచ్చి నిలబడ్డాడు.

తెలిసిఉండే 'ఎంత రాత్ర యిం ది వీరన్నగారూ!' అన్నాడు భూపతి. ఎంతో రాత్రి కాలేదండి పదకొండు దాటిందన్నాడు మంత్రి. మళ్లీ అందుకొని ఆరుమైళ్లే కదండీ ఈపాటికి పాలకీ తిరుగుముఖంలో ఉంటుంది అన్నాడు సర్దుబాటుగా. దీర్ఘంగా నిట్టూర్చి గుడారంవైపు కాలు సాగించాడు భూపతి. వెనుకనే మంత్రి అనుగమిస్తూ చేసన్నల తోటి, కనుసన్నలతోటి గుర్రపురౌతుల్ని అంచేలమీద పట్టణంవైపు ఎదురు దారులు త్రొక్కమన్నాడు.

పాలకీ తీసికొని బోయీలు తిన్నగా రుక్కప్ప గారింటికి వెళ్లి రాజుగారి హుకుంను నివేదించారు. రుక్కప్ప చకితుడై రాణివాసానికి దాడు తీశాడు. నిమిషంలో ప్రయాణసన్నాహాలు గావించి సముచిత పరివారంతో పాలకీని లేవనెత్తి సాగమని తానుకూడా పొలిమేరవరకూ సాగనంప దలచి సిపాయీలతో ఆమాటా ఈమాటా చెబుతూ నడుస్తున్నాడు.

త్రివిక్రమ భూపతికుమారుడికి పదునాలు గోయేడు. రాచపోకడలన్నిటిసీ బట్టిచూస్తే చూపరులకి తండ్రిని తల పింప చేసేలా ఉన్నాడు. తండ్రి వేటకుపోయిననాటిరేయి ముందుముందు తనకు సంక్రమింపబోయే రాజ్యాన్ని ఓసారి నలుమూలలా చూద్దా మని, జనవాక్యాలాలిద్దామని ప్రచ్ఛన్న వేషంతో పట్టణంలో సంచరించ డానికి

బయలు దేరాడు. అప్పటికి కోటలో పన్నెండుగంటలుకొట్టి అరగంట కావస్తోంది. వైశ్యులవీధి చివరనుండి రాజవీధికి మళ్లుతున్నాడు యువరాజు. కొంచెం తగ్గు స్థాయిలో ప్రసారమవే బోయీలమూలుగు చెవులకు తాకింది. ఇంత రాత్రివేళ పట్టణం లోంచి పాలకీపై పోయేవారెవరై ఉంటారని ఓసారి నిర్లిప్తతగా అనుకొని ముందుకుసాగి వెళుతున్నాడు. క్షణంలో పాలకీ తన ముందుకు వచ్చేసింది. ముందుగా సాగనంపడానికి పోయే రుక్కప్ప గారు కనబడ్డారు. తరువాత పాలకీనలువైపులా మెరిసే విచ్చు కత్తులు కనుపించాయి. వెనుక సాయుధబలం, కొంతమంది స్త్రీపరివారం, వెండికాగడాల వెలుగులో చూచే లోపల తన్నుదాటి పాలకీముందుకు సాగిపోయింది. రాజలాంఛనాలతోపోయే ఈ పాలకీనిగూర్చి ఏమీ పాలుబోక ఆశ్వికులలో ఒకణ్ని క్రిందకు త్రోసి రెప్పపాటులో పాలకీకి ఎదురుగా గుర్రాన్ని నిలబెట్టి 'ఆగు' అని ఎదుటి బోయీలను గద్దించి ఉరిమిచూచాడు. మారు వేషంలోఉన్న యువరాజును గుర్తింపలేక రాణివాసం కదలివస్తోంది, దారినుండి 'అపసరిల్లు' అని హుంకరించి పలికాడు రుక్కప్ప సామాన్యునిగా భావించి. 'అందుకనే ఆగమంటున్నాను' అన్నాడు నెత్తిమీది తలపాగాతీస్తూ 'యువరాజు. 'యువరాజు', అని ఓసారి పరివారమంతా నోట్లో గొణుక్కున్నారు. రుక్కప్ప తెల్ల బోయాడు. ఎవరి ఆజ్ఞ మన్నించాలో తెలియక మెట్టు కర్రల మీద నిలబెట్టి ఉంచారు పాలకీని బోయీలు. వెండి కాగడాలవాళ్లు యువరాజుకి ఇరు పార్శ్వములా వచ్చి నిలబడ్డారు. క్షణంలో ఎవరివాహనాల మీంచి వారు దిగిపోయి బరాబరులయి పోయారు యువరాజుకి. యువరాజు వచ్చేరాని మీసాన్ని ఓసారి సవరించి 'రుక్కప్పగారూ! ఇంత రాత్రివేళ ఎవరి అనుమతితో పొలిమేర దాట తలచారు' అన్నాడు. తనకువచ్చిన భూపతి పరమానా నివేదించాడు రుక్కప్ప యువరాజుకి. అడుగు ఎదరికి కదపడానికి వీల్లేదన్నాడు యువరాజు. మీ తండ్రి ఆజ్ఞ మీరడానికి ఎవరితరము అన్నాడు రుక్కప్ప. నాకొక్కడికే ఉంది ఆసాహసం అన్నాడు యువరాజు. 'ఆసాహసానికిది సమయం కా'దన్నాడు రుక్కప్ప. 'రుక్కప్పగారూ!' అనే అక్షరాలు ఉచ్చరించే లోపల ఒర నుండి కత్తిదూసి 'అధికప్రసంగం కట్టిపెట్టండి' అని కత్తిమొన రాజప్రాసాదం వైపు చాచి 'పాలకీ ప్రాసాదానికి తిప్పండి' అని బోయీలను గద్దించాడు యువరాజు. బోయీలు బుజాలు మార్చుకొని తిరగ బోతోంటే 'తొందర పడకండి బోయీలు' అన్నాడు రుక్కప్ప. కోపం ఆగలేదు యువరాజుకి. ఒక్కఅదటులో గుర్రంమీంచి ఉరికి అడుగు ముందుకి పడిందంటే కపాలాలు భూమిమీద దొర్లి పోతాయి, అని ఇంకా పూర్తిగా ఉచ్చరించాడో లేదో దంతపు పాలకీ తలుపులు కిర్రుమని తెరచుకొన్నాయి. విచ్చు కత్తులు కిందకి వాలి పోయాయి. పాలకీ

లోంచి "బాబూ!" అని సంబోధన వినబడింది యువరాజుకి. అడుగు వెనుకను వేసి తీవ్రం తగ్గించుకొని 'మాతా! నమస్కారం, ముందు అంతఃపురానికి దయ చేయండి; అక్కడ మాటాడుకొందాం, కులస్త్రీ రాచబాటలో మాట్లాడడం అనుచితం' అన్నాడు కుమారుడు.

'బాబూ! కుర్రవాడవు; నీపితృపాదులు నాయెడబాటు సహించడం ఇదే ప్రథమ పర్యాయం...'అని యేదో ఇంకా చెప్పబోతోంది రాణి. యువరాజు రుక్కుప్పకేసి తిరిగి రెండుసార్లు మాటల మధ్యలో కత్తి ఝుళిపిస్తూ "నాతల్లి వేశ్యకాదు ఎక్కడికి రమ్మంటే అక్కడికి వెళ్లడానికి, అవసరమయితే ప్రభువుల్ని అంతఃపురానికి దయ చేయమనండి" అని ఒక ఆశ్వికుణ్ని పిలిచి "బాణాలమొరకమీది ప్రభువుగారితో ఈ వార్త విన్నవించు" అని ఆజ్ఞాపించి గిరుక్కునతిరిగి గుర్రంఎక్కి వెనకాలే పాలకీని తనవెంట సాగిరమ్మని హుంకరింపుతో ఉరిమి చూచాడు యువరాజు.



# సంస్కృతనాటకములలో సఖిపాత్ర



శ్రీ జటావల్లభుల పురుషోత్తం

సంస్కృత నాటకములలో సఖిపాత్ర ఉపపాత్రలలోనిదేయైనను ప్రధానపాత్రయగు నాయకురాలి పాత్రపోషణమునకును, ప్రధానరసమగు శృంగార రసముయొక్క పరిణతికిని, కథా సంవిధానమునకును అత్యంతము ఉపకరించునదగుటచే మన దృష్టిని ప్రత్యేకముగ నాకర్షించును. ఈపాత్ర కిట్టి ప్రాముఖ్యము శృంగార రసప్రధానములగు నాటకములలోనే యుండును. ఎచ్చట పట్టినను సఖులు ప్రాకృతభాషనే వాడినారు. కాని వారి వాక్చమత్కృతిని, పరిజ్ఞానమును సభ్యతను పరిశీలింతుమేని వారు సంస్కృతమనస్కులని తెల్లము కాగలదు. కొన్ని ప్రసిద్ధనాటకములలో సఖిపాత్రలెట్లు నిర్వ్యాశిఘములైనవో చూతము.

క్రీస్తుశక మేడవశతాబ్దివాడైన శ్రీహర్ష చక్రవర్తి రచించిన రత్నావళి ప్రియదర్శికా నాటకములలో సఖిపాత్ర లుదాత్తముగా చిత్రింపబడినవి.

సాగరిక యను నామాంతరముగల రత్నావళి స్వజనముకెల్ల దూరస్థయై కేవలము రక్షణనిమిత్తమై వత్సరాజైన ఉదయనుని యాస్థానము చేరి, కాలక్షేపముచేయుచు తుదకు మహారాజునే ప్రేమించును. ఇది హాస్యాస్పదముగ గన్పట్టు విషయము. కాని తన యభీష్టము నెరవేరనిచో ప్రాణముపీడునంత గాఢముగా నామె రాజుపై లగ్నచిత్తయాయెను. ఆశారేఖ యిసుమంతయు లేని యాగాఢాంధకారములో నామెకు దివ్యజ్యోతియై ప్రోత్సాహమొసగి మార్గదర్శకయైనది. యామెసఖియైన సుసంగత; సాగరిక నిర్జన ప్రదేశములో కూర్చుండి వత్సరాజు చిత్రపటము గీచుకొనియైనను చిత్తవిశ్రాంతినొందగోరియున్నపుడు ఆ చిత్రమును రహస్యముగా చూచి యామె సాహసమును నిందించుటకు బదులుగా "ఇట్టి యున్నత లక్షణములుగల కన్య రాజును తప్ప మరెవ్వరిని వరించును? రాజహంసి కమలాకరమును కాక మరి దేని నాశ్రయించును? (కమలాకర ముజ్ఝిత్వా నాన్యస్మిన్ రాజహంసీ అభిరమతే!)" అని యామె యభీష్టమును సమర్థించును.

తాను గీచిన చిత్రమును సుసంగత చూచినదని సిగ్గుపడిపోయిన రత్నావళి "సఖీ, ఇది మదనమహోత్సవమగుటచే నేను భగవానుడైన అనంగుని చిత్రము గీచినాను" అని చెప్పి యామెను మభ్యపెట్ట చూచును. "నీవు మన్మథుని వ్రాసితివి కావున నేను రతీదేవిని గీచెద" నని పల్కి యామె యక్కడ రత్నావళి చిత్రమునే గీయును. రత్నావళి కోపముతో "ఇది యేమి రతీదేవి? "అని ప్రశ్నింప, సుసంగత 'నీ వెట్టి మన్మథుని గీచినావో నే నట్టి రతీదేవినే లిఖించినా" నని చెప్పును. తర్వాత రాజు చిత్రమును చూచి యెంతయో మెచ్చుకొనును.

నాటకములలో సఖులుగ గన్పట్టు యువతులు విశేషవిద్యావైదగ్ధ్యముగలవారు కాకపోయినను, చిత్రకళాదులయం దెట్టి ప్రావీణ్యముగలవారుగా నిరూపింపబడినారో యనుట కిదియొక యుదాహరణము.

తను నెచ్చెలిపట్ల నెట్టి నిర్వ్యాజప్రేమ గలవారుగా సఖులు సంస్కృతనాటకములలో చిత్రింపబడినారో యనుట కెన్నియో నిదర్శనములు గలవు. రాజు విదూషకునితో నాగరికాగతమైన వాంఛను తెలుపుచుండగా సుసంగత యట కేగును. "ఈముఖ్య వాసవదత్తతో నీప్రణయగాథను చెప్పకుండుటకై దీనికి పారితోషికము నిమ్ము" అని విదూషకుడు సూచించును. రాజు స్వర్ణకటకమును దీసి సుసంగతి కీయబోవును. అంత సుసంగత నాగరికపైని అకలుషమైత్రిని గన్పరచుచు నాకటకమును నిరాకరించి "ప్రభూ, నేనీ చిత్రపటములో తనబొమ్మ గీచినానని నాపైని కినిసిన నా సఖియైన సాగరిక కదళీగృహములో

నున్నది. నాపై నీకనుగ్రహముకల్గినదికాన ఆ యను గ్రహమును నాకు హేమకటక మిచ్చుటరూపమున కాక, ఆమెను ప్రసన్నురాలినిగా చేయు రూపమున కన్పరుప గోరుచున్నాను." అనును. అదే యవకాశ ముగా తీసికొని రాజు సాగరికను సమీపించును. అత డామెను బ్రతిమాలినపుడు సుసంగత నైపుణ్య ముతో "రాజా, ఈమె అతికోపన. ముంజేయి పట్టుకొని యామెను బ్రతిమాలవలయును." అని సూచించి వారి సంధానమునకు తోడ్పడును.

వత్సరాజు ప్రథమభార్యయైన వాసవదత్త సాగరిక బయట రాకుండగను, రాజుకంటబడకుండగను చూచుచుండవలసినదిగ పరిజనమును కఠినముగా ఆజ్ఞా పించును. అట్టిపరిస్థితిలో సఖియైన సుసంగత సాగరిక నెల్లైన రాజుతో సమావేశపరుపనెంచి ఆమెకు వాస వదత్తవేషమును వేసి తాను వాసవదత్త పరిచారికయైన కాంచనమాల వేషము వేసి యామెను రాజునొద్దకు తీసుకొనిపోవును. సఖులు తమ నాయకను నాయకుని దరిచేర్చుటకై యిట్టి మాయలను పన్నుట చాల నాటక ములలో కలదు.

సఖులు విశేష విద్యావతులు కాకున్నను సంస్కృతి గంధవిలసితలనియు, వాక్చమత్కృతి లోను, లలితకళలలోను నిపుణలనియు నిదివరకే చూచియున్నాము. విద్యాసత్కారములైన రాజాస్థాన ములలోనుండు వారలకిట్టి సంస్కృతికల్గుటలో నాశ్చర్యము లేదు. ప్రియదర్శికా నాటికలో నొక అంతర్నాటిక కలదు. అందు ఉదయన మహారాజు ఉజ్జయినీ రాజకుమారికయగు వాసవదత్తను తన పాండిత్యముచే హరించుట మనోహరముగా నిరూపిం పబడినది. ఈ అంతర్నాటికలో పాత్రలుధరించిన వారు వాసవదత్త సఖులగు మనోరమ, కాంచనమాల. స్త్రీలు పురుషపాత్ర ధరించుట కూడ అందుకాన నగును. సఖియైన మనోరమ ఉదయనమహారాజు వేషము ధరించును. నాటిక రెండవనాడు కూడ కొనసాగును. అపు డామె తన నేపథ్యమును మహారాజునకే యిచ్చును. మహారాజా దుస్తులనుధరించి యితరులు గుర్తింపనిరీతిగా తన పాత్రను తానే నటిం చును. నాయికయైన ఆరణిక వాసవదత్తవేషమును వేయుటచే రాజునకును, ఆమెకును దర్శన స్పర్శన భాషణాద్యవకాశమును రంగస్థలముమీద నైనను కల్పించుటకీ మనోరమ రాజువేషమును వేయుటలో తోడ్పడినది. తన సఖియైన ఆరణికయొక్క ప్రణయ గాథలో నామె కేదోరీతిగా తోడ్పడుటకై మనోరమ యిట్లు చేసినది. వాసవదత్త ప్రేక్షకురాలుగానుండనే యున్నది. ఆమె యీపన్నుగడను కనిపెట్టుచో తనకు ఇక్కట్లు వాటిల్లునని మనోరమకు తెలియును. అయి నను సఖీహితమునకై సాహసకార్యమున కొడంబడి నది. ఈరీతిగా సఖులు శృంగారనాయికాహితైషి ణులై తెగింపుపనులకు పూనుట చాల నాటకములలో కాంచనగును.

అంతర్నాటికలోని వాసవదత్తకు సఖిగానున్న కాంచనమాలయు చాతుర్యమును, సఖీహితసాధకత్వ మును చూపును. వాసవదత్త తన వీణావైదగ్ధ్యముచే వత్సరాజుహృదయము నాకర్షించును. సంగీతోధ్యాయ ముగుటచే వత్సరాజు ఆసనముపై ఉపవిష్టుడగును. వాసవదత్త కూర్చుండుటకు చోటులేదు. కాంచన మాల ఉదయనునితో "ఆర్య, మాసఖి యిప్పుడే వీణా గానముచే మీమెప్పు పొందినకదా! వీణాచార్యులను మీరు కూర్చున్న ఆసనముపై తాను కూర్చుండుటకా రీతిగా అగ్రతను సంపాదించుకొనలేదా?" అనును. వెంటనే యాతడు వాసవదత్తను తనప్రక్కను కూర్చుండబెట్టుకొనును. కాంచనమాల అంతతో నాగక "ఓరాజా, మాసఖి వీణానాదముచే స్విన్నాం గియైయున్నది. ఈమెనోదార్చుము" అనును. ఇదియు వత్సరాజును మరొకయడుగుముందునకు తీసికొనివెళ్ళి నది. ఆతడు "మంచిమాట చెప్పితివి. అట్లే చేయుదును" అనును.

ఈరీతి చమత్కారములచే సంస్కృతనాటక ములలో సఖులు నాయికానాయకుల ప్రణయమును పోషించుచు శృంగార రసమును ఒకమెట్టునుండి మరొకమెట్టునకు తీసికొని వెళ్లుచు, విభావానుభావ సాత్త్వికభావములుగలుగుటలో నిమిత్త కారణము లైన రసవిషయమునకూడ నాటకమునకు తోడ్పడు చుందురు.

సర్వజ్ఞసింగభూపాలుడు రచించిన కువలయా వళి నాటికలోకూడ సఖీపాత్రలు మనోజ్ఞముగా చిత్రింపబడినవి. సఖులిర్వురు నొకవైపునను,

శ్రీ కృష్ణుడు మరొకనైపునను విలాసోద్యానవనములో సంచరించుచుండగా చంద్రలేఖ కువలయావళితో "మన్మథసామ్రాజ్యసంజీవినివగునిన్ను చూచుటకోయను నట్లు విచ్చేసిన మాధవుని చూడుము" అనును. మాధవ శబ్దమును వసంతర్తు పరముగాను, కృష్ణపరముగాను శ్లేషించి యామెపల్కును. కువలయావళి మనస్సులో కృష్ణుడే మెలగుచుండుటచే నామె కృష్ణపరముగానే గ్రహించి తొట్రుపాటు పడును: ఆ సమయమున నే మణిముద్రిక జారుటయు శ్రీ కృష్ణుడును ఆమెయు పరస్పర ముఖావలోకము చేసికొనుటయు, శ్రీకృష్ణుడు ఆమె మనస్సు తనపై లగ్నమైయుండుటను ఆతొట్రుపాటుమూలముననే గ్రహించుటయు సంభవించును. చంద్రలేఖ ఆవాక్చమత్కృతిని కన్పరుపకపోయినచో నంత చమత్కారముగా శృంగార రసావిర్భావము గల్గుట సాధ్యముకాదు.

రుక్మిణి మున్నగువారు శ్రీకృష్ణ కువలయా వళుల ప్రణయపరిణయముల ననుమతింపనందున రహస్యముగానే తంతునంతను చంద్రలేఖ నడపును. రుక్మిణి ఒకరాత్రి కువలయావళిని గృహములో బంధించి చంద్రలేఖను కాపుంచగా నామె సాహసముతో నెవ్వరికిని తెలియకుండ కువలయావళిని తీసికొనిపోయి శ్రీకృష్ణుని చేర్చును. దారిలో కంచుకి "ఈమె యెవ్వ" రని ప్రశ్నింప "ఈమె ఇందీవరాళి యను పరిచారిక" యనిచెప్పి యాతని కనుమొరగును. ఈరీతిగా సఖులెంత సాహసకౌర్యములైనను చేసి తమ నెచ్చెలి నుద్ధరించుట పరిపాటి.

శాకున్తలములో కాళిదాసు చిత్రించినఅనసూయా ప్రియంవదలు తమ అతిథి సత్కారధర్మముచేతను, సఖీహితైషిత్వముచేతను, మృదుమధుర సంభాషణములచేతను, ఉక్తిచమత్కృతిచేతను, సాంప్రదాయిక విజ్ఞానవైదగ్ధ్యముచేతను మనల నత్యంతము ఆకర్షింతురు.

వారు రూపరేఖావిలాసాదులలో శకుంతలకు తగినవారుగ చూపట్టుదురు. దుష్యంతుడాశ్రమములో ప్రవేశించుటతోడనే బాలపాదపములను స్వప్రమాణానురూపములైన ఘటములతో ఉదకసేచనము చేయుచున్న శకుంతలయు, అనసూయాప్రియంవదలును ఆతనికంటబడుదురు. వారి రూపమాధుర్యముచే నాతడు ముగ్ధుడగును. "రాజాంతఃపురములలో కూడ అరుదైన యీసౌందర్యము ఆశ్రమవాసి జనముకుండుటవలన అరణ్యలతలచే ఉద్యానలతలు తిరస్కరింపబడినట్లున్నది" అని దుష్యంతుడు ప్రశంసించును.

దుష్యంతునింతగా నాకర్షించిన యా సౌందర్యము శకుంతల దొక్కతెదే కాదనియు సఖులది కూడననియు మనము గుర్తింపవలయును.

అనసూయాప్రియంవదలచే ననుగమింపబడుచున్న శకుంతల విశాఖానక్షత్రములచే అనుగమింపబడుచున్న శశాంకలేఖవలెనున్న దని దుష్యంతుడే పల్కును.

అనసూయాప్రియంవదల పోలికలతోబాటు స్వభావములోని భేదములు కూడ పరిశీలింపతగియున్నవి. అనసూయ ఆరితేరిన మర్యాదల నెరిగెన ముత్తైదువవలె వక్రత్వములేక సూటిగామాట్లాడును. ప్రియంవద నెఱజాణయై, చమత్కారిణియై, పరిహాసప్రియురాలై కన్పట్టును. శకుంతల స్తనవల్కలము బిగిసియుండుటచే నామె అనసూయతో "ప్రియంవద యీ స్తన వల్కలము నిర్దయగా బిగించినది. కొంచెము సడలింపుము." అనును. అంతప్రియంవద "సఖీ నాపై దోషము మోపకుము. అనుక్షణము నీకుచములను పెంచుచున్న నీ యౌవనమునే నిందించు కొనుము" అని పరిహసించును.

ఈ రీతిగా ఈసఖుల సంభాషణము ప్రధాన పాత్రలతోను, వారి ప్రణయగాథలు ముందునకు నడచుటతోను జోడింపబడి యుండును.

'దుష్యంతుడు తపస్సు వృద్ధినొందుచున్నదా' యని అడుగ అనసూయ "ఇదానీంపున రతిథివిశేష లాభేన" నీ వంటిమహాను భావుడు అతిథిగా మాకు దయచేయుటచే మాతపస్సు వృద్ధినొందు చున్నట్లే యని ప్రౌఢముగా సమాధానము చెప్పును.

అనసూయా ప్రియంవదలు కేవలము సాంప్రదాయిక విజ్ఞానముగల వారేకాక చదువను వ్రాయను నేర్చిన వారుకూడను. దుష్యంతుని అంగులీయకముపై పేరునువారు వెంటనే చదివివైచినారు.

చతురగభీరాకృతికలిగి ప్రియముగను, మధురముగను ఆలపించువ్యక్తిని వారు సులువుగనే రాజని

తెలిసికొందురు. "మీ దేయూరు? మీ పేరేమి?" అని అనుసూయ యెంతమర్యాదగా నడుగుచున్నదో చూడుడు. "రాజర్షిచేత నే రాజవంశ మలంకరింపబడుచున్నది? ఇపుడు రాజర్షి వియోగబాధననుభవించుచున్న ప్రజలు గలదేశమేద్ది? సుకుమారమైన యీ శరీరము తపోవనపరిశ్రమలకు ఏల పాత్రము చేయబడినది?" అని యామె ప్రశ్నించును. ఇచ్చట భావభాషా మాధుర్యమెంతయు మెచ్చదగి యున్నది.

అనసూయా ప్రియంవదల వేళాకోళపు మాటలకు కోపము నటించి శకుంతల వెడలిపోవుచుండగా అనసూయ "నయుక్తం అకృతసత్కార మతిథివిశేష ముజ్ఝిత్వాశ్రమవాసినో జనస్య స్వచ్ఛచ్ఛందతో గమనం" అని అతిథిపూజామిషతో నామెను నిలిపివైచును. ఇటనేకరీతుల సమయస్ఫూర్తితోను, చమత్కారముతోను వారు శకుంతలా దుష్యంతుల సంపర్కమును దృఢపరచి వారి పరస్పరానురాగాభివృద్ధికి తోడ్పడుదురు.

తరువాత శకుంతల మన్మథతాపము ననుభవించుచుండగా వీరు స్వయముగా మన్మథతాపము నెరుగనివారైనను, గ్రంథజన్యజ్ఞానముచే దానిని గుర్తింతురు. ఇతిహాసగ్రంథములలో కాముకులకుండు తాపమును నీ యం దిపుడు చూచుచున్నాను. "యాదృశీ ఇతిహాసనిబంధనేషు కామయమానానాం సమవస్థా శ్రూయతే, తాదృశీం తే పశ్యామి" అని అనసూయ పల్కును. దీనినిబట్టికూడా వారికి బహుముఖమైన విద్యాగంధ మున్నట్లు తెల్లమగుచున్నది.

నిరాశాంధకారమునుండి శకుంతల నుద్ధరించుటకు ప్రియంవద యొక సూచన చేయును. "సఖీ అనసూయ! శకుంతల మహారాజునకు మదనలేఖను వ్రాసిన బాగుండును. దానిని పూలలో గుప్తపరచి దేవతాప్రసాదవ్యాజమున అతనిచేతిలో మన ముంచవచ్చును" అని యామె సూచించును. దీనివలననే శకుంతల లేఖను వ్రాయుటయు వారికి చదివి వినిపించుటయు, దుష్యంతుడు చాటుననుండి విని బయటకు వచ్చుటయు గాంధర్వవిధిని శకుంతలను పరిగ్రహించుటయు సంభవించును.

మరొక ముఖ్యమైన విషయమున సఖులు శకుంతల కెట్లు తోడ్పడినారో చూతము. దుష్యంతునకు బహుభార్య లుండవచ్చుననియు, అందువలన శకుంతల నుపేక్షింప వచ్చుననియు అనసూయభీతి. కావున ఆమె రాజున కాభీతిని స్పష్టముగా వెల్లడించును. వెంటనే దుష్యంతుడు "నా కెందరు భార్యలున్నను, మీ సఖియు, సముద్రరశనయైన ఈ యుర్వియు ఈ రెండే నా కులప్రతిష్ఠావహములు" అని వాగ్దానము చేయును. సఖులు సమయస్ఫూర్తితో, తగిన సమయమున మెలకువతో తమ చెలికి మేలుకూర్చు తలంపున రాబట్టిన యీ వాగ్దానమునకు ఫలితముగానే చరిత్ర ప్రసిద్ధుడైన భరతుడు తరువాత సింహాసనమునధిష్ఠించుట సంభవించినదని కాళిదాసు సూచించుటచే నీ సఖిపాత్రల కాతడెంత ఉన్నతస్థాన మిచ్చినాడో తెలియగలదు.

దుర్వాసుడు కణ్వాశ్రమమునకు వచ్చుసరికి శకుంతల యాతనిరాకనే గుర్తింపలేనంతగా భర్తృలగ్నచిత్తయైయుండును. "నీ వెవ్వరిని స్మరించుచు నాకాతిథ్యమిచ్చుటకు మరిచినావో ఆతడు నిన్ను విస్మరించుగాక" యని దుర్వాసుడు శపించును. ఈ ఘోరవిపత్తునుండి ప్రియంవదయే శకుంతలను రక్షించినది. ఆమె దుర్వాసుని కాళ్లపైబడి శాపతీవ్రతను తగ్గించినది. అనవాలు చూపుచో దుష్యంతుడు శకుంతలను గుర్తించు పరిస్థితి యీ రీతిగానే కల్గినది.

ఇట్లు సంస్కృతనాటకములలో సఖీపాత్రలు నిర్వ్యాజప్రేమకును, స్వార్థత్యాగమునకును, సాహసకృత్యములకును, చమత్కారమునకును, సమయస్ఫూర్తికిని, మర్యాదకును, లలితకళాకుశలతకును, మార్దవమునకును, మాధుర్యమునకును, కార్యదక్షతకును, ఆలవాలములై కథాగమనికకును ప్రధానపాత్ర పోషణమునకును, రససిద్ధికిని తోడ్పడుచు మనల నత్యంతము ఆకర్షించుచున్నారు.

---

కథానిక:

# నరసమ్మ కాపురం

శ్రీ పెనుమర్తి కామేశ్వర రావు

'నేనిక్కడే ఉంటాను!' అన్నది నరసమ్మ తండ్రితో—నిశ్చయంతో. 'బాగా ఆలోచించుకో. స్త్రీ భర్తతో నుండాలి కాని పుట్టింట్లో నుండరాదు. అందువలన నీకూ, మాకూ అవమానం! యుక్తవయస్కురాలివి—ప్రపంచజ్ఞానం కలదానివి, చదువుకున్నదానివి—నీకొకరు బోధించ నవసరం లేదు.' అన్నాడు తండ్రి పట్టాభిరామయ్య. ఆయన తాసిల్దారుద్యోగం చేస్తున్నాడు.

"అందువలననే—బాగా ఆలోచించుకుని నేనీ నిర్ణయానికి వచ్చాను. నాపెళ్ళికిముందు మీరు నాతో సంప్రదించి ఉంటే, నే నాయనను పెళ్ళాడిఉండే దాన్నే కాను. నల్లగా మసిబొగ్గులాంటి వాడికిచ్చి పెళ్లిచేసి మీరే నాజీవిత సౌఖ్యాన్ని నాభవిష్యత్తునూ నాశనం చేశారు! అన్నది నరసమ్మ.

'అతనికేం? పెళ్లినాటికి అతను స్కూల్ ఫైనల్ చదువుతున్నాడు. సంపన్న కుటుంబం. పాతిక ఎకరాల మాగాని పొలముంది. ఒక్కడే కొడుకు తండ్రికి. కట్నముకూడా వెయ్యిన్నూట పదారులే యిచ్చాను. అతనిలో లోపమేమీ లేదు. నీ తెలివితక్కువతనం కాని—అమ్మాయి! అతను నల్లగా నున్నాడంటున్నావు. నేను నల్లగా లేనూ? మా వంశంలో నీవలె మాట్లాడినవాళ్లు లేరు. నీవు నీభర్తతో కాపురం చేయక ప్రపంచాన్ని ఉద్ధరించగలవని నేను భావించటంలేదు. ఈకాలంలో చదువుకున్న ఆడపిల్లల్ని ఎందర్నో చూచాను కాని ఇలా మొండిగా మాట్లాడే స్త్రీలు చాలా తక్కువ!' అన్నాడు తాసిల్దారు.

'నాకాభర్త అక్కరలేదు. నేనిక్కడనే ఉండి హిందీ చదువుకుంటాను. మీకిష్టములేకపోతే నాదోవ నేను చూచుకుంటాను!' అన్నది నరసమ్మ.

తండ్రీ కూతుళ్ల మధ్య నీవిధంగా సంభాషణ జరుగుతుండగా తల్లి రాజేశ్వరమ్మ అక్కడికి వచ్చింది. తాసిల్దారు భార్యతో—

'నీవంటి పచ్చని మనిషి నాతో కాపురం చేయడం భావ్యం కాదు. అమ్మాయిమాటలు విని నువు కూడా నన్ను వదిలిపెట్టి హిందీ చదువుకోవచ్చు మీ పుట్టింట్లో ఉండి!' అన్నాడు వ్యంగ్యంగా.

'మీ మాటలు చాలుగాని, అది చిన్నపిల్ల. అల్లుడు పెళ్ళినాటి అల్లుడు కాడు. పరమ దుర్మార్గుడైనాడు. అతనికీ తండ్రికీ సంబంధము లేదు. అతను మనతోనైనా అనుకూలంగా నుంటంలేదు. పెళ్లినాడతను ముందుముందు పెద్దచదువు చదువుతాడనుకున్నాం. స్కూల్ ఫైనల్ తప్పాడు వరసని మూడు వత్సరాలు. చదువు మానేశాడు. గాలికి తిరుగుతున్నాడు. వాడికంటే ముష్టిముండాకొడుకు నయం. ఇంటికివచ్చినప్పుడల్లా పెళ్ళాన్ని రెండుబాది తగువులాడతాడు. నే వింటూండగా—'నువు తాసిల్దారు కూతురివైతే నాకేం? నా పెళ్లానివైన తరువాత నువు నా చెప్పు చేతల్లో పడుండాలి. అంతేగాని, నిక్కితే ఒక్కక్షణంకూడా సహించేది లేదు. కబడ్దార్' అన్నాడు. అల్లుడికి మీమీద గౌరవమేమీ లేదు.' అన్నది రాజేశ్వరమ్మ.

'అల్లుడికి నామీద గౌరవం లేనందున నాకేమీ విచారంలేదు. అమ్మాయితో అనుకూలంగానుంటే—నాకిప్పుడున్న గౌరవంపోదు. అమ్మాయికి నామీద గౌరవముంది కనుక నా- అల్లుడికి లేదని నేను విచారపడడానికి! భర్తతో కాపురం చేయదుట! మన కుటుంబగౌరవం నాశనం చేయడానికే యిదిపుట్టింది. దీనికి నీమద్దత్తు. అమ్మాయి నేవిధంగానైనా అల్లుడి

దగ్గరకు పంపడం మనధర్మం!' అన్నాడు తాసిల్దారు.

'అమ్మాయిని పంపడానికి—అల్లుడికో యిల్లూ వాకిలీ లేదు. తండ్రినుంచి విడిపోయాడు. అతనికి సినిమాపిచ్చి పట్టుకుంది. 'మింగమెతుకులేదు, మీసాలకు సంపెంగనూనె' అన్నట్లుగా స్వతంత్రంగా జీవించడానికి ధనాదాయం చాలటంలేదు—సినిమా డైరెక్టరవుతాడుట! అతని ఆలోచనలు చాలా పెద్దవి. ఏ ఆలోచనలున్నా ఫరవాలేదు. తనవంటి అనాకారి వాడికి, బంగారు బొమ్మలాంటి భార్య లభ్యమైంది కదా— దానిమీద అనురాగం కలిగిఉండాలంటారా లేదా?' అన్నది రాజేశ్వరమ్మ.

'కొత్తలో భార్యాభర్తలు తగువులాడుకుంటూరు. తరవాత వాళ్ళే అనుకూలంగా వుంటారు. వాళ్ల జీవితాలు సరిదిద్దే బాధ్యత తల్లిదండ్రులపై నుంటుంది. పురుషుడు స్వతంత్రుడు. స్త్రీ అబల. అటువంటప్పుడు— అన్నీ తెలిసిన మనం- అమ్మాయి కాపురం కుదురుచేయడానికి ప్రయత్నించాలి కాని, దాని తెలివితక్కువ ఆలోచనల్ని బలపరచకూడదు. నేనా తాసిల్దార్ని. గౌరవప్రతిష్ఠలతో బ్రదుకుతున్నవాణ్ని. నాకే విషయమొక సమస్యగా పరిణమిస్తే— అది నేభరించలేను. నీవు తల్లివి. కూతురికి చెప్పవలసినవి చెప్పి— ప్రయాణానికి సిద్ధంచేయించు. అల్లుడు ఏభయిరూపాయిలు సంపాయించుకుంటున్నాడనీ, చాలా కుదురుగా వుంటున్నాడనీ నాకు వర్తమానం వచ్చింది. అమ్మాయిని నేను వెంట తీసికెళ్లి, అతని వద్ద దించి వస్తాను.' అన్నాడు తాసిల్దారు. ఆవెంటనే, ఆఫీసు టైమవుతుండడంవల్ల, పట్టాభిరామయ్య త్వరత్వరగా భోజనంచేసి, ఆఫీసుకు వెళ్ళిపోయాడు. ఆయన యింటినుంచి వెళ్లిందిమొదలు, నరసమ్మ కోపవదనయై దుఃఖభారంతో—తన గదిలో, పందిరి మంచంలో బోర్లబరుండి నిట్టూర్పులు విడువసాగింది. ఆమెకు జీవితంమీద విరక్తి కలిగింది. రాత్రి పన్నెండు గంటలవేళ బావిలో దూకిచస్తే తనకే సమస్య వదిలిపోతుందనుకున్నది. ఎందరో స్త్రీలా గ్రామంలో కాలువలో పడి చస్తున్నారు. వాళ్లు జీవితంలో కష్టాలు భరించలేక, ఆ ప్రవాహవేగంలో లీనమైపోతున్నారు. ఏభయి రూపాయిలు సంపాదించే నల్లని భర్తతో యీ కాలంలో ఎలా కాపురంచేయడం? ఏభయిరూపాయిలు అతని సాదరుఖర్చులకే సరిపోవు. పట్టణాలలో ఇంటిఅద్దెలు, సరలు పెరిగినయి. బియ్యాం రూపాయికి మూడుసోల లిస్తున్నారు. ప్రతిదినం, తనకు రెండుపూటలు కాఫీ ఉండాలి. పూలుకావాలి, సబ్బులుకావాలి. ఇంకా ఎన్నో కావాలి! ఏభయిరూపాయిల ఉద్యోగంలో వున్నవాడు తన భార్యని పోషించడ మెంతకష్టమో తండ్రికేం తెలుసు? తనకు నెలకు రెండువందలు రూపాయిలు వస్తున్నా సరిపోవడం లేదని, తానెన్ని సారులో విసుక్కున్నాడు. నరసమ్మకు దుఃఖభారంలో ఎన్నో ఆలోచనల పరంపరలు తామరతంపరగా తోచినయి. ఇంతలో తల్లివచ్చి అన్నానికి రమ్మని పిలిచింది.

'నాకాకలిగాలేదు: నాకు అన్నం అక్కరలేదు!' అన్నది నరసమ్మ.

'ఇలా అలిగితే తల్లినైన నాకెంత విచారంగా నుంటుందో నీకు తెలుసా? నీవన్నం తినకపోతే నేను తినను!' అన్నది తల్లి.

'ఏభయి రూపాయిలు యీకాలంలో ఆయన సాదరు ఖర్చులకు సరిపోదు. ఆయన కాఫీలు, సిగరెట్లు, ఇస్త్రీబట్టలు—వాటి సంగతి నాకు తెలుసు! ప్రతినెల నాన్నగారో ఏభయిరూపాయిలు నాకు పంపిస్తే, నాస్వంతానికి వాడుకుంటాను. ఆఏర్పాటు జరిగితే మీగౌరవంకాపాడే టందుకు— నేనాయనతో వుంటాను. నాకాయనమీద ఇష్టంలేకపోయినా!' అన్నది నరసమ్మ ఆత్మహత్యోద్దేశ్యం విరమించుకొని.

'ఈవిషయం గూర్చి నాన్నగారితో మాట్లాడుదాం— అన్నం తిందాం, రా' అన్నదితల్లి.

నరసమ్మకు పద్దెనిమిదోయేడు. తండ్రిచామన ఛాయవాడు కాని తల్లివలె నామె చక్కనిశరీర చ్ఛాయకలది. విశాలనేత్ర. నొక్కులు నొక్కులుగా నుండే శిరోజములు. బాల్యమునుంచీ అల్లారుముద్దుగా పెరిగింది. ఫర్ డుఫారందాకా ఇంగ్లీషు చదువుకుంది. చక్కని ముక్కలలో ఆమెకు మొదటితరగతి లక్షింపదు కాని, సంపాదనా పరుడైన భర్త ఆమె అభిరుచుల కనిపెట్టి, ఆమె నధునాతన పద్ధతులలో తయారుచేయుటకు కృషిచేసి, ఆమెను విప్లవభావములు గల మహిళా సమాజములో చేర్పించినచో, నరసమ్మ

రెండవతరగతి అందగత్తెకాగల అవకాశములు లేక పోలేదు. కాని ఆమె భర్త సూరి సంపాదనాపరుడని చెప్పడానికి వీలుకాని పరిస్థితులలో నుండుటవలన ఆమె మూడవతరగతి అందకత్తెగా భావించడానికేమీ అభ్యంతరముండదు.

౨

ఆ సాయంత్రం ఆఫీసునుంచి రాగానే పట్టాభి రామయ్య డ్రస్సువిడిచి భార్యనిపిలిచి— 'ఏమైనా తేలిందా?' అన్నాడు.

'ఆఁ. తేలింది, అమ్మాయికి నెలకో ఏభయి రూపాలు మీరు పంపుతుంటే, మీ గౌరవం నిలిచే టందుకు భర్తతో కాపురం చేస్తుందిట! అల్లుడు సంపాదించే ఏభయిరూపాయిలతో, నిజంగా యీకాలంలో సంసారం గడవటం చాలాకష్టం! మీరిందు కంగీకరిస్తే ఏదోమంచిరోజు విచారించి, మీరే అమ్మాయిని స్వయంగాతీసికెళ్లి, అతనివద్ద దించి, అతనికి చెప్ప వలసినవన్నీ చెప్పి— అతనున్న ఇంటివారితో కూడా అమ్మాయిని కొంతకనిపెట్టి ఉండమని చెప్పిరండి! అసలు— అల్లుడిప్పుడు ఆవూళ్లో చేస్తున్న ఉద్యోగమేమిటి?' అన్నది రాజేశ్వరమ్మ.

'ఆ ఉద్యోగంసంగతి నాకూ సవిస్తారంగా తెలియదు. ఆ ఊరి ప్లీడరొకడు నా స్నేహితుడు, అతను మన అల్లుణ్ని బాగా ఎరిగున్నాడట! అతను చెప్పాడు సూరి చాలా కుదురుగల కుర్రాడని! తమ యింట్లోనే ఉంటున్నాడుట! ఆ ప్లీడరు కో మేడ ఉంది! బాగా సంపాదనవుంది— ఆస్తిపరుడు కూడా! అమ్మాయికి ప్రతినెలా ఏభయిరూపాయలు నేను పంపవలసిన అవసరమేఉండదు. ఏదైనా అత్యవసరపరిస్థితి ఏర్పడితే— అమ్మాయి నాపేర ఉత్తరం రాస్తే— నేను డబ్బుపంపడమో, లేక స్వయంగా వెళ్లి చూచిరావడమో చేయగలను. దానికి కాపురానికి కావలసిన పాత్రసామాను, ఒకమంచం, పరుపు, ట్రంకుపెట్టె, రెండుకుర్చీలు, ఒక టేబిలు, మొదలైనవి కొని ఇచ్చి, దానికో ఏభయిరూపాల చీరకొని— మరొక ఏభయిరూపాయిలు దగ్గరుంచుకోమని యివ్వ నిశ్చయించాను. మొత్తం అంతా రెండువందలరూపాయలు పైనే ఖర్చు. అయినా ఫరవాలేదు: అది భర్తతో అనుకూలంగా కాపురంచేసి సంతానవతియై, ఉభయకుటుంబాలకూ కీర్తి ప్రతిష్ఠలు తీసుకువస్తుందని నానమ్మకం! ఇదీ విషయం!' అన్నాడు తాసిల్దారు.

ఈమాటలన్నీ నరసమ్మ వినిచాలా సంతోషించింది.

'పోనీ—ఆప్లీడరు పేర ఓ వుత్తరం రాయండి! అల్లు డేం వుద్యోగం చేస్తున్నదీ తెలియబరచమని. లేదా, ఆయన్ని ఒకసారి ఈవూరువచ్చి మాట్లాడి పొమ్మని రాయండి!' అన్నది రాజేశ్వరమ్మ— ఆప్లీడ రెటువంటి వాడోనని సందేహంతో.

ఈసలహా విని నరసమ్మ 'ప్లీడరుగారి కుత్తరం రాసి పిలిపించడం మర్యాదకాదులే—అమ్మా! నేను అన్నీ విన్నాను. ఇక మంచిరోజు విచారించండి. నేను నాభర్తదగ్గర నుంటానికి నాకేమీ అభ్యంతరంలేదు.' అన్నది. ఆమాటలు వినగానే పట్టాభిరామయ్య నేత్రాంచలాల నానంద బాష్పములురాల— నాతల్లి ఎంతబుద్ధిమంతురాలు! నాగర్భవాసాన జన్మించిన కుమార్తె నామాట వినటం లేదేమో అని నేనెంతగా మనస్సులో బాధపడుతున్నానో నీకు తెలియదు.' అన్నాడు.

'నాన్నగారూ! నేను గ్రాయికం తెలిసిన దానిని. తాడూ బొంగరం లేనివ్యక్తితో సంసారం చేయడమెట్లాగా అనే సంకోచంతో నేనింతకాలం నుంచీ మీమాట కెదురుచెప్ప సాహసించాను. నన్ను క్షమించండి నాన్నగారూ! మీ గౌరవహాని కలిగే విధంగా ప్రవర్తించాలని నేనెన్నడూ ఊహించలేదు! ఆయనొక ప్లీడరుగారి అండనుంటున్నాడని, ఏభయి రూపాయిలు సంపాదిస్తున్నాడని విన్న తరవాత, నా సందేహం తీరింది. మీరు నాకోసమిప్పుడు రెండు వందల రూపాయలు ఖర్చుపెడతాననడం విన్న తరువాత, నాకానందం కలిగింది. నాకవసర మున్నప్పుడల్లా, నాకో పాతికరూపాయలు పంపితే చాలు నాన్నగారూ! మిమ్మల్ని డబ్బు డబ్బని బాధపెట్టను లెండి నాన్నగారూ!' అన్నది నరసమ్మ.

పట్టాభిరామయ్య కూతురు ప్రయాణానికి మంచి రోజు విచారించి, కావలసిన సామాను కొనవలసిందని భార్య చేతికి రెండువందల రూపాయలిచ్చాడు.

తల్లీ, కూతురు గుర్రంబండీలో బజారుకు వెళ్లి సామానంతా కొని తీసుకవచ్చారు. కాఫీకి ఒక ఫిల్టరు, ఇడ్డెన్లు వండుకునే పాత్ర—ఒకటేమిటి? నరసమ్మ కోరిన సామానంతా కొన్నది తల్లి.

పట్టాభిరామయ్య అల్లుడుపేర నొక కవరు, అతనుంటుంటే ఇంటియజమాని ప్లీడరుపేర నొక కవరు ఉత్తరాలు రాసి పోష్టులో వేశాడు. ఫలానా రోజున ఉదయంపాసెంజరులో తాను తనకుమార్తెను తీసుక వస్తున్నానని అందులో తెలియబరిచాడు.

## 3

భర్తతో కాపురం చేయడానికి వెళ్తున్న నరసమ్మను చూడడానికి గ్రామంలోనున్న దగ్గర బంధువుల తాలూకు నలుగురు ముత్తయిదువులు ఉదయం వచ్చి, ఆమెకు చెప్పవలసిన మంచి విషయాలు చెప్పారు. నరసమ్మ ఒక సిల్కుచీర ధరించింది. నల్లని సిల్కుచీరెతో సరాగం నెరపే ఎర్రని జంపరు తొడిగింది. మెడలో మంగళసూత్రాలున్న నాను తాడు, పగడాల దండమాత్రం— చేతులకు ఒక జత ఐస్ క్రీమ్ బంగారుగాజులు— ఎడమచేతికి చాలా రంగులలో దంతపుగాజులు— కుడిచేతి చిటికెన వ్రేలున ఒంటిరాయి ఉంగరం—పాదాలకు వెండి నాజూకు గొలుసులు—ముక్కున చక్కని జేసరి— మొదలైన ఆరభణాలున్నాయి. కాళ్లపిక్కలు కనిపించే లాగున చీరె అధునాతనంగా ధరించి-విలువైన చమీఖు పనితనము ప్రదర్శించే పాదరక్షలుధరించి ప్రయాణానికిసిద్ధమైంది. తండ్రీకూతుళ్లతో రాజేశ్వరమ్మకూడా చిన్నపిల్లలిద్దర్ని వెంటతీసుకొని ష్టేషనుకువెళ్లింది— కూతురికి చెప్పవలసినవిచెప్పి, ధైర్యంవహించి భర్తతో అనుకూలంగా కాపురంచేయమన్నది.

పట్టాభిరామయ్య, కూతురుపొగబండిమీద అల్లుడుంటున్న గ్రామపు ష్టేషన్ చేరుకొన్నారు. ష్టేషన్కు అల్లుడు వచ్చాడేమోనని, ఆయన అక్కడ కనిపించే మనుషులలో అల్లుడ్ని గుర్తించడానికి ప్రయత్నించి విఫలుడైనాడు.

ఇద్దరూ ఒక గుర్రంబండీలో, సామానుతో మరొకబండి వెంటరాగా, ప్లీడరు ఆనందరావు మేడ ముందు పదిగంటలవేళ దిగారు. పట్టాభిరామయ్య, నరసమ్మ మేడలోకి వెళ్లగానే ఆనందరావు తఆఫీసు గదిలోనుంచి బైటికివచ్చి తాసిల్దారుని పరామర్శించి- లోనికివెళ్లి భార్యతో వాళ్లకు కాళ్లుకడుక్కోడానికి నీళ్లుతెమ్మని పురమాయించాడు. ఆనందరావు భార్య సుందరమ్మ రెండుచెంబులతో నీళ్లు తెచ్చియిచ్చి, నరసమ్మ నాపాదమస్తకం పరిశీలిస్తూ నిలబడింది. తాసిల్దారు—

'ఏవోయ్! ఆనందారావూ! మా అల్లుడున్నాడా ఇంట్లో...?' అన్నాడు.

ఆనందరావు భార్యతో 'ఏమే శర్మ ఎక్కడికి వెళ్లాడు?' అని అడిగాడు. సూరి అసలుపేరు సూర్యనారాయణశర్మ కావడం— అతన్ని కొందరు 'శర్మ' అనీ, కొందరు 'సూరి' అనీ, మరికొందరు 'నారాయణ' అని పిలవడంకద్దు.

సుందరమ్మ 'మార్కెట్టుకు కూరలకోసం నేనే పంపించాను. ఈ పాటికి వచ్చే వేళయింది, ఏమమ్మాయి! కాఫీతాగుదువుకాని, లోపలికిరా!' అని నరసమ్మను లోనికి పిల్చుకవెళ్లి, ఫ్లాస్కులోనిలవవున్న కాఫీ కొంత ఒక వెండికప్పులోపోసి యిచ్చింది. నరసమ్మ సుందరమ్మను పరిశీలనగాచూచి, ఆమేడలో గోడలకున్న చిత్రపటాలు- ఇంటిలోనున్న కుర్చీలు, సోఫాలుచూస్తూ ఆలోచనలో మునిగింది. సుందరమ్మ కొంతకాఫీ ఒక వెండిగ్లాసులో పోసి 'మీ నాన్నగారికివ్వు. పనిచెప్పానని ఏమీ అనుకోకు నీవు మాయింట్లో పిల్లలాగుండాలి, నాకు సంతానం లేదు.' అన్నది నిట్టూర్పుతో. నరసమ్మకాఫీతీసికెళ్లి తండ్రికిచ్చి వచ్చి సుందరమ్మకు ఎదురుగా కూర్చుంది. సుందరమ్మ వంటఇంట్లో వంటకత్తెతో 'ఓసుబ్బమ్మగారూ! ఓ సోలెడు బియ్యం వేరే కడిగిపెట్టండి!' అన్నది.

ఇంట్లోభార్యా, భర్త— యిరువురే అయినా వంటమనిషికూడా ఉండటంవలన నరసమ్మకు వాళ్లు సంపన్నులని అర్థమైంది. తనభర్తభోజనంకూడా ప్లీడరుగారింట్లోనే కాబోలు ననుకున్నది. తన సామాను మంచం,పరుపు. పాత్రసామాను ప్లీడరుగారిసలహామీద మేడలో ఒకగదిలో తెచ్చిబండివాడు పడేశాడు. నరసమ్మ తండ్రివద్దకువచ్చి—

'నాన్నగారూ! వారింకా రాలేదేం?' అన్నది.

'కూరలకోసం మార్కెట్టుకు వెళ్ళాడుట. వస్తాడు—దేనికి ?' అన్నాడు పట్టాభిరామయ్య.

'నాకంతా అయోమయంగా వుంది! మేం వేరే కాపురంగా వుండనప్పుడు, మాకీ సామాను అనవసరం నాన్నగారూ! అవిప్పుడు చాలామంచిది. పిల్లలు లేరుట. ఆయనా—నేను ఇక్కడే వుంటే, నేను వంటచేయ నక్కరలేదు. వీళ్లకు వంటమనిషికూడా ఉంది! బట్టలుతికే చాకలీ...పనిమనిషీ వున్నారుట కూడా!' అన్నది నరసమ్మ తండ్రితో.

ఇంతలో సూరి కూరలు ఒక కూలివాడిచేత మోయిస్తూ ఇంటికి తెచ్చాడు. మధ్య హాలులో కుర్చీలలో మామగార్నీ, తనని చూచి లేచి నిలబడిన భార్యనీ ఒకసారి తిలకించి, సరాసరి వంటహాలులోకి కూరల తట్ట తీసికెళ్ళి నమస్కరించి 'సుందరమ్మగారూ! ఇవన్నీ మూడురూపాయల ఏడణాలన్నరయినయి. ఇదిగో మిగతా డబ్బులు!' అని ఆమెచేతిలో రూపాయి ఎనిమిదణాలన్నర పెట్టి, ముఖాన చెమట తుడుచుకుంటూ—మధ్య హాలులోనుంచి బైటికివచ్చి తట్ట కూలివాడి కిచ్చాడు. మామగార్ని పలకరించలేదు. ఒక సిల్కుచొక్కా ధరించివున్న అల్లుణ్ణి తానే పలకరించి మాట్లాడుదామని తొసిల్దారు బైటికి వచ్చాడు. సూరి తొడుక్కున్న సిల్కుచొక్కా అతనిదికాదని తెలుసుకున్నాడు—అది అతనికి చాలా పెద్దదిగా నుంటంవల్ల!

'ఏం వోయ్! అమ్మాయిని తీసుకవచ్చాను. నేరాసిన కవరందిందా?' అన్నాడు మామగారు.

'తీసుకరావద్దని నేను నిన్ననే మీపేర వుత్తరం రాశాను. అది యివాళ యీపాటికి మీయింటికిచేరి ఉంటుంది!' అన్నాడు సూరి.

'ఏం, ఎందువల్ల? నీకు ఏభయిరూపాయిల జీతమని ఆనందరావు చెప్పాడు. నీవు సినిమాసంగతులు మరిచిపోయి, కుదురుగా నంటున్నావని తెలిసి—ముందుగా నీపేర వుత్తరంకూడా రాశాను. కాపురానికి కావలసిన సాత్ర సామానుకూడా కొనియిచ్చాను' అన్నాడు పట్టాభిరామయ్య.

'ఇక్కడ నాపరిస్థితులు మీకు తెలియవు. నాకీ ఉద్యోగం దుర్భరంగా నుంది.' అన్నాడు సూరి.

ఆనందరావు కోర్టుకు వెళ్ళే టైమయిందని భోజనానికి లేచి, పట్టాభిరామయ్యను కూడా భోజనానికి ఆహ్వానించాడు. కాని అంతవరకు పట్టాభిరామయ్య స్నానం చేయలేదు.

'నేనింకా స్నానం చేయలేదోయ్! మేము తరవాత భోంచేస్తాములే. నీవు కోర్టుకు వెళ్లవలసినవాడివి. నీవు భోజనం చెయ్యి— ఫరవాలేదు!' అన్నాడు తొసిల్దారు.

'ఏవోయ్ సూరీ! నువు రా—మనం కోర్టుకు పోవాలి,!' అని ఆనందరావు సూరిని పిలిచాడు. ఆనందరావుకు ఒంటరిగా భోజనం చేయడమలవాటు లేదు.

ఆనందరావుతో పట్టాభిరామయ్య ఏవో సంగతులు మాట్లాడాలనుకున్నాడు. కాని వ్యవధిలేదు. తాను తన కుమార్తె విషయంలో చెప్పదలచిన సంగతులన్నీ సుందరమ్మతో చెప్పితే సరిపోతుందనుకున్నాడు! ఆనందరావు, శర్మ భోజనాలు చేసి కోర్టుకు వెళ్లారు.

పట్టాభిరామయ్య పన్నెండు గంటలకు స్నానానంతరం భోజనం చేసి ఇంటియజమానురాలు సుందరమ్మతో 'మా అమ్మాయిని మీరు మీ అమ్మాయిగా చూచుకోవాలి. మా అల్లుడు కొంత తొందరమనిషి. వాళ్లిద్దరిమధ్య సంభవించే పొరపులు సర్దుబాటు చేస్తూ మీరు కనిపెట్టి వుంటే— ఓకాపురం నిలబెట్టినవారవుతారు. నేనీ పూట మూడుగంటల బండికి వెళ్తున్నాను. నాకు తొందరపనులున్నాయి!' అన్నాడు. ఆమె సరేనన్నది.

పట్టాభి రామయ్య ప్రయాణమైవెళ్తూ కూతురికి ధైర్యంచెప్పి, ఇరవైఅయిదు రూపాయిలిచ్చి వెళ్లిపోయాడు. నరసమ్మ ఆడబ్బుతీసికొని తన ఆనందబాష్పాలను పైటకొంగుతో తుడుచుకొని—లోనికి వెళ్లింది. సుందరమ్మ రేడియో వింటూ కూచున్నది.

## ౮

నలభైఅయిదు వత్సరాలు దాటిన సుందరమ్మ కపత్యవాంఛ సన్నగిల్లింది. ఆమె స్థూలశరీరంవలన, భాగ్యవంతురాలు కావడంవలన, ఇంట్లో పని ముట్టుకోదు. వంటకత్తె ఒంటిగంటకు వెళ్లిసాయంత్ర

మూరు గంటలకు వస్తుంది. ఈ లోపున కాఫీ కాయడం - పనిమనిషికి అంట్లు, చెంబులు పడెయ్యడం ప్రతిదినం సుందరమ్మకు చాలా కష్టంగానుంది. నరసమ్మ రాగానే ఆమెకు మనశ్శాంతి కలిగింది. కాని, నరసమ్మకూడా చాకిరీ కలవాటుపడిన స్త్రీ కాదు. సుందరమ్మ ఆదేశంప్రకారం, నరసమ్మ నాలుగుగంటలకు కాఫీ కాచింది: పనిమనిషికి అంట్లు, చెంబులు వేసింది. స్నానాలగదిలో బాయిలర్ నిప్పువేసి నీళ్లకాగు దానిమీద పెట్టింది. ఆరుగంటలయినా, ఆపూట వంటావిడ రాలేదు. సుందరమ్మ మల్లెపూలుకొని, తాను పెట్టుకొని నరసమ్మనుకూడా పెట్టుకోమన్నది.

'అమ్మాయ్! ఇంతవరకూ వంటావిడ రాలేదు. ఇక ఈ పూట రాదల్లే వుంది. ఆమె ఇలాగే మధ్యమధ్య చెప్పకుండా మానేస్తుంటుంది. ఈ రోజుల్లో ఘన వంతుల్ని చూస్తే ఎవరికీ లెక్కలేకుండాఉంది. కొంచెం నువు మడికట్టుకుని ఈ పూట వంటచేయి. నేను దగ్గర వుండి అన్నీ నీకు చెబుతానులే' అన్నది సుందరమ్మ నరసమ్మతో.

నరసమ్మ తనకు వంటచేయడమలవాటు లేదనీ, చేతకాదనీ చెప్పడానికి సంకోచించి, సరేనన్నది. వంకాయకూర, చారు, కందిపచ్చడి చేసి వడియాలు వేయించమని పురమాయించి, సుందరమ్మ పేత్తనానికి వచ్చిన ఇంకో ప్లీడరు పెళ్లాంతో లోకాభిరామాయణం మాట్లాడుతూ కూచుంది. నరసమ్మ ఉష్ణోదకంతో జలకమాడి, అన్ని వస్తువులు తనంతటతానే కనుగొని - వంటచేసింది. ప్లీడరు ఆనందరావు ఇంటికి వచ్చి కొంచెం విశ్రాంతి తీసుకొని ఏడున్నరకల్లా స్నానంచేసి భోజనానికి తయారయినాడు. నరసమ్మ వంట చేస్తుండగా సూరి ఇంటికి వచ్చి గుమాస్తా గదిలో కాగితాలకట్టలు పడేసి వెళ్ళిపోయాడు. సూరి ప్లీడరుగారి మూడవ గుమాస్తా. పెద్ద గుమాస్తా సబ్‌కోర్టు పని చూస్తాడు; రెండో గుమాస్తా మున్సిఫ్‌కోర్టు పని చూస్తాడు; సూరి ఆ యిద్దరికీ సహాయంగా లా పుస్తకాలు మోయడం - ఇంట్లో పనులు చూస్తూండడం చేస్తుంటాడు.

'నరసమ్మా! వారికి వడ్డించు. నా రెప్పుడో పొద్దున నాలుగు మెతుకులు తిని వెళ్లారు. శర్మ నెక్కడికేనా పంపించారా మీరు? అతను తరవాతే భోజనం చేస్తాడులే!' అని అటు నరసమ్మతో - ఇటు భర్తతో మాట్లాడింది సుందరమ్మ ఏక సమయాన.

'శర్మ సినిమాకు వెళ్తా నన్నాడు' ఆనందరావు ముఖాన విభూతి రుద్దుకుంటూ.

'ఇతనికి సినిమా వ్యసనం వదిలే దెప్పుడో...? పైన ఏవో డబ్బులు దొరికినప్పుడల్లా సినిమాకు పరిగెడతాడు!' అని సుందరమ్మ తానుకూడా భోజనానికి తయారయింది.

నరసమ్మ పుట్టింట్లో చపకబారు నవలలు చదవడం - సినిమాలు చూడడం - అల్లికకుట్లు కుట్టడం చేయడంవలన, ఆమెకు వంటలో ప్రవేశంలేదు. వంటంతా పాడయింది. వంకాయకూర ఉడకలేదు. చారులో ఉప్పెక్కువయింది - వడియాలు మాడిపోయి, బొగ్గులయినయి. కందిపచ్చడిలో అమిత కారం!

'అమ్మాయ్! నీకు వంట ఏమీ అలవాటు లేదు కాబోలు!' అన్నాడు ఆనందరావు.

'ఈ వంటావిడ మధ్యమధ్య ఇలా మానేస్తుంటే, చాలా ఇబ్బందిగా నుంటోంది. ఈమె బదులింకో మనిషిని మాట్లాడాలి. వంట నేను చేయడానికి బద్ధకించి నరసమ్మను చేయమన్నాను - ఆమెకు వండడం తెలుసునని!' అన్నది సుందరమ్మ.

నరసమ్మ మనస్సు చివుక్కుమన్నది. కళ్ళ నీళ్ళ పర్యంతమైంది. దుఃఖభారాని కాగలేక దొడ్లోకి వెళ్ళి కళ్లనీళ్ళు తుడుచుకుని వంటయింట్లోకి రాలేదు. సుందరమ్మ 'నరసమ్మా! మాకు కాసిని మంచినీళ్ళు పోసి, కొంచెం పెరుగు వడ్డించు!' అన్నది.

నరసమ్మ ఆ మాటలు విని ఆమె ఆజ్ఞప్రకారం వంటయింట్లోకి వచ్చి వడ్డించింది. విద్యుద్దీప కాంతిలో సుందరమ్మ నరసమ్మ దుఃఖ వదనాన్ని చూచింది.

'పొరబా టెవరికైనా వస్తుంది! నీకు వంట చేతకాదని నాకు తెలియలేదు. మాటమాత్రం నీవు నాతో చెప్ప లేదు. ఏదో జరిగిపోయింది. విచారపడ బోకు!' అన్నది సుందరమ్మ.

నరసమ్మ సమాధానం చెప్పక విచారవదనయై నిలబడింది.

'శర్మ వచ్చేదాకా నీ వుండనక్కర్లేదు; నీవు అన్నంతిను. అతను ప్రతిరాత్రీ మేడమీద పరుంటు న్నాడు. మేడమీద మంచంలో పరుపు - దిండ్లు ఉన్నాయి. నీవన్నంతిని వెళ్ళి పరుందువుగాని—' అని సుందరమ్మ నరసమ్మను భోజనం చేయవలసిందని బల వంతం చేసింది. నరసమ్మ తన భర్త ఏమంటాడో అని సంకోచించి, ఆదంపతుల వెండిపళ్లాలు కడిగి, అలమరలో దాచి, మళ్ళ హాలులో వచ్చి కూర్చుంది. సుందరమ్మ తన దక్షిణవైపు గదిలో పక్కసరి చేసు కొని వచ్చి 'ఏం నరసమ్మా! అన్నం తినకుండా కూచున్నావేం?" అన్నది.

"వారూ నేను కలిసి తింటాము లెండి! మొదటి నాడే ఆయనకంటే నేను ముందన్నం తింటే ఆయనకు కోపం వస్తుంది.' అన్నది నరసమ్మ.

ఆనందరావు తన ఆఫీసుగదిలో లాపుస్తకాలు చదువుతున్నాడు. ఎనిమిదన్నరయింది. వాకిట్లో గుర్రంబండీ ఆగింది. అందులో సుందరమ్మ చెల్లెలు, ఆమె భర్త, ముగ్గురుపిల్లలు దిగారు వాళ్ళు సరాసరి లోనికివచ్చి నాగరికస్త్రీ నరసమ్మను చూచి-

'మా అక్కయ్యేదీ?' అన్నది సుందరమ్మ చెల్లెలు కమలమ్మ.

చెల్లెలు కంఠస్వరం గుర్తుపట్టి, సుందరమ్మ గదిలోనుంచి వచ్చి, అందర్నీ పరామర్శించింది. వాళ్లు కాళ్లు కడుక్కోవడానికి నీళ్ళిమ్మని సుంద రమ్మ నరసమ్మ కాజ్ఞాపించింది. నరసమ్మ లోపల విచారపడుతూ—వంటకత్తెవలె—వాళ్లకు పాదప్రక్షా ళనార్థం—నీళ్ళిచ్చి—కమలమ్మ బంగారపునగలు తిలకిస్తూ నిలబడింది.

'నరసమ్మా! నిప్పుచేసి ఓగిన్నెడుబియ్యం కడిగి పెట్టు!' అన్నది సుందరమ్మ.

'అక్కయ్యా! ఈ అమ్మాయి ఎవరే?' అన్నది కమలమ్మ సుందరమ్మతో—

'మా మూడో గుమాస్తాభార్య! అతను మాయిం ట్లోనే వుంటున్నాడు. ఆ అమ్మాయి! పాపం-ఇవా ళనే వచ్చిందతనితో కాపురంచేయడానికి- సరిగా ఇవాళనే వంటావిడ ఎగకొట్టింది.' అన్నది సుంద రమ్మ చెల్లెలుతో. అక్కాచెల్లెళ్లు— చెల్లెలుభర్త కేశవరావు, పిల్లలు మధ్యహాలులో కూర్చుని ఒకరి మాట ఒకరు వినిపించుకోకుండా సంభాషిస్తుండగా— నరసమ్మ, తొలిస్సారుకూతురు నరసమ్మ, కన్నీరు కారుస్తూ, దొడ్లో బావివద్ద బియ్యం కడుగుతోంది. ఆనందరావు లా పుస్తకాన్ని ముగించివచ్చి, మర దల్ని- షడ్డకుణ్ణీ పరామర్శించి- పిల్లల్ని దగ్గరకు తీసి వాళ్లని వరసని ముద్దెట్టుకున్నాడు. చంటివాణ్ణి ఎత్తుకుని, ముద్దెట్టుకొని 'కమలా! వీణ్ణిమాకిచ్చేస్తే మేం పెంచుకుంటాము!' అన్నాడు కేశవరావు వైపు దరహాసవదనుడై చూచి

వంటయింట్లో పొయ్యిమండక పొగతో కళ్లు మండిపోతున్న నరసమ్మకి సరసపల్లాపములు శూలా యమానములై గ్రుచ్చుకోసాగాయి. ఆమెపరిస్థితి రోడ్డుమీద నడిచేమనిషి కంఠంలోతు ఊబిలో ఇరుక్కుపోయినట్లుగానుంది! వెన్నెలరాత్రిలో ఒక్కసారి ఆకాశం అంతా కరాళ కజ్జల మేఘావృత మైనట్లుంది. తండ్రి గౌరవంకాపాడేటందుకు తాను తన భర్తతో కాపురం చేయడానికి వచ్చింది— తానీ ఊబిలో దిగబడటంకోసమా? అసలువంటకత్తె ఆపూట రాక పోవడానికి సుందరమ్మయే కారణమేమో నన్న అనుమానం కలిగింది నరసమ్మకు!

కేశవరావు, శర్మకోసం నరసమ్మకాచిన వేడి నీళ్లుస్నానంచేసి, భోజనంచేస్తుండగా శర్మ సినిమా నుంచి వచ్చాడు. ఇల్లంతా పెళ్లియిల్లువలె సందడిగా నుంది. వంటయింట్లో తనభార్య రాత్రిపదిగంటలవేళ అందరికీ వడ్డనచేయడం చూచాడు. సుందరమ్మ 'శర్మా నువుకూడా భోజనానికిలే! నీభార్య నీవు భోజనం చేసిన తరవాతగాని భోజనంచేయనని పట్టుపట్టుతోంది పాపం! చిన్నపిల్ల- ఈ వాళవంటకత్తెకూడా ఎగ గొట్టింది, అందువల్ల వంటంతా ఇవాళనే వచ్చిన ఆమెమీద పడింది!' అని అనునయవాక్యా లాడింది.

'వాళ్లభోజనా లయింతరవాత తింటానులెండి. నేను నీళ్లుపోసుకోవాలి' అన్నాడుశర్మ.

వచ్చినచుట్టాలకు మంచాలు, పక్కలు సుంద రమ్మ ఏర్పాటుచేసింది. వాళ్లు భోజనాలుచేసి కబురు చెప్పుకుంటూ పరున్న తరువాత, శర్మ బావివద్ద చన్నీళ్లు స్నానంచేస్తుంటే నరసమ్మ వెళ్లి 'మీకోసం వేణ్ణీళ్లుంచాను, ఆ చుట్టాలు పోసుకున్నారు!' అన్నది.

'దరిద్రుడికి నాకు వేణ్ణీళ్లు కూడా దేనికి? తాసిల్దారు కూతురివి— నువు వేణ్ణీళ్లు పోసుకుంటే అది సహజం!' అన్నాడు శర్మ భార్యతో.

శర్మకూడా నరసమ్మ వంటను వంక పెడుతూ భోజనం చేసి వెళ్లాడు. తరువాత నరసమ్మ త్వరత్వరగా భోజనం చేసి— తలుపులు వేసి— సరిగా ఎక్కడి సామానక్కడ సర్దక— అప్పటికే పదకొండుగంటలు దాటటంవలన— మేడమీదకు వెళ్లింది.

౫

తన భార్యవచ్చి పరుండటం గుర్తించి శర్మ 'నీ మనస్సిలా మారిపోయిందేం?' అన్నాడు.

'నా మనస్సెపుడూ ఒకలాగునే వుంది. మీరు నెలకు ఏభయిరూపాయిలు సంపాయిస్తున్నారని మా నాన్నకు మాస్టేడరు గారివల్ల తెలిసి—నన్ను మీతో కాపురం చేయడానికి పంపించారు. మన కాపురానికి కావలసిన పాత్రసామాను, మంచం, పరుపు, కుర్చీలు-మొదలైనవి చాలా కొనియిచ్చారు మా అమ్మ, నాయనా. ఇక్కడి పరిస్థితు లేమిటో నాకు తెలియదు. సాయింత్రం నాలుగుగంటలనుంచీ సుందరమ్మగారు సన్నరగడీసి వదిలింది. మీరు ఏభయిరూపాయిలు సంపాదిస్తుండగా, మన మిక్కడ వీళ్లకు బానిసలలాగున వుండవలసిన అవసర మేముంది? మనకా ఏభయి రూపాయిలు చాలకపోతే— మా నాన్న నెలకో పాతిక రూపాయిలు పంపుతా నన్నాడు! మనం హాయిగా వేరే ఎక్కడైనా కాపురముందాము. ఇంతధనవంతుల యింట్లో వుండడం చాలా కష్టం!' అన్నది నరసమ్మ.

'ఇక్కడ నాపరిస్థితి నాకే దుర్భరంగావుంటే ఇక్కడ నీవసలుండలేవు! నాతండ్రి వద్దనుంచి నాకు కానీ వచ్చేఅవకాశంలేదు. నాకింకెక్కడా వుద్యోగం దొరికే అవకాశంలేదు. ఈప్లీడరుగారు పెట్టుబడి పెట్టి నాతండ్రిమీద వ్యాజ్యంవడుపుతానని వాగ్దానం చేశాడు. నేనిక్కడ చేస్తున్న ఉద్యోగానికి నాకు వీళ్లు కానీ యివ్వటంలేదు. కాని ప్రతినెలా ఏభయిరూపాయిలు గిడుతున్న మాట యధార్థమే. రెండు పూటలు భోజనం ౩౦ రూ లు. కాఫీ రెండుపూటలూ రూ ౧౦ లు. ఉండడానికి గది—చాకలి మంగలి ఖర్చుకు పదిరూపాయలు. వెరసి ఏభయిరూపాయలు. అంటే సారాంశం ఏమంటే— వీళ్లింట్లో కాలక్షేపం చేయడం—వీళ్లుచెప్పిన పనులు చేస్తుండడం! ఈవూరులో బావుల్లో నీళ్లు పాతాళలోకంలోనుంటాయి. ఉదయం పదిబిందెలదాకా నీళ్లు తోడలేక నాచేతులు కాయలు కాచినాయి. నాసంగతంతా కనుక్కుని, నాకు పెళ్లయిందని తెలుసుకుని—నిన్ను కూడా ఇక్కడకు పిలిపించి— వంటమనిషి అవసరం లేకుండా నీచేత చాకిరీ చేయించుకుందామని— నాకు తెలియకుండా ఈ ప్లీడరుగారు మీనాయనకు పేచీ వేశాడు. మీనాయన ఇక్కడి యధార్థపు పరిస్థితులు తెలియక నిన్నిక్కడికి తీసుకవచ్చి దించాడు. నాతండ్రినుంచి భాగం పంచుకోగలిగితే—అప్పుడు మనకేమీ దిగులుండదు నరసూ!' అన్నాడు సూరి భార్యా విధేయుడై— కష్టాలు భరించలేని ఆవేదనతో—

'మనం విడిగా కాపురముంటే ఈ ఏభయిరూపాయిలూ ప్లీడరుగారు డబ్బుగా యివ్వరూ?' అన్నది నరసమ్మ వ్యవహారజ్ఞానంతో.

'అహ! యివ్వరు. కాని కూడా ఇవ్వరు. పైన ఎప్పుడైనా పావలా— అర్థరూపాయి దొరికిన నాడు తప్ప—నావద్దకానీ వుంటంలేదు! మీనాన్నకు రేపే వుత్తరం రాయి—ఇక్కడి పరిస్థితినంతా వివరంగా తెలియబరుస్తూ!' అన్నాడు సూరి.

'మీ నాన్నమీద వ్యాజ్యం మానాన్న మీచేత ఆడిస్తాడు. మీరిక్కడ యీ నికృష్టపు పనులన్నీ చేస్తూ ఇన్ని కష్టాలు పడుతున్నారంటే— వింటున్న నాకు కడుపు తరుక్కుపోతున్నది. మానాన్నగారు తాసిల్దారు. కావలసినంత పలుకుబడి కలవాడు. రేపుదయం మన సామానంతా తీసికొని మాపుట్టింటికిపోదాం!' అన్నది నరసమ్మ.

'రైలుచార్జీకి కాదుగదా— విషంపుచ్చుకోడానికైనా నావద్దకాణీ లేదు!' అన్నాడు సూరి.

'నా వద్దనుంది లెండి డబ్బు. రేపుదయం బండీకే మనంయిక్కడి నుంచి వెళదాం! నీళ్లే తోడుకుంటారో వంటే చేసుకుంటారో— వాళ్ల తిప్పలు వాళ్లు పడతారు. మీచేతవ్యాజ్యం వేయించి— దావాలో

గెలిస్తే, ఫీజుకింద ఏనాలుగెకరాలో కాజేద్దామని యీ ప్లీడరుగారు మీకు అన్నీ తనయింట్లోనే— ఏర్పాటుచేశాడు!' అన్నది నరసమ్మ, బాగాతన ఆలోచనా శక్తిని వినియోగించి.

పగలంతా తీరుబడిలేక— సినిమాచూడకుండా ఉండలేక— శర్మ గాఢనిద్రచెందాడు. తెల్లవార్లూ నరసమ్మ తన దురదృష్టాన్ని నిందించుతూ— భర్త తనకు విధేయుడైనందుకు సంతోషించింది. 'తడిసి గాని గుడిసెకప్పడు' అన్న సామెతవినంగా— బాగా కష్టపడిన తరువాత తన భర్తకు జ్ఞానం కలిగిందనుకుంది.

తెల్లవారగానే శర్మప్లీడరుగారితో 'నాభార్య ఇక్కడ వుంటానికి ఇష్టపడటంలేదు. దానిని పుట్టింట్లో దించివస్తాను!' అని చెప్పాడు. ఆనందరావు—సుందరమ్మ ఆమాటలువిని, నిర్ఘాంతపోయారు. నరసమ్మను పిలిచి ఆమెతో 'అమ్మాయ్! నిన్నవంటావిడ రానందున నిన్ను వంటచేయమన్నాను. ఇక ఎన్నడూ నీచేత చేయించదలుచుకోలేదు. అసలునీకు వంటచేయడం తెలియదుకూడా! పిల్లలులేని మాకు మీరిద్దరూ అండగా వుంటారనుకున్నాను. చిలకా, గోరంకల్లాగా మా మేడలో కాపురముంటారని వారూ, నేను ముచ్చటపడ్డాము! నామాట వినవూ?' అన్నది సుందరమ్మ.

'మా నాన్నగారు యిక్కడిపరిస్థితులు స్వయంగావచ్చిచూచి విచారించకుండా, త్వరపడి నన్ను తీసుకవచ్చారు. నేనిక్కడ ఒక్కక్షణం ఉండలేను.' అన్నది నరసమ్మ దృఢనిశ్చయంతో. శర్మ రెండు బండ్లు మాట్లాడుకొని వచ్చి, వాటిలో ఒకదానిలో సామానంతా పెట్టి, రెండోబండిలో భార్యా తాను ఎక్కి స్టేషన్‌కు బైలుదేరుతూ— 'అయ్యా! ప్లీడరుగారూ! నా వ్యాజ్యం విషయం మటుకు మరిచిపోండి' అన్నాడు. ఆనందరావు యీ ఆకస్మిక విపర్యయమున కంతకూ కారణం క్రొత్తగావచ్చిన నరసమ్మ అని తెలుసుకొని అంతులేని ఆశ్చర్యంలో మునిగాడు.



# సన్నివేశము - శబ్దసౌభాగ్యము



శ్రీ చిరుమామిళ్ల శివరామ కృష్ణ ప్రసాద్

ఆరవిచ్చి, యాకుల సరసను నిలచి పరిమళమును సవాళించు పుష్పమున కొక వింతసౌందర్యమున్నది. ఆ పూవునే త్రుంచి యొకమాలలో గ్రుచ్చిన మరియొకతీరు చక్కదనము మనకు గానుపించును. ఇందు, మొదటియందము ప్రకృతి సిద్ధము, రెండవది కృత్రిమము— ఒకేపోలిక కలిగియుండి, నేడో రేపో విచ్చుచున్న మొగ్గలతో, చుట్టును క్రమ్ముకొని యున్న యాకులతో, గాలితాకున కదలియాడుచు, తల్లియొడిలోని పిల్లవలె, లతాతన్వినంటి యుయ్యాలలూగు కుసుమమును త్రుంచి, త్రాటగ్రుచ్చి జలతారుదారములతో నలంకరించి, పన్నీరుచల్లి పకపకలాడింప మానవుడు ప్రయత్నించునే గాని, లోకర్మ ఫలించుటెట్లు? తనకొఱకు, తనయానందము కొఱకు మానవుడీకృత్రిమ సౌందర్యమును గల్పించుచున్నాడు. ఆ సౌందర్యమెంత కృత్రిమమో, ఆ యానంద మంత స్వల్పము.

ఒక సన్నివేశమునందు స్వభావసిద్ధముగవచ్చి నిలచిన శబ్దము, కొమ్మనం దారబూసిన పూవువలె భావసౌందర్యమును వెలార్చును. ఆడంబరము కొఱకు, లేదా యొకరి యానందముకొఱకు, తెచ్చి కూర్చిన శబ్దము, త్రెంచికూర్చిన పుష్పమువలె, కొలదిలో ముడుచుకొని, భావసౌరభమును గోల్పోవును. కావున, భావప్రధానమైన శబ్దమును, నిర్ణయించుకొని దానిని సన్నివేశయోగ్యముగ ప్రయోగించుటయే కవియొక్క ప్రతిభకు నిదర్శనము కాగలదు; అదియే శాశ్వతానందమును గూర్చు కవిత్వమునకు పునాది— భావములేనిశబ్దము, సౌందర్యములేని కుసుమము, సృష్టిలోనున్నవా? ఎట్లుండును? ఏశబ్దమునకే భావమే సన్నివేశమునందు కలుగునో, శబ్దము వలన సన్నివేశమునకు, సన్నివేశమువలన శబ్దమునకు, కలుగుశోభను, అర్థగౌరవమును గుర్తించి, వానిని ప్రదర్శింపవలసిన బాధ్యత కవియందున్నది. అట్టే యొకపూలమాలను తయారు చేయునప్పుడే యేరంగు గల తన రచనమునందు పూవునెచ్చటయమర్చి గ్రుచ్చిన, సుమ దామమునకు సౌందర్యము చేకూరునో, నిర్ణయించుకొని నేర్పుమీరవాని నొకచోట సంతరించవలసిన బాధ్యత, మాలను తయారుచేయువాని యందున్నది.

సకల విషయములను సంపూర్ణముగ నెఱిగిన, శ్రీకృష్ణుడు, రాయబారిగ కౌరవులకడ కేగుచున్నాడు. ఇరుపక్షములయందు పగలు పొగలు వెలయుచున్న దినములవి. ఒక్కమాట జారినచో మారణ మహాయాగము సంప్రాప్తించును; అందులకే రాయబారియొక్క బాధ్యత యనితర తుల్యమైపోయినది. ధర్మజుని సమీపించి శ్రీకృష్ణుడు, రాయబారిగ తాను కౌరవుల కడ నాడువవలసిన పలుకుల వివరమెఱిగింప గోరినాడు. ధర్మజు డనుభవశాలి. సకల మెఱిగిన జగత్కల్యాణ మూర్తిగ శ్రీకృష్ణుని నమ్మియున్నాడు; అందులకే—

> "మమ్మెఱుగు దెదిరి నెఱుగుదు
> నెమ్మియెఱుగు దర్థసిద్ధి నెఱి యెఱుగుదు, వా
> క్యమ్ముల పద్ధతి నెఱుగుదు
> వామ్మెవ్వడ నేను నీకు బుద్ధులు సెప్పన్,"

అని పమాధాన మొసంగి యున్నాడు. ఎంతటి రచనా కౌశలమును, ఈ కందపద్యమునందు తిక్కన ప్రదర్శించినాడో గమనింపుడు. శ్రీకృష్ణుని కార్యదక్షత, ధర్మజుని వినయ, వివేక సంపద, ఇందు కరతలామలకమువలె గన్పట్టుచున్నవి. ఈ పద్యమునందు ప్రతి శబ్దము, సన్నివేశమున కనుకూలముగ, ఆచి, తూచి, సమకూర్చబడినవి. 'వామ్మెవ్వడ నేను నీకు బుద్ధులు సెప్పన్' అను పాదమునందు, కరడులుగట్టిన భక్తి విశ్వాస భావములేగాక, సర్వోపగతుడగు శ్రీకృష్ణుని లీలామానుష కృత్యముల నెఱిగియే యున్నాడనను, ఆత్మవిశ్వాసమునుగూడ ధర్మజుడు ప్రకటించినట్లు స్ఫురించుచున్నది. 'ఎవ్వడ నేన?' అను పలుకులు ధర్మజుని పాత్ర కెంతటి

యౌన్నత్యమున్ను నాపాదింపజేయుచున్నవో గమనింపుడు. 'పొమ్ము' అనుటలో, నిష్కల్మష, నిరాడంబర, నిత్యతృప్త, హృదయమును ధర్మజుడు ప్రకటించినాడు. ఉభయపాత్రల నిట్లొక్క కందపద్యమునం దుజ్జ్వలముగ, కఠినశబ్ద సహాయము లేకుండ, పోషించిన కవి, తిక్కనగాక మఱొకరెట్లు కాగలరు?

భారత మహాయుద్ధ మాసన్నమైనది. ఇఱుపక్షముల బలమును వర్ణించుచు—

'రభస క్షోభిత మేదినీతలము పై
రథ్యప్రచారంబు లొ
ప్ప, భుజాగర్వము నెమ్మొగంబుల దలి
ర్పం, గన్నె కయ్యంబు న
ర్థిభవత్పుత్రులమీది కోపమున ను
ద్దీపింప నేతెంచి ర
య్యభిమన్యుండును, ద్రౌపదేయులును మా
ద్యద్దంతి యూథాకృతిన్.' అని.

పాండవ కుమారులను, తిక్కన వర్ణించియున్నాడు. ఈపద్యమునందు, 'కన్నెకయ్యము' అను శబ్దద్వయము, కీలకస్థానము నాక్రమించియున్నవి. అది కన్నెకయ్యమగుటచేత నే ఆయుత్సాహము, ఆ యుత్కంఠ ద్రౌపదేయులయందు గోచరించుచున్నది. ఎన్నడెఱుగని యొక కార్యమును సాధించుట కట్టి యుత్సాహము, యువకులయందు గన్పించుట సహజము. 'భుజాగర్వము,' ముఖములయందే ప్రతిబింబించుచున్నది. కౌరవులమీది కోపమున నది, ఉద్దీపించినది, అందులకే 'మాద్యద్దంతి యూథాకృతి' తో వారేతెంచిరి. చెలువలూరు, సెలయేటి జాలువలె ఒక్కొక్క పాదమునుండి భావమేరీతి జాలువారినదో తెలియుచున్నది. 'రభసక్షోభిత మేదినీతలము,' 'భవత్పుత్రులమీది కోపమున' 'మాద్యద్దంతి యూథాకృతిన్' మొదలగు వాక్యములు, హృదయమునందు తన కుమారుల విజయము నే గోరుచు, మాటలయందు మాత్రము ధర్మసూత్రముల వెల్లడించుచు కాలము గడపుచున్న ధృతరాష్ట్రుని కళని పాతసముమలై, వెలువరింప నశక్యమైన దుఃఖమును గూర్చుటకు సాయ మొనరించినవి. కథావస్తువు నున్మీలన మొనరించుటేగాక పాత్రపోషణమున కుపకరించునట్లు ప్రతిపద్యమునందు శబ్దములెంత యాలోచనముతో ప్రయోగింపబడినవో విశదపరచుట కీ యుదాహరణము ప్రకృతమునకు చాలుననుకొందును.

రాజకీయరంగమునందు కొన్నియెడముల నపసవ్యముగా నైచినవేగాని కార్యమొకప్పుడు సాధ్యము కాదు. సత్యదయా శౌచములకు భంగమురాకుండ కార్యము సాధించి, కలకాలము కీర్తివెన్నెలను వెలయించిపోయిన, బుద్ధుడు, గాంధీమహాత్ములకు పూర్వము భారతావనియందు ధర్మజ్యోతిని వెల్గించి సకల విషములయం దాదర్శజీవితము నే గడపి, శ్రీరాముడు జగద్వంద్యుడైనాడు—వాలివధ ఒక రాజకీయపు టెత్తు. ధర్మనిష్ఠాగరిష్ఠుడగు రఘురాముని చే వాలి సంహరింపబడినాడు. విగతజీవుడై పడియున్న ప్రాణనాథునికడకు పరుగు పరుగున వచ్చినది తార. వచ్చి శ్రీరాముని గాంచి :

'జననాథ! యీ వాలి జంప నేమిటికి?
మెఱసి నిన్నిటు సేయ మీ తండ్రితోడ
గఱపెనే రఘురామ, గఱుతింప వాలి?
జరవున నీరాజ్య విభవంబుగొన్న
భరతుడే రఘురామ, పరికింప వాలి?
చెనటియై నీ దేవి జెఱగొని చనిన
దనుజుడే రఘురామ, దలపోయ వాలి?
వాలి నకారణ వైరంబుపూని
యేలయ్య, తెగటార్చితిబ్బంగి చేర్చి?
నీ యట్టి సుకృతికి నీయట్టిపతికి,
నీ యట్టి కారుణ్య నిధి కెట్లు దగునె?
జనకజతో గూడ జనియె నే యెఱుక?
ఘనమైన విరహాగ్ని గ్రాగెనే యెఱుక?
భూమీశ నేడు నా పుణ్యమిట్లయ్యె
నేమిసేయుదునింక నేమందు విధికి?
నీ వాలినెడబాసి యే నుండజాల
దేవ! నన్నునుబట్టి తెగటార్పవయ్య."

అని వాపోయినది. ఇందొక్క యవాచ్యవచనము లేదు, కాని ప్రతివాక్యమునందు, ప్రతిశబ్దమునందు, ప్రతియక్షరమునందు, ఆర్తితో, ఆవేశముతో, స్త్రీహృదయము ప్రతిబింబించినది. 'నీ యట్టిసుకృతికి' 'నీ యట్టిపతికి,' ఇట్టిపని తగునా? యని తార ప్రశ్నించి ఆత్మపరిశోధమున కవకాశము గల్పించు

చున్నది. శ్రీరాముడు భార్యావియోగము నందు న్నాడు; తారకు భర్తృవియోగమును గల్పించినాడు. ధర్మరక్షణమునకు కంకణముగట్టినాడు; నిరపరాధియగు వాలిని సంహరించి తానపరాధియైనాడు! అందులకే 'నీ యట్టిసుకృతికి' 'నీ యట్టిపతికి' అను పలుకుల కంతటి వాడిచేకూరినది. ఆ యాదర్శపతీత్వమును, ఆసుకృతమును, ఉగ్గడించుట కిదియా సమయము! అనరాని, వినరాని, పలుకులతో నేమిపని? సాధారణ శబ్దమునందు, హృదయమును సంక్షోభిత మొనరించు భావము, సన్నివేశమును పురస్కరించుకొనియుత్పన్నమగుట, గుర్తించి, ప్రయోగించుటయే గదా కవిచంద్రుని ప్రతిభకు తార్కాణము.

సకల భోగములతో తులతూగు, చక్రవర్తి, విలువగల భూషణముల నలంకరించి, పెండ్లికొమరుడై పట్టపు టేనుగుపై కళ్యాణ మంటపమున కేగు చున్నాడు. ఆ యలంకారమును, వర్ణించుటకెన్నియో పద్యముల సాయ మవసరము. కాని శబ్దములయొక్క భావసౌందర్యము నెఱింగినకవికి, అంతప్రయాస మెందులకు? సుమనోజ్ఞము, సుకుమారము, సుందరమునగు భావము నెట్లురసము చిప్పిలు సాధారణశబ్దముల నాధారముగా గొని, ప్రదర్శించుచున్నాడో తిలకింపుడు:

'తమ్ములము సేయుచో నొక్క తలిరుబోణి
రాకుమారుని జూచుపరాకు కతన
మడిచి తాంబూల పత్రంబు మాఱుగాగ
గఱచె గెంగేలి నడి కేలి కమల దళము.'

ఆ లేజవరాలి కంతటి విభ్రమమును గూర్చినవిషయ మేది? రాకుమారుని సౌందర్యము. ఆ సౌందర్య మెంత యప్రమేయ మైయున్న, అట్టి విభ్రమాశ్చర్యముల గల్గించును? పాఠకుని యాలోచనము, భావ వీధులయందు పరుగులుతీరుచున్నది. తములపాకునకును, చేతివ్రేలునకును, భేదము కనుగొనలేనంతటి విభ్రమము, విభ్రమమునకు తోడు, ఆజవరాలు తములపాకునకు వలె, సుకుమారము, స్నిగ్ధము, అయిన యవయంగములు గల సుందరి యని ధ్వని ఈ తేటగీతము, రాజుయొక్క, తలిరుబోణియొక్క సౌందర్యాతిశయమును, విశదపరుప సమర్థమై యున్నది.

అది సూర్యోదయ సమయము. నిదురించుచున్న మహీపతిని మేల్కొలుప వైతాళికు డేమనుచున్నాడు!

'నిద్దుర మేలుకొమ్ము రజ
నీకర వంశవతంస, కుంకుమం
బద్దినభంగి యింటనదె
యామిని చెల్లెలు కాల్యసంధ్య దా
నుద్దియ సేయుచున్నయది
యుష్ణ మయూఖ సుత ప్రసూతికిం
బ్రొద్దులు సాచ్చియున్నయవి
పూర్వ దిశా సరసీ రుహాక్షికిన్."

అని, లలితములగు భావపరంపరలను వెలువరించుచున్నాడు.

'యామిని చెల్లెలు కాల్యసంధ్య,' 'ప్రొద్దులు సాచ్చియున్నయవి పూర్వదిశాసరసీరుహాక్షికిన్' మొదలగు వాక్యములయందు ధ్వనించుచున్న సాధారణ సంసారపు ముచ్చటలు మనోజ్ఞముగా నున్నవి. ఈపై పద్యమున తొలిపంక్తులయం దుత్ప్రేక్ష, తుది పంక్తులయందు రూపకము నుండినంత మాత్రమున నీచక్కని భావ శబలత చేకూర లేదు; అలంకారమున కలంకారము గూర్చునది శబ్దములే! అలంకారములు విద్యావిదుల కానందమును గూర్చును. సరళము, హృద్యము, పవిత్రమునగు భావము, అలంకార సహితమైనను, గాకున్నను, సాధారణ పాఠకుని యాదరమును జూరగొనును. 'పూర్వదిశాంగన', 'సరసీరుహాక్షి' యగుటయు, 'ఉష్ణమయూఖసుత' ప్రసూతి సమయ మాసన్న మయ్యెననుటయు, గమనార్హములు. సత్కవి, ఒకశబ్దము నొకొక్క సన్నివేశమునందొకొక్క భావ విన్యాసమును సాధించుటకే ప్రయోగించును; ఈపద్యమునందు సానలుదీరిన జాతిరత్నములవంటి శబ్దముల నర్థపుష్టికి కవి యుపయోగించి తనపనివానితనమునెల్లెఱుక బరచినాడో పాఠకులు గుర్తింతురుగాక. గ్రంథవిస్తర భీతిచే వాని నిచ్చట వివరింపక విరమించుచున్నాను.

కవులందరు పండితులుగారు, పండితులందరు కవులు కానేరరు. కవియందుపజ్ఞ, పండితునియందు, వ్యుత్పత్తి, మనము గుర్తించుచున్నాము. పండితుడైన కవియందీ రెండును మేళవించి, అర్థపుష్టి శబ్దసౌష్ఠవము గల కవిత్వము, నల్లేరుపైబండి నడకవలె సరళముగా సాగిపోవుటను మనము జూచుచున్నాము. సూర్యోదయ, చంద్రోదయవర్ణనము, మొదలగువాని యందు కవి భావనాబలము నెంతప్రదర్శించినను, అవి పిష్ట

పేషణము, చర్విత చర్వణమే యగుచున్నవి. సామాన్యసంసారపు సంగతులను, వర్ణించుటకు సామాన్య సన్నివేశములందు, లోకమునం దుపయోగింపబడు భాషను కవి యలవరచు కొనవలయును. మణిమయ కిరీటములు, రత్నదీపములు, కప్పురపుటారతులే కావ్యములందు, వెలుగుల వెల్లివిరియుట, కాలమున కనుకూలము కానేరదు. ఒక యకింజాతునకు చెందిన సంసారపు గుట్టు నేరీతి యొక కవి, లలితములగు పదముల సాయమున సంతరించుచున్నాడో చూతము. సన్నివేశమును మనసునం దుంచుకొని, శబ్దముల సౌందర్యమును గుర్తింప వలసియున్నది:

అతడు, ప్రకృతి శోభావిలాస లాలసుడు. అతని యర్ధాంగి భూషణముల ధరియించి కృత్రిమ సౌందర్యమును జూచుకొని కులికిపోవు స్వభావము గల యామడది. ఇక సంసారము నిస్సారమే గదా! - అతడామె మొగమునైన చూడలేదు; తననగలు మగని కేవగింపు గలిగించుచున్నవని యామనవ కలనైన దలంపలేదు. సంసారపు సారమెఱిగిన జాణయొకర్తు తన స్నేహితురాలు 'వట్టిరాకపోక లొనరుపు' చున్నదని కనుగొని, 'గారామునతో ద్రోసిన, రారమ్మనుచును మగిడి రానేటికి, కర్పూరంబుతోడి బాగా లీరాదో యాకుమడచి యీరాదో చెలి' అని యామెను హెచ్చరించినది. అందులకామె, ఏమి ప్రత్యుత్తర మీయ గలదు? ఒక నాడప్పటికిని, చక్కగ శృంగారించుకొని పడకటిల్లు ప్రవేశించినది; నిలచినిలచి, ఎట్టకేలకు పలుకాడని పతికడకేగి 'కడుద్రిమ్మటచే శ్రమ మొందినారు గాబోలును, బోదునా? నిదురబోయెదరే? యని, కప్పురంపు దాంబూలము తావిభుగ్గరని ముంచుకొనం జెవిదండ' బల్కినది. అందులకాయువకు 'ఏకోరికతో వచ్చితివని భార్యను ప్రశ్నించినాడు. 'లోకము వారలు పతికడకే కోర్కెని వత్తు' రని యామె కంటనీటితో తిరిగి ప్రశ్నించినది. అందులకాతడు మాటాడలేదు. 'రాయైనకొంత మేల్ నారాయణ మీ మనసుకంటె' అని యాజవరాలు వాపోయినది. పడకటింటి తెరమఱుగు ప్రతిదిన మాదంపతుల మధ్యజరుగుచున్న నాటకమునం దది యొకరంగము— కథాభాగము నట్లుంచనిండు, భార్యాభర్తల మధ్య జరుగుచున్న ఈరహస్య విషయమును విశదపరచు నప్పుడొక్క యశ్లీలవాక్యముగాని, శబ్దముగాని యుపయోగింప బడలేదు. అంతమాత్రమున విషయ విశదీకరణము స్వభావ విరుద్ధముగ లేదు. పాత్రలయొక్క మనస్తత్త్వమును బాగుగా నర్థమొనరించుకొని, ఆసన్నివేశమునం దుదయించు రసమునందు తాను భాగస్వామినియై, భావోన్మాదమున రచియించు పద్యములు, కవిని వాఙ్మయ లోకమున చిరంజీవునిగా జేయును. 'రారమ్మనుచు మగిడి రానేటికి,' అని తోటి జవరాలు ప్రశ్నించుటలో కనబరచిన చనువు, ఒకింత వెటకారము, స్వభావసిద్ధముగ నున్నవి; ఆపలుకులుచ్చరించునపుడా చెలియ త్రిప్పిన కన్నులు, చేతులు, పాఠకుని మనఃఫలకమునందు ప్రతిబింబించుచున్నవి. 'పోదునా నిదుర బోయెదరా?' అని 'తాంబూలపు తావి భుగ్గరని ముంచుకొనన్,' ఎంతదూరమునుండియో కాదు 'చెవిదగ్గర' పల్కినదట! ఇప్పుడిచ్చట తాంబూలపు తావియొక్క ప్రసక్తి యప్రస్తుతమని, ఎవరేని యనగలరా? 'రాయైన కొంత మేల్ నారాయణ! మీమనసుకంటె' అని యా చిరంటి పలికి, పాఠకుని సానుభూతిని సంపాదింప గలుగుచున్నది. 'నారాయణ!' 'ఆకు మడచి యీరాదో,' 'వట్టి రాకపోకలు,' మొదలగు శబ్దము లీ సన్నివేశమునం దెంత, 'అడుతనము' నలవరచుకొనినవో చూడుడు. ఈ సన్నివేశమునుండి వానిని తొలగించిన, అవి సాధారణభావమునే స్ఫురింపజేయును.

అది యర్ధరాత్రము; మైమఱచి నిద్రించుచున్న సమయమున, రాకుమారు డరుదెంచి, నిద్దుర లేపి, అశ్వము నాయత్తబరుప నాజ్ఞాపించినాడు. సంసారమునుండి, సర్వసంగ పరిత్యాగమునకు ఆప్రయాణ ముద్దిష్టమైనది. అశ్వచోదకు 'డీవిషయమును గ్రహియించినాడు.— సమయ మాయర్ధరాత్రము; వృద్ధనరపతి కీవిషయ మెఱుకలేదు; తినుచున్నది వాని యుప్పు పులుసు, వినుచున్నది కఠోరవార్త; అశ్వచోదకుడు తన కొలదికి వెరువలేదు; రాకుమారుని సమీపించి, అంజలి ఘటించి :

'మిసిమిసెసంగు ప్రాయమును
మేటి సిరులక్కడ లేనిరాజ్యము
న్రసికతయుం బసందొసగు
రాకొమరుండవు సాధ్వియైన నీ
దు సతిన కారణంబ విడి
దొంగతనమ్మున రాత్రి వేళ స

న్న్యసనము పూన నెంచెద క
టా సుఖమూనె విరాగమేరికిన్,' అని

వేడుకొనుచున్నాడు. ప్రాయము, ప్రాభవము. రసికత, సౌందర్యము, వమ్మయిపోగా, కన్నవారిని, చేకొన్నవారిని, విసర్జించి, యరణ్యముల పాలైపోవుట అనుచితమని విన్నవింప సాహసించినాడు. కేకలతో, బెదరింపులతో ఆర్తనాదముతో, ఆసేవకుడు తన్ను దామఱచి ప్రవర్తింపలేదు. హృదయతంతువుల కదలించు విషయముల నొక్కసారి జ్ఞప్తికెలయించి చూచినాడు; 'పొంగతనమ్మున' పోవుటేలయని తుదకు ప్రశ్నించినాడు. కాని, కారణజన్ముడు, అవతారమూర్తియగు బోధిసత్త్వుని హృదయము చలింపలేదు. ఈ పై పద్యము కవిశేఖరుల రుల యుపజ్ఞకునిదర్శనమై వెలయగలదు. ఇందు, 'మిసిమి,' 'మేటికవలేని,' 'పసందు,' మొదలగు శబ్దములు విశేషణములుగ నుపయోగింపబడినవి. మాటలాడు వాని హృదయావేదనము, ఒక్కొక్క విశేషణము నందొక్కొక్క మెట్టు పైకెగయుచు భావవిస్ఫూర్తికి దోహదము చేయుచున్నవి. సంపదను వర్ణించుటకు 'మేటి,' 'కవలేని', శబ్దములే యుపయోగింపబడినవి; ఆశబ్దములను, సౌందర్యవర్ణనమునందు ప్రయోగించినను, అవి రసము చిప్పిలనేరవు; అందులకు, 'మిసిమి' 'పసందు' వంటి శబ్దములే యర్థపుష్టిని గల్గించును. ఈ వర్ణనమువలన బోధిసత్త్వుని హృదయము కరుగలేదు, వాని చిత్తస్థైర్యమును విశదపరచుటకే వర్ణనమునందలి శబ్దము లమితముగ సాయపడుచున్నవి. అశ్వచోదకుడగు చెన్నుని హృదయావేదనమును బుద్ధుని అచంచల హృదయమును, ఒకేరకమునకు చెందిన శబ్దము లెఱుకబరచుట, కవియొక్క కూర్పునేర్పునకు, శబ్దసంపదకు, తార్కాణము కాదా?

నిరాకార, నిర్గుణోపాసన కైవల్యపథమునకు మిగులదవ్వుగ మానవుని గొనిపోవునని ప్రాజ్ఞుల యభిప్రాయము. ప్రాచీనాంధ్ర వాఙ్మయమునం దెక్కుడుగ, శతకములు, మాహాత్మ్యములు, స్థలపురాణములు, మానవాతీత విషయవర్ణనముల కాలవాలమైన కావ్యములు, ప్రబంధములు, వెలసినవి; వీనియన్నింటి యందును సగుణాత్మకమైన దైవోపాసనమే కానుపించును. ఆధునికయుగము నందీపద్ధతి చాల వరకు మారిపోయినది. కావ్యవస్తువు నిర్ణయము నందే మార్పు గోచరించినది; అందులకే నూతన సన్నివేశములు, పద ప్రయోగములు, వాడుకలోనికి వచ్చినవి. ధ్వని ప్రధానమైన కవిత్వము విరివిగా వెలయు నవకాశము చేకూరినది,

'శాంతరూపానంత జలరాశి వీవు
నవన నైకానంద నౌకను నేను,
సంశుద్ధమానస సరసిని నేను
ఆనంద మయ రాజ హంసవు నీవు,
సత్కళా సంపూర్ణ చంద్రుండ వీవు
సదమలచి ద్రూప చంద్రిక నేను,
లావణ్యమయ కల్పలతికను నేను
రాగరంజిత భృంగరాజంబ వీవు.
సకల జీవామోద జలదంబ వీవు
నిర్మల సౌదామనీ రేఖ, నేను,
వరనందనోద్యాన వనలక్ష్మి నేను
తరుణ శృంగార మాధవుడవు నీవు,
దివ్యమూర్తివి నీవు, దీప్తిని నేను,
సర్వమంగళ నేను, శంభుండ వీవు,
నీకు దక్కితి, నాకు నీవు దక్కితివి,
ఏలదాగెదవింక ? హృదయాధి నాథ! —'

ఈపై పద్యమునందలి యర్థనిష్పత్తిని గూర్చి వ్రాయదొరకొనుట, ఈ వ్యాసము నాయత మొనరించుటే యగును. ప్రేమమూర్తిగ భగవంతుని నిర్ణయించుకొని, సరళము, సుందరము, సుకుమారమైన శబ్దముల సాయమున, పవిత్రప్రేమ పూరిత హృదయ ప్రదర్శనమే ఇందు ద్యోతకమగుచున్నది. సన్నివేశమునకు తగిన శబ్దము లిందు గానవచ్చుట ప్రశంసార్హము. భగవంతుని కేవలము ప్రేమమయునిగా గాక, శూరునిగా, ధీరునిగా, దుష్టశిక్షకునిగా, శిష్టరక్షకునిగా కవులు వర్ణించి యుండుట మన మెఱుంగుదుము. కాలముగడచిన కొలది, దృక్పథమునందు మార్పువచ్చి, భావములేగాదు, శబ్దములును మార్పునుపొంది కొంతసౌకుమార్యము నలవరచుకొనినవని మనము తెలిసికొనుటకు పై పద్యమొక యుదాహరణము. ఈ క్రింద యుదహరింపబడిన పద్యమొకింత పురాతనమైనది. ఇదియు దైవప్రార్థనమున కుద్దిష్టమైనది. ఇందలిభావమును, ముఖ్యముగ భావమున కనుకూలముగ ప్రయోగింపబడిన శబ్దములను గమనింపవలసియున్నది. పైపద్యము నందలి భావమెంత

లలితమో, శబ్దములంత సుకుమారములై యున్నవి. ఈ క్రింది పద్యమునందలి భావమెంత యుద్భాసితమో శబ్దము లంత యుద్ధతము లైయున్నవి.

'భంజన భీమ దుర్జన
భాంజనపు డు జ్జ్వల బాహుదండకో
దండ కళా ప్రచండభుజ
తాండవ కీర్తికి రామమూర్తికిన్,
రెండవసాటి దైవమిక
లేడనుచున్ గడకట్టి భేరికా
డాండ డ డాండ డాండ నిన
దమ్ములజాండము నిండ భద్రవే
దండము నెక్కి చాటెదను
దాశరథీ! కరుణాపయోనిధీ!'

ఈ పైరెండు పద్యములలోనే విషయము నొకింత మార్పుతో సుబోధక మొనరించుచున్నాను. శబ్దనిర్ణయమునం దెంత వ్యత్యాసమును ప్రదర్శించుచున్నవో గమనింపుడు.

కూర్పు నేర్పునందును, రసమునందును, రుచియందును, చక్కదనమందును, పండిపగిలిన దానిమ్మపండువోలె పద్యనిర్మాణ మలరారవలయును. ఒక్క గింజ జారిపోయినచో, ఆస్థలమునం దెవరు మరియొక గింజనుగూర్చి ఆచక్కదనమునకు లోటురాకుండ, దానిమ్మపండును, కనువిందుగూర్చి వర్ణింపగలరు? ఒక్కశబ్దమును దిగవిడచి, ఆస్థలమునందు మరియొకరు, క్రొత్తశబ్దమును చేర్చి, భావసంపదకును, అందలిశబ్దాలంకారము, లేక, గుణాలంకారమునకును, భంగము రాకుండ పద్యమును పూరింపగలరా? ఇది సమస్యాపూరణము కాదు, శబ్దపూరణము:

'సూర్యోదయావసరమున
దుర్యోధను బలము, ప్రబలదోర్బలలీలా
ధుర్యగతినడచె, భీష్మా
చార్య, రవిసుతాది వీరసంఘోద్భటమై.'

'ఒగి లేయవి యొనరించిన
నరవర! యప్రియము తనమనంబునకగు, దా
నొరులకు నవి సేయకునికి
పరాయణము సర్వధర్మపథముల కెల్లన్.'

ఈ పైరెండు కంద పద్యములు భారతము లోనివి. వీనియందొక్క చరణమును గాని, శబ్దమును గాని, లేదా యొక్క యక్షరమును గాని, తీసి క్రొత్త దానిని చేర్చి, అది యతుకుబెట్టి నట్లగుపడకుండ పొతకుని మఱపింపగల కవులు నేడెందరున్నారు? ఈ పద్యముల యందొకటి యుద్ధసన్నద్ధులైన యోధశిఖామణుల వర్ణనమునకు చెందియున్నది. మరియొకటి, ఒక పవిత్రాదర్శమును విశదము చేయుచున్నది. పనసపండు లోని తొనలవలె ఒక శబ్దము వెంట వేరొక శబ్దము రమ్యముగ నమర్పబడిన రసపుష్టిని గూర్చుచుండుట గమనింపదగిన విషయము. మొదటిపద్యము నందలి ప్రాసము ద్విత్వాక్షరసమన్వితము; అయినను, వ్యర్థపదముగాని, పద్యము తూకమునకు, గణపూరణమున కొక్కపడికట్టు శబ్దముగాని, కానరాకున్నవి.

నవ్యాంధ్ర సాహిత్యము నందొకడు నొక కుసుమ మేమనుచున్నదో వినుడు:

'నాకు దలంపు లేదు లల
నా జనతా కబరీభరైక భూ
షా కలనన్ సతీమ్యాదు భు
జాంతరతల్పకు చోపగూహ బి
బ్బోకమునన్, వధూసిత క
పోలగళ చ్ఛవణావతంస హే
వాకమునన్, విలాసినుల
సొపటు నెందిర కావి పూతలన్.'

అని, ఒక పవిత్రాదర్శము నొక పూవుపలికి నట్లు కవి పొందుబరచి యున్నాడు. ఆపవిత్రాదర్శమేది?

'మాతృదేశ సేవాచరణమ్మునందసువులర్పణ జేసిన వారి పార్థివశ్రీ చెలువారుచోట, దదస్రు గుచ్ఛములన్ వికసించి, వాసనల్ వీచుచు, రాలిపోవగ వలెం దదుదాత్తసమాధి మృత్తికన్.' ఈ యాదర్శ మెంత యున్నతమో, ఈ రచనమంత యుదాత్తము. ఇందలి శబ్దలాలిత్యము, ఉత్కృష్ట సన్నివేశమునకు మెఱుగు గూర్చుచున్నది. ప్రతియక్షరము, శబ్దము, వాక్యము, రసోన్ముఖముగ నే పరుగిడుచు, భావోన్మాదమున, అయాచితముగ వచ్చిచేరిన శబ్దముల సౌందర్యము నినుమడింప జేయుచున్నవి. కొలది శబ్దములతో నెక్కుడు భావమును వెలువరింప గలుగుట ప్రతిభావంతుని లక్షణము. ఎక్కువశబ్దములతో కొలదిభావమును వెలువరించుట సాధారణమానవునకు, లక్షణము. వాఙ్మయలోకమున కవియైన మానవునకు, సాధారణ మానవునకుగల యంతర మనంతము.

సన్నివేశ మొకత్రోవ, శబ్ద మొకత్రోవ నడచిన, కావ్యము, రసవిహీనమై, విస్మృతరాసిలో గలసిపోవును. రసమయమైన కావ్యము శాశ్వతానందమును గూర్చును.

# వరమీయని వేలుపు

●

## రిచర్డు వైట్

### 1

నేను పోస్టాఫీసులో పనిచేసే రోజుల్లో కొందరు తెల్లవాళ్ల బ్బాయిలతో పరిచయాలుండేవి. ఒక గురువారంనాడు రాత్రి, చికాగో దక్షిణపువీధి హోటలులో ఒకచోట, ప్రపంచ పరిస్థితులు చర్చించే ఒక సమావేశానికి రావలసినదని, ఆ యువకుల సంఘం నాకు ఆహ్వానం పంపించారు. అక్కడ ఒక పదిమంది చేరాము. అల్పాహారాలూ, పానీయాలూ సేవిస్తూ అందరం కబుర్లు చెప్పుకొంటున్నాం. వాళ్లల్లో చాలా మంది కమ్యూనిస్టుపార్టీలో చేరారని వినగానే నాకు చాలా ఆశ్చర్యం వేసింది. పార్కులలోనూ, అక్కడా, నీగ్రోకమ్యూనిస్టులు, వేసే వెకిలివేషాల ఊసెత్తి, వాటి విషయం ఏమంటారని వాళ్లని నిలదీసి అడిగాను. ఆ "వెకిలివేషా"లన్నీ, సయుక్తికమైన చర్యలనీ వాట్లల్లో ఏమీ తప్పులేదనీ వాళ్లు విశదీకరించారు. నాకు మాత్రం ఏదోగానే అనిపించింది.

తర్వాత, ఒక గురువారం రాత్రి, సోల్ అనే యూదుమిత్రుడు, తన కథ ఒకటి, 'జాక్ క్రానాయి'

---

**రిచర్డు వైట్:—** ఈ శీర్షిక క్రింది కథనాలలో ఇతనిది మూడవది. ఈ మొదటి ముగ్గురూ కూడా కమ్యూనిస్టు పార్టీతో ప్రత్యక్షపరిచయం గలవారు.

వైట్ అమెరికన్ నీగ్రో. 1908 సెప్టెంబరు నాల్గవ తారీఖున జన్మించాడు. తల్లి తండ్రులు బీద నీగ్రోలు. మిసిసిపీ రాష్ట్రంలో నాట్చెజ్‌కు ఇరువైఅయిదు మైళ్ళ దూరంలో ఉన్న ఒక కూలీలతోటలో జన్మించాడు. ఇతని బాల్యంలోనే తండ్రి భార్యాబిడ్డలను వదిలి పరారి అయిపోయాడు. తల్లి చాకలిపని చేసుకుంటూ, బిడ్డనూ తన్నూ పోషించుకుంటూ వచ్చింది.

ఆమె కూడా పక్షవాతంతో పడిపోయింది. అప్పటినుంచి 'అమ్మమ్మ' ఇతన్ని చేరదీసి, సెవెన్త్ డే ఏడ్వెంటిస్టు స్కూలుకు, పిల్లడిని పంపించి చదివింపసాగింది.

పదిహేనోఏట ఇల్లువదిలి 'మెంఫిస్' పట్టణానికి వచ్చాడు. కూలిపనులు చేసుకుంటూ పొట్టపోసుకొంటూండేవాడు. అక్కడే రెండేళ్లు గడిపాడు. ఆ సమయంలో 'మెన్‌కెన్' వ్రాసిన 'బుక్ ఆఫ్ ప్రిఫేసెస్' అన్న గ్రంథం చదివాడు. తనూ రచయిత కావాలని నిశ్చయించుకొన్నాడు. జేబులో 150 డాలర్లతో 'చికాగో' మహాపట్టణానికి బయలుదేరాడు. ఆపనీ ఈపనీ చేస్తూ కొన్నాళ్లు గడిపాడు. కాని ఇంతలో "డిప్రెషన్" వచ్చింది. ఏ ఉద్యోగాలూ లేకుండా ఊడగొట్టింది. 'జాన్ రీడ్ క్లబ్' ద్వారా కమ్యూనిస్టుపార్టీలో చేరాడు.

ఇతని గ్రంథాలు అన్కుల్ టామ్సు ఛిల్డ్రెన్ (కథానికలు); హౌ బిగ్గర్ వజ్ బోర్న్; నేటివ్ సన్; బ్లాక్ బాయ్.

సంపాదకత్వాన నడుస్తున్న 'అన్విల్', అనే ఒక చిన్న పత్రిక వారు స్వీకరించారనీ 'జాన్ రీడ్ క్లబ్' అనే ఒక విప్లవసంస్థలో తాను సభ్యుడ నయాననీ చెప్పి, మమ్మల్నందర్నీ ఆశ్చర్యచకితులను చేశాడు. ఆ సంఘము సమావేశాలకు రావలసిందంటూ సోల్ నన్ను మరీమరీ బ్రతిమాలసాగాడు.

"నిజంగా నీకు వాళ్లు నచ్చుతారు!" అన్నాడు సోల్.

"నాకు ఏ సంస్థలలోనూ జేరాలని లేదు" అన్నాను.

"కాదు. వ్రాయటంలో నీకు వాళ్ల సహాయం చాలా లభిస్తుంది."

"ఏం వ్రాయాలో, ఎల్లా వ్రాయాలో, నాకు ఎవడూ చెప్పనక్కరలేదు."

"వచ్చి చూడరాదా! ఇందులో నీకు పోయేదేముంది" అంటూ బలవంతపెట్టాడు.

నీగ్రోలమీద, కమ్యూనిస్టులకు యథార్థమైన అభిమాన ముంటుందని నాకు నమ్మకం కుదురలేదు. తెల్లవాడు "నాకు నీగ్రోలంటే ద్వేషము" అంటేనే ఆమనిషిని వెంటనే నమ్మగలిగేవాడిని. "నీగ్రోలంటే నాకు గౌరవం" అని తెల్లవాడు అంటే, మనిషిమీద వేరే అపనమ్మకమే కలిగేది. అంతటి అవిశ్వాసిగా ఉండేవాణ్ణి.

ఒక శనివారంనాడు రాత్రి, చదివి చదివి విసుగెత్తి, వేడుక చూడటానికి వెళ్లినవాడిలాగా జాన్ రీడ్ క్లబ్‌కు బయలుదేరాను. 'లూప్' పేట జేరి, ఇంటి నంబరు కనుక్కొన్నాను. చీకట్లో ఉన్న మేడ మెట్లెక్క సాగాను. అంతా చీకటి గుయ్యారంగా ఉంది. ఇల్లాంటి పాడుపడ్డచోట మహత్కార్యాలు జరగబోతాయి.

పైన కిటికీలలోనుంచి గదిగోడల నలంకరించి ఉన్న బొమ్మలు చూచాయగా కనపడుతున్నాయి. మెట్లెక్కడం పూర్తిచేసి ఒక గది తలుపుదగ్గిరకు వచ్చాను. "చికాగో జాన్ రీడ్ క్లబ్" అని తలుపు మీద అక్షరాలు వ్రాసిఉన్నాయి.

తలుపు తోసి గదిలో అడుగుపెట్టాను. అంత వింతైనగది అంతకుముం దెప్పుడూ చూడలేదు. గది నేల నిండా, సిగరెట్టుపీకలూ, చిత్తు కాగితం ముక్కలూ పడి ఉన్నాయి. గోడలవరుసనే కొద్ది బెంచీలు ఉన్నాయి. బెంచీలకు కొద్దిగా పైగా చిక్కనిరంగులలో, రాక్షసప్రమాణంలో ఉన్న కార్మికులు జెండాలు ఎగురవేస్తూ నిలుచున్న బొమ్మలు చిత్రించబడి ఉన్నాయి. ఆ కార్మికుల నోళ్లు అట్టహాసంగా కేకలు వేస్తున్నట్లు తెరుచుకొని ఉన్నాయి. వాళ్ల కాళ్ల కింద మహాపట్టణాలు నలుసులలాగా నేలను కరుచుకుని పడిఉన్నాయి.

"రండి!"

అటు తిరిగాను. ఒక తెల్లమనిషి, చిరునవ్వుతో నన్ను పలకరిస్తున్నాడు.

"ఈ క్లబ్బులో సభ్యుడైన నా స్నేహితుడు ఒకడు ఒకసారి ఇక్కడికి వచ్చి చూడమన్నాడు. అతని పేరు సోల్——" అంటున్నాను.

"మీ రాక సంతోషదాయకము. ఇవాళ రాత్రి ప్రత్యేక సభ ఏమీ లేదు. సంపాదకుల సమావేశం మాత్రం జరుగుతూంది. మీరు చిత్రకారులా!" అన్నాడాతడు. అతనికి మీసాలున్నాయి. తల కొద్దిగా నెరుస్తోంది.

"కాదు, రచనలు చేయటానికి ప్రయత్నిస్తున్నాను."

"అయితే మా పత్రిక "లెఫ్ట్ ఫ్రంట్" సంపాదక సమావేశంలో పాల్గొనండి."

"నాకు, పత్రికాసంపాదకత్వం ఏమాత్రమూ తెలియదు" అన్నాను.

"నేర్చుకోవచ్చును" అన్నాడు.

అనుమానంతో అతనివంక తేరిపార చూశాను.

"ఇక్కడ మీకు అడ్డుగా ఉండటం నాకిష్టం లేదు" అన్నాను.

"నన్ను గ్రిమ్ అంటారు" అన్నాడు.

నా పేరు చెప్పాను. ఇద్దరం కరచాలనం చేసుకొన్నాము. అత నొక చిన్నగది దగ్గరకు వెళ్లి రెండు చేతులా ఇన్ని పాత మేగజైన్లు తెచ్చి నా ముందర పడేశాడు.

"ఇందులో 'మాసెస్' పత్రిక పాత సంచికలు కొన్ని ఉన్నాయి. మీరెప్పుడైనా ఆ పత్రిక చదివారా?"

"లేదు !"

"అమెరికాలో గొప్ప రచయితల్లో కొందరు ఇందులో వ్రాస్తూఉంటారు" అన్నాడు.

ఇంటర్నేషనల్ లిటరేచర్, అన్న పత్రిక సంచికలు కూడా పడేశాడు. "ఇందులో గోర్కీ, షోలొఖొవ్ మొదలైనవాళ్ల రచన లుంటాయి..." అంటున్నాడు.

తప్పకుండా చదువుతానని చెప్పాను. లోపలికి ఆఫీసులోకి తీసుకుపోయాడు. అక్కడివాళ్లతో పరిచయాలు కలిపాడు. అక్కడి యూదు యువకుడు, తరువాత దేశంలో పెద్దచిత్రకారులలో ఒకడయాడు, దేశంలో గొప్పస్వరవేత్తగా తర్వాత ప్రసిద్ధికెక్కాడు మరొక యువకుడు. ఇంకో యువకుడు, రచయిత. తర్వాత తనతరంవాటిలో కెల్లా గొప్పవని పేరెక్కిన ప్రసిద్ధమయిన నవలలు వ్రాశాడు. ఇంకొక యూదు కుఱ్ఱవాడు, తర్వాత ద్వితీయ ప్రపంచ సంగ్రామంలో, జెకోస్లొవాకియాను నాజీలు ఆక్రమించుకోటం ఫిల్ముతీసి ప్రసిద్ధికెక్కాడు. కొన్ని దశాబ్దాలదాకా పరిచయం నిలవగల మహాపురుషులను కలుసుకొన్నాను. నాజన్మలో ప్రప్రథమంగా ఆర్ద్రమైన స్నేహబాంధవ్యాలు అప్పుడే ఏర్పడనున్నాయి.

ఒకమూల కూర్చుని వాళ్లు తమ పత్రిక 'లెఫ్ట్ ఫ్రంట్' విషయం చేసుకొంటూన్న చర్చలు వింటూ కూర్చున్నాను.

నేను కేవలం "నీగ్రోను" కదా, అని జాలిపడి, అతి మర్యాద చూపిస్తున్నారా? వీళ్లతో, చాలా జాగ్రత్తగా, ఆలోచించి మరీ వ్యవహరించాలని నాకు నేను చెప్పుకొంటూ కూర్చున్నాను. వాళ్ల పత్రికకు ఏదైనా వ్రాయవలసిందంటూ అడిగారు. ఆలోచిస్తాను అని ముభావంగా చెప్పి ఊరుకొన్నాను. సమావేశమయాక ఒక ఐరిష్‌యువతిని కలుసుకొన్నాను. ఆమె ఒక అడ్వర్టైజింగ్ ఏజన్సీ తరఫున కొంత పనిచేస్తూండేది. సాంఘికసేవలో నిమగ్నురాలయేది. బడిపంతులుపని చేసేది. ఒక ప్రముఖ యూనివర్సిటీ ప్రొఫెసర్ గారి భార్య. ప్రజాసేవకుడుగా వీళ్లలాగే, నేనూ కొన్నాళ్లు పనిచేసిఉన్నాను. అందుచేత దానికని మురిసిపోవలసిందేమీ నాకు కనబడలేదు. వీళ్ల ఉద్దేశాల లోతుపాతులు కనుక్కొందామని ప్రయత్నించాను. కాని ఏదో కరుణించి దిగివస్తూన్న ధోరణేమీ వాళ్లల్లో కనబడలేదు.

౨

అప్పుడు కలిసిన తెల్లవాళ్ల నిజాయితీలోని లోతుపాతులను తర్కించుకొంటూ, వాళ్లకు "నీగ్రో" లంటే నిజమైన ఏ అభిప్రాయం ఉందో ఊహించ ప్రయత్నిస్తూ దీర్ఘాలోచనలో మునిగి, యింటికి చేరాను.

మంచంమీద నడుం వాల్చి, మాగ్‌జైన్‌లు తిరగేయ్యసాగాను. పతితులు, పరపీడితులు, అయిన ప్రజల జీవితాన్ని తరిచి సత్యం తెలుసుకుందామన్న నిష్కల్మష కుతూహలమూ, కృషీ కూడా ప్రపంచంలో ఉన్నాయని తెలుసుకొని ఆశ్చర్యపోయాను. అధికారులచుట్టూ పొట్ట చేత్తో పట్టుకొని భిక్షాటన మొనరిస్తున్నప్పుడు, "ఏనాటికైనా, హరిజనులంతా మనోవాక్కర్మల ఏకమై నిలవగలరా" అని తలపోసికొని విస్తుపోతూండేవాణ్ణి. ఇప్పుడు తెలిసింది. ప్రపంచంలో ఆరోభాగంలో అప్పుడే ఈ ఐక్యతాకృషి జరుగుతూంది. ఆ విప్లవ వాక్యాలు, పేజీల అచ్చులోంచి బయలుపడి, మహాశక్తివంతాలై నన్ను తాడింపజొచ్చాయి.

నన్ను గాఢంగా ఆకర్షించినది కమ్యూనిజం ఆర్థికతత్వంగాదు. ట్రేడ్ యూనియన్ల బలసంపన్నతా కాదు. అజ్ఞాత సంస్థాకృషిలోని రమ్యత్వమూ కాదు. ఇతర ప్రపంచ దేశాలలోని కార్మికులందరికీ కలుగుతూన్న ఒకే విధమైన అనుభవాలు—పరిస్థితులు ఎంత చెదరిపోయి ఉంటున్నా, ఏకార్థసమవేతులను చేసి కార్మికులనందరినీ కూడగట్టుకురాగలిగేందుకు గల ప్రత్యక్ష అవకాశము ఇవీ నామనస్సుకు గాటంగా నాటుకొన్నాయి. చిట్టచివరికి, ఈ ప్రకటిత విప్లవ రూపంలో, నీగ్రో అనుభవాల వ్యక్తీకరణకు ఆధారం చిక్కిందనీ, ఈప్రకారం, ఒక స్వరూపము, ఒక కృషి, ఏర్పరచుకోవచ్చుననీ నామనస్సుకు స్ఫురించింది. ఆ చదివిన పత్రికలలో, ఏదిక్కూ లేని నిరాశ్రయుల అనుభవాలను వెలిబుచ్చాలనే ప్రబల ఆవేశం పిలుపులాగా రెచ్చగొట్టింది. ఇందులో మిషనరీల కుంటి సానుభూతులు లేవు. "మాలాగా

ఉండండి. అప్పటికి మిమ్మల్ని ప్రేమించగలుగుతా మేమో!" అని ఆ వ్యాసాలు అనటంలేదు. "నీ విషయం చెప్పుకో నేందుకు నీకు చాలినంత సాహస మే ఉంటే, నీవు ఏకాకివి గావని గ్రహిస్తావు" అంటున్నాయి. జీవితంలో నమ్మమని జీవుల్ని ప్రోద్బలం చేస్తున్నాయి.

రాత్రంతా చదువుతూనే ఉన్నాను. తెల్లవార బోతూంటే లేచి కూర్చున్నాను. టైపురైటర్‌లో కాగితం పెట్టాను. నా మాటలు వినేవాళ్లున్నారని మొట్టమొదటిసారిగా ధైర్యం కల్గింది. ఛందోరహితంగా, ఒక గీతం వ్రాసేశాను. చాలా ప్రాథమికంగా, అతివెర్రిగా ఉంది ఆ గీతం. ఆ ఊహాచిత్రణలో, నల్లటిచేతులు, కృషి చేస్తూ, తుపాకులు పట్టుకొని, చివరికి మృత్యువులో కొయ్యబారిపోయిన చిత్రాలు సృష్టించాను. ఏదో అస్పష్టంగా, తెల్లజాతుల, నల్ల జాతుల జీవితాల్ని ఒక ప్రవాహంగా మిళితంచేసి అందులో చూపించాలననుకొన్నాను.

వంటింట్లో పొయ్యి రాజేస్తున్న చప్పుడయింది. "రిచర్డ్! ఒంట్లో బాగుండలేదా" అంటూ మా అమ్మ కేక పెట్టింది.

"అట్బే కాదు. చదువుకొంటూన్నా!" తలుపు తోసి లోపలికి వచ్చి మా అమ్మ తలగడామీద ఉన్న పత్రికల బొంతర్లన్నీ చూసింది.

"ఈ పాత పత్రికలు కొంటానికి డబ్బు తగలేస్తున్నావా" అని అడిగింది మా అమ్మ.

"కాదు. ఒకళ్లు ఇచ్చారు."

జబ్బుకాళ్లతో కుంటుకుంటూ పక్కదగ్గిరకు వచ్చి ఒక పత్రిక "మాసెస్" పాతసంచిక తీసింది. ముఖపత్రంమీద భయంకరమైన మే డే వ్యంగ్యచిత్రం ఒకటి గీసిఉంది.

మా అమ్మ కళ్లజోడు సరిజేసుకొని మళ్ళీ పరకాయించి చూసింది.

"అరి భగవంతుడా!" అని గగ్గోలుగా అన్నది.

"ఏమిటమ్మా! ఏమయింది."

"ఏమి? టిది?" అంటూ పత్రిక నా ముందరికి చాచి, ముఖపత్రం చూపిస్తూ, "ఈ మనిషి ఇల్లా ఉన్నా డేమిరా! ఏం వచ్చింది పాపం" అంటూ అడిగింది.

మా అమ్మ ప్రక్కన నిల్చుని, ఆవిడ నాకు కొంత ఎరుకిచ్చిన దృక్పథంతో, కమ్యూనిస్టు చిత్రకారుడు గీసిన ఆ చిత్రం మళ్లీ చూడసాగాను. చిరుగు గుడ్డపేలికలు కట్టుకున్న ఒక కార్మికుడు ఎఱ్ఱజెండా ఎగరవేస్తూ నిల్చుని ఉన్నాడు. అతని కళ్లు ఉబ్బి ఉన్నాయి. నోరు ముగమంతా విస్తరించుకొని తెరుచుకొని ఉంది. పళ్లు బైట పడుతున్నాయి. మెడ కండరాలు, తాళ్లు పేనినట్లున్నాయి. అతన్ననుసరిస్తూ, మగవాళ్లు ఆడవాళ్లు పిల్లలూ, నానారకాలుగా ఉన్న మూక, కఱ్ఱలూ, పలుగులూ, పారలూ, రాళ్ళూ పట్టుకొని భీకరంగా చేతు లాడిస్తున్నారు.

"ఈ గుంపు అంతా ఏం చెయ్యబోతున్నారు!" అని అమ్మ అడిగింది.

"నాకు తెలియ"దని తడబడుతూ చెప్పాను.

"ఇవి కమ్యూనిస్టు పత్రికలా ?"

"ఔను"

"జనం అంతా ఇల్లా చెయ్యాలని వీళ్ళ కోరికా ?"

"అంటే కేవలం..." అంటూ గుక్కిళ్లు మింగాను.

మా అమ్మ మొగంలో, అసహ్యమూ ఛీదరింపూ కనబడుతున్నాయి. మా అమ్మ శాంతస్వభావురాలు. శిలువమీది ఏసుక్రీస్తు ఆమె ఆదర్శము. అల్లాంటి ఆవిడతో, విప్లవగీతాలు పాడుతూ వీధుల్లో కదం తొక్కాలని కమ్యూనిస్టుపార్టీ వాంఛిస్తూందని ఏ మొగం పెట్టుకొని చెప్పను?

"ప్రజలంటే, ఏమనీ ఈ కమ్యూనిస్టుల అభిప్రాయం ?" అని అడిగింది.

మాటలకోసం వెదుక్కొంటూ "ఈ బొమ్మలో కనబడేది, వాళ్ల ఉద్దేశం సరిగ్గా అది కాదు."

"మరి అయితే వాళ్ల ఉద్దేశ మేమిటి ?"

"ఇది కేవలం సాంకేతికం."

"అయితే మరి వాళ్ళ ఉద్దేశం ఏమిటో అదే ఎందుకు చెప్పరూ ?"

"సరిగ్గా చెప్పటం ఇంకా వాళ్లకూ తెలియ లేదేమో ?"

"అల్లాంటివాళ్లు, ఈ తుక్కు అంతా అచ్చు వెయ్యటం ఎందుకు ?"

"ప్రజలకు ఎల్లా చెప్పాలో వాళ్ళ కింకా సరిగ్గా తెలియ లేదు" అని అమ్మసుందర ఒప్పుకొన్నాను. మా అమ్మకే నచ్చచెప్ప లేకపోతే, ఇంకెవళ్ళకు నచ్చచెప్పగలనని నాకే అనుమానం మొదలయింది.

"ఈ బొమ్మె చాలు ఎవళ్ళకైనా పిచ్చి ఎత్తించేందుకు" అంటూ పుస్తకం అక్కడే పడేసి మా అమ్మ కదిలింది. తలుపుదగ్గిర వెనక్కు తిరిగి "ఆ జనంతో కలిసి తిరుగుతున్నావేమిటని"—అడిగింది.

"ఊర్కే చదువున్నాను అమ్మా" అని చెప్పి తప్పించుకొన్నాను.

అమ్మ అవతలికి కదిలాక, ఆవిడ మామూలు ప్రశ్నకు జవాబు చెప్పలేకపోయానే అని ఆలోచిస్తూ కూర్చున్నాను. మళ్లీ "మాసెస్" పత్రికమీది ఆముఖచిత్రం పరీక్షించసాగాను. ఆ ఉగ్రచిత్రం సామాన్యప్రజల ఉద్దేశాలను వెలిబుచ్చటం లేదని గ్రహించాను. మళ్లీ పత్రికంతా తిరగేశాను. అందులో భావప్రకటనంతా, ఇతరుల కెల్లా చెప్తే వచ్చుతుందో అని ఊహించి, ఎల్లా వ్రాస్తే జనం ఆకర్షింపబడి తమ సంఘంసంఖ్య పెరుగుతుందా అన్న అపేక్షతోనే రచన సాగించినట్లుంది. వాళ్ల కొక ప్రణాళిక ఉంది. ఆదర్శము ఉంది. కాని భాషమాత్రం ఇంకా కనుక్కోలేకపోయారు.

దానితో, ఇక్కడ నేను చెయ్యగలిగిన కృషీ, వెలువర్చగలిగింది కొంతా, ఉన్నదన్న మాట. కమ్యూనిస్టులు, తాము ఎవరికి నాయకత్వం వహించదలచారో, వాళ్ల అనుభవాలను, మరీ సూక్ష్మీకరించి వేశారు. ప్రజలను మొత్తంగా కూడగట్టుకొని వచ్చే ప్రయత్నంలో, ప్రజలను మరీ అర్థరహితంగా భావించుకొనివచ్చారు. నేను కొంత ఆ అర్థం తిరిగీ సమకూర్చిపెట్టవచ్చును. మామూలు జనుల అభిప్రాయా లేమిటో కమ్యూనిస్టులకు చెప్తాను. సామాన్య ప్రజల ఏకీకరణంకోసం, కమ్యూనిస్టులు చేస్తూన్న స్వార్థత్యాగాలను సామాన్యప్రజలకు విశదం చేస్తాను.

"లెఫ్ట్‌ఫ్రంట్" పత్రికా సంపాదకుడు చాలా అసంస్కృతంగాఉన్న నా గీతాలను రెంటిని ప్రకటనార్థం తీసుకొన్నాడు. జాన్ కాన్‌రాయ్ నడుపుతున్న ఆన్విల్ పత్రికకు ఆ రెంటిని పంపాడు. "న్యూమాసెస్" అని కొత్తపేరుతో వెలసిన "మాసెస్" పత్రిక కొకటి పంపాడు. నా కింకా సందేహాలు వదల లేదు.

"అది బాగుల్లేదని మీకు తోస్తే పంపించవద్దు" అని అన్నాను.

"ఫరవా లేదు, బాగానే ఉన్నాయి" అన్నాడు.

"నన్ను మీలో కల్పుకోటం కోసమని ఈపని చేస్తున్నారా?" అని అడిగాను.

"కాదు నీ పద్యాలు అసంస్కృతంగానే ఉన్నాయి, కాని మాకు అవే బాగున్నాయి. చూశారా, ఇందులో మేం అంతా కొత్తవాళ్లమే! మేం నీగ్రోలనుగురించి వ్రాస్తాముగాని ఏ నీగ్రోలనూ ఎప్పుడూ చూడము. అందుకని మీ రచనలు మాకు కావాలి" అన్నాడు.

క్లబ్ సమావేశాలలో చాలా వాట్లల్లో పాల్గొన్నాను. వాళ్ళ కృషి కున్న అవకాశమూ కృషిలో నిజాయితీ, నన్ను ముగ్ధుణ్ణి చేశాయి. నిరుద్యోగులైన చిత్రకారులకు వృత్తులు కల్పించవలసిందంటూ క్లబ్ ప్రభుత్వంమీద వత్తిడి తెస్తోంది. లెఫ్ట్‌ఫ్రంట్ పత్రిక ప్రచురణకై చందాలు వసూలు చేస్తూంది. ట్రేడ్ యూనియన్ సమావేశాలకు వందలకొద్దీ ఉపన్యాసకులను పంపిస్తోంది. సభ్యులంతా, దీక్షా, విశ్వాసము, ఋజుత్వము, స్వార్థ త్యాగము, ప్రజా స్వామ్య స్వభావము, కలిగి, ఒళ్లు దాచుకోకుండా, ఉత్సాహంతో నిరంతరం పనిచేసేవారు. నాకు వాళ్లలో నమ్మకం కుదిరింది. కమ్యూనిస్టులు ఎల్లాంటివాళ్లో నీగ్రోలకు చెప్పటం నా బాధ్యతగా స్వీకరించుకొన్నాను. నీగ్రో కమ్యూనిస్టుల జీవితచరిత్రలను వ్రాద్దామని సంకల్పం కల్గింది. నా అభిప్రాయం ఎవళ్లకు చెప్పలేదు. నా ఆశయం ఎంత పసి ఆశయమో నాకు తెలిసిరాలేదు.

## 3

మొదటి కొన్ని క్లబ్బు సమావేశాలకు వెళ్లేటప్పటికే, క్లబ్బులో రెండు ముఠాలున్నాయని వాట్ల మధ్య వైరం రాజుతూ ఉందని నాకు తెలిసి వచ్చింది. ప్రతి సమావేశంలోనూ, చర్చలు చాలా ఉగ్రంగా జరుగుతూ వచ్చాయి. క్లబ్బులో 'చిత్ర

కారులైన కొద్దిమంది సభ్యులముఠా, ఈ క్లబ్బు నాయకత్వమంతా కైవసం చేసుకొని క్లబ్బువిధానా లన్నిటినీ తమకు కావలసినట్లుగా నియమించుకో గలుగుతున్నారు. వామపక్ష మనస్థులయిన, రచయి తలకు ఈ చిత్రకారుల ప్రాబల్యం గిట్టేదికాదు. "లెఫ్ట్ ఫ్రంట్" పత్రికే నా క్లబ్బు అభిమానానికి ముఖ్యకారణమైనందున, నేను కూడా అలాగ్గా రచ యితల పక్షాన్ని చేరిపోయాను.

అంతలో ఒక గమ్మత్తు జరిగింది. లెఫ్ ఫ్రంటు ముఠావారు, క్లబ్బు నాయకులు సభ్యుల కోరికలను ప్రతిబింబించటం లేదంటూ ప్రకటించారు. ఒక ప్రత్యేక సమావేశం ఏర్పరచి, కార్యనిర్వాహక వర్గం మళ్లీ ఎన్నుకోబడాలి అంటూ తీర్మానం ప్రవేశపెట్టారు. ప్రతినిధుల పేర్లు దాఖలు చేసినప్పుడు అందులో నా పేరు కూడా ఇరికించబడ్డది. నేను ప్రతినిధిగా నిలవటానికి ఒప్పుకోలేదు. క్లబ్బు వ్యవహా రాలూ, ఆశయాలూ నాకు ఏమాత్రమూ తెలియవనీ, అందుచేత నా ప్రాతినిధ్యం ఉచితంగాదనీ క్లబ్బు సభ్యు లకు చెప్పాను. రాత్రంతా చర్చలు సాగుతూనే ఉన్నాయి. తెల్లవారగట్ల సభ్యుల ఓట్లు మూజూ వాణీగా చేతు లెత్తించి తీసుకొన్నారు. నా పేరు ఎన్నిక అయింది.

అసలు సంగతి నాకు తర్వాత తెలిసింది. చిత్ర కారులను క్లబ్బు నాయకత్వంనుంచి తప్పించటానికి రచయితలు నన్ను ఉపయోగించ నిశ్చయించు కొన్నారు. నాకు తెలియకుండానే నా సమ్మతిలేకుండానే పార్టీ మెంబర్లకు ఒక నీగ్రోను ఎదురు నిలబెట్టారు. నీగ్రోలను సవర్ణ సమత్వంతో చూడాలనేది, కమ్యూనిజం ముఖ్య సూత్రాలలో ఒకటి. అందుచేత నీగ్రోకు ఓటియ్య కుండా తప్పించుకోవటం పార్టీసభ్యులకు మహాక్లిష్ట మయిపోతుందని తెలిసిన వాళ్ళీ పని చేశారు.

క్లబ్బు నాయకత్వం వహించాక, అసలీ తగాదా స్వభావ మేమిటో నాకు సులభంగా తెలిసి వచ్చింది. కమ్యూనిస్టులు, క్లబ్బులో రహస్యంగా ఒక "పోటీజట్టును" తయారుచేసుకున్నారు. అంటే క్లబ్బు సభ్యులలో కొందరు కమ్యూనిస్టుపార్టీ సభ్యులు. వాళ్లు, క్లబ్బు బయటే కలుసుకొని క్లబ్బు అనుసరించ వలసిన విధానాలన్నీ ముందే తీర్మానించుకొనేవారు. ఆ తర్వాత తమ వాదనల ఉధృతంతో పార్టీ మెంబర్లు కాని సభ్యులను ముంచెత్తి, తమపక్షంగా వోటు చేసే టట్లు చేసుకొనేవారు. స్థానిక కమ్యూనిస్టుపార్టీ అధి కారులు ఈ ముఠాద్వారా, క్లబ్బు సభ్యులను కోరే హిరణ్యాక్షవరా లన్నిటినీ తీర్చేందుకు, కమ్యూని స్టులుకాని సభ్యులకు కంటకంగా ఉండేది.

స్థానిక కమ్యూనిస్టుపార్టీ నాయకులు, పోస్టరు చిత్రకారులు, ఉపన్యాసకులు, నిత్యం కావాలంటూ క్లబ్బును ఎడతెగకుండా కోరుతూండేవారు. పార్టీకి డబ్బుకూడా క్లబ్బే ఎక్కువగా సరఫరా చేయవలసి వచ్చేది. ఇవన్నీ "లెఫ్ట్ ఫ్రంట్" పత్రికమీద దెబ్బ కొట్టూ వచ్చి దాదాపు పత్రికే ఆగిపోవలసిన స్థితిని తెచ్చారు. క్లబ్బులో చేరిన యువక రచయితల్లో చాలామంది తమ రచనలు లెఫ్ట్ ఫ్రంట్‌లో పడతాయి గదా అన్న ఉత్సాహంతోనే చేరారు. కమ్యూనిస్టు పార్టీవారు క్లబ్బులోని తమ ముఠాద్వారా "లెఫ్ట్ ఫ్రంట్" పత్రిక ఆపేయవలెనని తాఖీదు పంపించటం, క్లబ్బు రచయితలు ఎదురుతిరిగి ఆ తీర్మానం తోసి పుచ్చారు. ఇది పార్టీ అధికారానికి ఎదురు తిరగ టంగా సమన్వయించబడ్డది.

క్లబ్ వ్యవహారాలు ఇంకొంచెం పరస్పర సాను కూలతతో జరగాలని పార్టీ మెంబర్లను దీర్ఘంగా బ్రతి మాలాను. క్లబ్బులో ఉభయపక్షాల కోపతాపాలు పెచ్చు పెరిగిపోతున్నాయి. చివరికి లోగుట్టు బయట పడింది. నేను కమ్యూనిస్టుపార్టీ సభ్యుడనయితే తప్ప క్లబ్బు కార్యదర్శిగా ఉండటానికి వీల్లేదని నాకు తెలియపర్చారు. రచయితలు చిత్రకారులు అభివృద్ధి పొందేందుకు అనువైన విధానంలోనే నేనుండగల నన్నాను. నా విధానానికి పార్టీవారు ఒప్పుకున్నారు. కమ్యూనిస్టుపార్టీ సభ్యపత్రంమీద సంతకం పెట్టాను.

ఒకరాత్రి మా క్లబ్బు సమావేశానికి ఒక యూదు యువకుడు వచ్చి, తన పేరు కామ్రేడ్ యంగ్ అనీ డెట్రాయిట్‌నుంచి వచ్చాననీ, తన్ను తను పరి చయంచేసుకొన్నాడు. డెట్రాయిట్—జాన్‌రీడ్— క్లబ్బులో సభ్యుడననీ, చికాగోలో నివసిద్దామని వచ్చాననీ చెప్పాడు. పొట్టి మనిషి. బాగా చదువు కొన్నవాడు. జుట్టు బాగా నల్లగా ఉంది. ముఖం స్నేహపాత్రంగా కనబడుతుంది. కళ్లు ఉబ్బినట్టు

పెద్దవిగా ఉంటాయి. పెదవులు సుద్దగా వేలాడుతున్నట్లుండేవి.

కమ్యూనిస్టుపార్టీవారి ఫర్మానాలను చెల్లించటానికి మాకు తగినంత సంఖ్యాబలం లేకపోవటంవల్ల, వెంటనే అతన్ని ఆహ్వానించాము. కాని నాకు ఆ మనిషి స్వభావము ఎంతకీ సరిగ్గా అర్థమయ్యేది కాదు. ఏ సాధారణప్రశ్న అడిగినా, అతను గుడ్లు మిటకరిస్తూ నత్తినత్తిగా జవాబు చెప్పలేక మొగం తిప్పేసుకొనేవాడు. ఇతని విషయం నిజానిజాలు తేల్చుకునేందుకు కమ్యూనిస్టుపార్టీ కేంద్ర కార్యాలయంవారితో సంప్రదింపులు జరిపి తేల్చుకొని సభ్యుణ్ణిగా చేర్చుకొందామని నిశ్చయించుకొన్నాను. కొంచెం అదోమాదిరి కళాకారుని తిక్క తప్ప, మనిషి నికార్సు అయినవాడే అనుకొన్నాను.

సమావేశానంతరం కామ్రేడ్ యంగ్ నాకొక సమస్య తెచ్చిపెట్టాడు. అతనిదగ్గర డబ్బు లేదు. తాత్కాలికంగా క్లబ్బు ఆవరణలో పడుకోవచ్చునా అని అడిగాడు. విశ్వాసపాత్రుడే అని నమ్మి అందుకు సమ్మతించాను.

యంగ్ అతిశీఘ్రంగా క్లబ్బులో ప్రముఖుడయిపోయాడు. అతనంటే అందరికీ గౌరవాభిమానాలు కలిగాయి. మా గొప్ప చిత్రకారులంతా, అతని చిత్రాలను మెచ్చుకొన్నారు. నాకు మటుకు అవి అర్థమయేవి కావు. కమ్యూనిస్టుపార్టీనుంచి యంగ్ విషయం ఆచోకీ ఏమీ నాకు రాలేదు. కాని యంగ్ చాలా దీక్షతో పనిచేసేవాడుగా కనబడేటప్పటికి, ఆ విషయం ఇంక అంతగా నేను పట్టించుకోలేదు.

ఒకనాడు రాత్రి యంగ్ తన పేరుకూడా ఉపన్యాసకులలో చేర్చమన్నాడు. ఉపన్యాసానికి అతని వంతు వచ్చేటప్పటికి నిలబడి, స్పాన్అనే సభ్యుని మహా విపరీతంగా ఉధృతంగా దుయ్యబట్టడం ప్రారంభించాడు. క్లబ్ చరిత్రలో అంత ఘాటుగా వ్యక్తులను దూషిస్తూ విమర్శించటం ఎప్పుడూ జరిగిఉండలేదు. స్పాన్ మా యువక చిత్రకారులలోకల్లా ప్రముఖుడు. ఆ ఉపన్యాసం వింటూ అందరమూ నిర్ఘాంతపోయి కూర్చున్నాము. స్పాన్ కార్మికులకు విద్రోహి అనీ, పోలీసులతో లాలూచీ అయాడనీ, ట్రాట్స్కీయిస్టు అనీ, బీభత్సంగా యంగ్ నేరారోపణలు సాగించాడు. యంగ్ కమ్యూనిస్టుపార్టీ సభ్యుడనుకొని ఉండటంవల్ల ఇదంతా కమ్యూనిస్టుపార్టీ అభిప్రాయమేగాబోలని వెంటనేక్లబ్ సభ్యులంతా సహజంగా అనుకోవలసివచ్చింది. నేను తెల్లబోయి ఏం చెయ్యటానికీ తోచక, యంగ్ ఆరోపణలను కార్యనిర్వాహకవర్గ సమావేశంలో విచారణ జరిపి నిర్ధారణ చెయ్యాలంటూ ఉపపాదించాను. స్పాన్ న్యాయంగానే అభ్యంతరం చెప్పాడు. తనమీద బహిరంగంగా ఆరోపణ జరిగింది. కాబట్టి విచారణకూడా బహిరంగంగానే జరగాలనీ తాను బహిరంగంగానే జవాబు చెప్పుకొంటాననీ అన్నాడు.

స్పాన్ జవాబు చెప్పుకొనే అవకాశం యియ్యాలని క్లబ్బు సభ్యులు వెంటనే వోటుచేశారు. యంగ్ అభూతకల్పనల కన్నిటికీ స్పాన్ ఖండితంగా జవాబు చెప్పుకొన్నాడు. కాని అతన్ని నమ్మాలో అక్కర్లేదో సభ్యుల కందరికీ సందిగ్ధంగానే మిగిలిపోయింది. స్పాన్ అంటే మా అందరికీ చాలా యిష్టం. అతనిలో ఏ విధమైన అవకతవక ప్రవర్తనా ఉండదని మా కందరికీ నమ్మకమే. కానీ పార్టీని నొప్పించటానికి మే మెవరం సిద్ధంగా లేము. మాటలు మాటలు పెరుగసాగాయి. చివరికి, అంతవరకూ పార్టీ మీది గౌరవంతో మాట్లాడకుండా ఊరుకొన్న ఒక సభ్యుడు లేచి, స్పాన్మీద చేసిన మూర్ఖపుటారోపణల నన్నిటినీ వెంటనే ఉపసంహరించవలసిందిగా, నన్ను సంబోధించి అడిగాడు. నేను మళ్ళీ, కార్యనిర్వాహకవర్గ నిర్ధారణకు విషయం వదుల్దామని మునుపటి సూచనే చేశాను. మళ్ళీ నా సూచన వోటుకు పెత్తే వీగిపోయింది. పార్టీయొక్క ఉద్దేశాలనే సభ్యులు సందేహింప నారంభించారు. పార్టీ సభ్యులే అధిక సంఖ్యగల కార్యనిర్వాహకవర్గానికి ఈవిషయం చర్చకు వదిలితే పార్టీసభ్యుడైన యంగ్ ఆరోపణలను పార్టీ అభిమానంతో వాళ్లుకూడా బలపరిచి నిర్ధారణ చేసితీరుతారేమో ననే క్లబ్బుసభ్యుల భయం.

తరువాత సభ్యులలో కొందరు చేరి నావద్దకు వచ్చి, యంగ్ చేసిన ఆరోపణలతో నాకు యద్విధమైన సంబంధమైనా ఉందా అని అడిగారు. నాకు మనస్సుకు చాలా బాధవేసింది. సిగ్గుతో మొగం చెల్లలేదు...నాకూ యంగ్ కూ ఏ విధమైన సంబంధమూ లేదని నిరాకరించాను. ఈ రభస ఇంతటితో అంతం

చేద్దామని నిశ్చయించుకొని యంగ్‌ను ఒంటరిగా ఒక మూలకు పిలిచి, స్వాన్‌మీద దురారోపణలు చేసేందుకు అతనికి అధికారం ఎవరిచ్చారని నిలదీసి అడిగాను.

"క్లబ్‌ను విద్రోహులనుండి విముక్తం చెయ్యమని నన్ను ఆదేశించారు" అన్నాడు.

"స్వాన్ విద్రోహి కాడే!" అని అన్నాను.

అతని కళ్లు మరీ ఉబ్బిపోతున్నాయి. మొగం అంతా ఉద్రేకంతో వణికిపోతోంది.

"మనలో ప్రక్షాలన జరిగితీరాలి" అని ఉద్రేకంతో అన్నాడు.

అతని విప్లవభక్తిని ఒప్పుకొన్నాను. కాని మరీ మితిమీరి ఉద్రేకం చూపిస్తున్నాడేమో అనిపించింది. పరిస్థితి మరీ అధ్వాన్నంగా తయారయింది. కొందరు సభ్యులు నా దగ్గరకు రాయబారం వచ్చి స్వాన్‌మీది దురారోపణలు ఉపసంహరించుకొంటే తప్ప తము క్లబ్బునుంచి మొత్తంగా రాజీనామా చేస్తామని భీష్మించుకు కూర్చున్నారు. నాకు వెఱ్ఱెత్తిపోయింది. వెంటనే కమ్యూనిస్టుపార్టీకి, స్వాన్‌ను శిక్షించవలసిందిగా ఆజ్ఞ ఎందుకిచ్చారో తెలుపవలసిందని వ్రాశాను. అట్లాంటి ఆజ్ఞ ఏమీ ఇయ్యలేదని జవాబు వచ్చింది. మరయితే యంగ్, ఈ ధోరణి, ఏమిటి? అతన్ని రెచ్చగొట్టున్నవారెవరు? చివరికి ఈ విషయం కమ్యూనిస్టుపార్టీ నాయకులముందు పెడ్దామని క్లబ్బువాళ్లందరినీ బ్రతిమాలాను. పెద్ద రగడ జరిగాక చివరికి క్లబ్బువారు ఎల్లాగో ఒప్పుకొన్నారు.

ఒకరాత్రి పార్టీనాయకుని ఒకరింట, స్వాన్ మీది నేరారోపణలను యంగ్ మళ్లీ వినిపించగలందుకై మాలో పదిమంది అక్కడ సమావేశమయ్యాము. పార్టీ నాయకుడు, దూరస్థంగా తమాషా చూస్తున్నట్లు కూర్చున్నాడు. యంగ్ ప్రారంభించాడు. ఒక చుట్ట చుట్టిన పెద్ద కాగితం విప్పాడు. ఒకటి తర్వాత ఒకటి స్వాన్‌మీద రాజకీయ నేరాలు ఆరోపిస్తూ చదువుకుపోతున్నాడు. యంగ్ ఏదో పెద్ద పొరపాటులో పడ్డాడనుకొంటూ అతనివంక తెల్లబోయి చూస్తూ కూర్చున్నాను. కాని పెద్ద నాయకుల అనుజ్ఞ ఉందని అతనే చెప్పిఉండటంతో అతనంటే భయంకూడా వేసింది.

యంగ్ చదవటం పూర్తిఅవగానే పార్టీ నాయకుడు, "ఈ ఆరోపణలు నన్ను కాస్త చదవనిస్తారా" అని అడిగాడు.

యంగ్ వెంటనే ఒక కాపీ నాయకుని చేతికిచ్చాడు. "అది మీాదగ్గిర ఉంచుకోవచ్చు. నాదగ్గిర ఇంకా పది కార్బన్‌కాపీలు ఉన్నాయి" అన్నాడు.

"ఇన్ని కార్బనుకాపీలు ఎందుకు తయారుచేశారు?"

"ఎవళ్లూ ఎత్తుకుపోకుండా జాగ్రత్తపడ్డాను" అన్నాడు యంగ్.

"ఈ మనిషి చేసిన నేరారోపణలను, నిజమని విచారించసాగారంటే, నేను నా సభ్యత్వానికి రాజీనామా ఇచ్చి, ఈ క్లబ్ కుళ్లుఅంతా బట్టబయలు చేస్తాను" అన్నాడు స్వాన్.

"ద్రూశారా! పోలీసుల మనిషీ!" అంటూ యంగ్ అరిచాడు.

నాకు వికారమెత్తింది. పార్టీ నాయకుడు, తను ఆ ఆరోపణలన్నీ జాగ్రత్తగా చదువుతాననీ, అసలు విచారణకు అర్హమవునోకాదో, స్వాన్‌ను విచారణ చెయ్యవలసిన అవసరముందో లేదో నిర్ణయిస్తాననీ, హామీ ఇచ్చి సమావేశం ముగించాడు.

ఏదో తమాషా జరుగుతూందని నాకు నమ్మకమే. కాని అది ఏమిటో నాకూ అర్థం కావటం లేదు.

ఒకనాడు మధ్యాహ్నం యంగ్‌తో వివరంగా మాట్లాడి చూద్దామని క్లబ్‌కు వెళ్లాను. కాని నే వెళ్లేటప్పటికే అతనక్కడ లేడు. మర్నాడూ రాలేదు. వారం రోజులు చూశాను. మనిషి కనబడలేదు. క్లబ్ సభ్యులు యంగ్‌విషయం నన్ను అడగటం మొదలెట్టారు. నాకు తెలియదంటే నమ్మే స్థితిలో లేరు. జబ్బుగా ఉన్నాడా? పోలీసులు పట్టుకొన్నారా?

చివరికి ఒక మధ్యాహ్నం కామ్రేడ్ గ్రిమ్మ్, నేనూ కలిసి, క్లబ్ గదిలోకి పోయి, యంగ్ పెట్టె తెరిచాము. అందులో వస్తువులు చూస్తే మాకు మరీ అగమ్యగోచరంగా ఉంది. ఒక పెద్ద కాగితంబుట్ట ఒకటి ఉంది. చిన్నిచిన్ని పేజీలు చింపి ఒకదానికొకటి అంటించి, ఒక ఇరవైగజాల పొడుగు కాగితం తయారయి, చుట్టగా చుట్ట చుట్టిఉంది. మానవజాతి

చరిత్రంతా, మార్క్సిస్టుదృక్పథంలో వరుసగా బొమ్మలుగా గీసిఉన్నాయి అందులో. మొదటి పుట మీద, "మానవుని ఆర్థికాభ్యుదయ చిత్ర స్వరూపము" అని వ్రాసిఉంది.

"ఇతనికి పెద్దపెద్ద ఆశయాలే ఉన్నాయే" అన్నాను.

"చాలా చదువుశ్రద్ధ ఉన్నవాడే" అన్నాడు కామ్రేడ్ గ్రిమ్.

చిత్రాలమధ్య పెద్దపెద్ద విమర్శలు, సాఫీ దస్తూరిలో వ్రాసిఉన్నాయి. కొన్ని రాజకీయ విషయాలు. కొన్ని చిత్రకళచరిత్రను గురించినవి. చివరికి డెట్రాయిట్ తిరుగు చిరునామాతో ఉన్న ఒక ఉత్తరం మాకు దొరికింది. వెంటనే మా మహాసభ్యుని ఆచూకీ తెలుపవలసిందని ఆ చిరునామాకు ఉత్తరం వ్రాశాను. కొద్దిరోజుల్లో జవాబు వచ్చింది. అందులో భాగం.

"అయ్యా,

మీరు వ్రాసిన ఉత్తరం అందినది. మిస్టర్ యంగ్, మా పిచ్చిఆస్పత్రిలో రోగిగా ఉంటూండే వాడు. కొన్ని నెల్లక్రిందట మా అజమాయిషీనుంచి తప్పించుకొని పారిపోయాడు. ఈమధ్య మళ్లీ పట్టుబడి, మా ఆస్పత్రికి చేరాడు. పిచ్చి కుదరటానికి వైద్యం చేస్తున్నాము."

పిడుగు దెబ్బ తిన్నట్టయిపోయాను.

ఇది నిజమా? నిస్సందేహంగా నిజమే! అయితే, ఒక పిచ్చివాడు అనర్గళంగా ప్రవేశించి వ్యవహారకాండంతా నడిపించేయగల మా క్లబ్బు ఎలాంటి క్లబ్బైఉండాలి? పిచ్చివాడిని కనిపెట్టలేనంతగా మేమూ పిచ్చివాళ్లమే ఐపోయామా— పిచ్చివాడిని చూసి గ్రహించలేమన్న మాట.

స్పాన్‌మీది ఆరోపణలను వెంటనే వదిలివేయవలసిందని తీర్మానం ఉపపాదించాను. తీర్మానం ఒప్పుకొన్నారు. స్పాన్‌కు క్షమాపణ చెప్పుకొన్నాను. కాని చికాగో జాన్‌రీడ్ క్లబ్ నాయకునిగా, కొంచెం ఒళ్లు తెలుసుకొని నిదానం ఏర్పరచుకొన్న కమ్యూనిస్టు నయాను.

## ౪

జాన్‌రీడ్‌క్లబ్‌లోని కమ్యూనిస్టు ముఠావారు, నా పార్టీ సెల్—'యూనిట్' అనేవారు—వారిని, "క్లబ్‌లో నాకు పూర్తిపని గల్పించమని" అడగవలసిందిగా పురమాయించారు. నేను చేసే పనులు, వ్రాతలు, నిర్మాణకృషి, ఉపన్యాసాలు, ఇత్యాది వ్యాసంగికాలన్నీ నివేదిక తయారుచేసి 'యూనిట్' వారికి సమర్పించమన్నారు.

కమ్యూనిస్టులందరికీ, 'యూనిట్'లో సభ్యత్వం విధాయకం. 'యూనిట్'పార్టీనిర్మాణానికి పునాదిరాయి. యూనిట్ సమావేశాలు, ప్రత్యేకనివాసములలో రహస్యంగా జరిగేవి. పోలీసుదాడులు జరుగుతాయేమో నన్న భయం చేత ఈ సమావేశాలలో రాజద్రోహకర విషయాలేమీ ఉండవు. కాని ఒకసారి కమ్యూనిస్టుఅయాక, పోలీసువాళ్లు ఆరాలోకి వచ్చేందుకు కమ్యూనిస్టు అవటాన్నిమించి ఏ మహాపాపమూ చేయనే అక్కర్లేదు.

నా యూనిట్‌సమావేశానికి నేను మొట్టమొదటిసారి వెళ్లినపుడు, సమావేశం 'దక్షిణపుపేట'లో 'నల్లవాళ్లకోవ'లో జరిగింది. అక్కడి నీగ్రో సంచాలకునికి నన్ను నేను ఎరుకపరుచుకొన్నాను.

"స్వాగతం, కామ్రేడ్. మాలోకి ఒక రచయిత వచ్చాడని మాకు సంతోషంగా ఉంది" అంటూ ఇకిలిస్తూ అన్నాడు.

"నేను ఏమంత రచయితను గాను" అన్నాను.

సమావేశం ప్రారంభమయ్యింది. దాదాపు ఇరవైమంది నీగ్రోలదాకా కూర్చునిఉన్నారు. నా నివేదిక చదివే తరుణం వచ్చింది. సూచనలకు వ్రాసుకొన్న కాగితాలు చేతబట్టి, నేను ఎల్లా పార్టీలో చేరిందీ, నేను ప్రచురించిన కొద్ది రచనలూ, జాన్‌రీడ్ క్లబ్‌లో నా విధ్యుక్తకార్యాలూ, అన్నీ వరుసగా చెప్పుకొనివచ్చాను. ఉపన్యాసం ముగించి, వాళ్ల అభిప్రాయాలకోసం ఎదురుచూస్తూ నిలుచున్నాను. ఎవ్వరూ మాట్లాడలేదు. చుట్టూ కలయచూశాను. కామ్రేడులలో చాలామంది తలలు వంచుకొని కూర్చు

న్నారు. ఒక నీగ్రో యువతి నవ్వు బిగపట్టుకొంటూ న్నట్టుగా పెదవులు చాలించటం చూశాను.

నిమిషాలు గడిచిపోయాయి. ఆ నీగ్రో యువతి తల ఎత్తి సంచాలకునివంక చూసింది. అతను చిరునవ్వును అణగద్రొక్కుకొంటున్నాడు. ఆ యువతి నవ్వు ఆపుకోలేకపోయింది. చేతులతో మొగం మూసుకొంటూ ఒళ్లోకి తలవాల్చుకొని తెరలు తెరలుగా నవ్వసాగింది. నేను తెల్లబోయాను. నేను నవ్వువచ్చే మాట ఏం అన్నాను?

"ఏమిటి, విషయం?" అని అడిగాను.

అందరూ నవ్వులు ఒలకపోస్తున్నారు. సంచాలకుడు పెన్సిల్ తిప్పుతూ కూర్చున్నాడు. తల ఎత్తాడు.

"అబ్బే, ఏం లేదు, కామ్రేడ్! మాలో రచయిత చేరినందుకు ఆనందంగా ఉంది" అన్నాడు.

ఇంకా నవ్వులు. మరింతగా బిగబట్టుకోటానికి నొక్కులు. నేను చాలా శ్రద్ధతో నా నివేదిక తయారుచేశాను. వాళ్లు యికయికలు పకపకలు వెలువరిస్తున్నారు. కొంచెం బెరుకుగా "నాకు చేతైనంత బాగానూ చేశాను. వ్రాతకోతలు ప్రాథమికమూ, ప్రముఖమూ గావని నేనూ గ్రహిస్తున్నాను. కాని కొంత అవకాశము ఇస్తే నాకు అనువైన కృషి నేనూ సమర్పించుకొంటాను" అన్నాను.

"నువ్వు చెయ్యగలవని మాకు తెలుసును కామ్రేడ్" అన్నాడు నీగ్రో సంచాలకుడు.

అతని కంఠము, దక్షిణాది తెల్లవానికన్నా, దయదలుస్తూన్న పెద్దరికం ధ్వనించింది. నాకు కోపం వచ్చింది. ఈ జనాన్ని నేను అర్థంచేసుకొన్నా ననుకొన్నాను. కాని చేసుకోలేదని తెల్లమయింది. వాళ్ల పద్ధతి చూస్తే మండుకొచ్చింది. తగాదా పెట్టుకొందా మనుకొన్నాను. కాని జాగ్రత్తపడి నిదానించాను, ముందు ఇతరులతో సంప్రదించి చూద్దా మనుకొన్నాను.

ఆ తర్వాతరోజుల్లో, జాగ్రత్తగా ఆరాలు తీసుకొంటూ రాగా, మా నల్ల కమ్యూనిస్టులకు నేనొక వింత మృగంగా కనిపించానని తేలింది. వీధిబడి చదువైనా పూర్తిచేయని నేను వాళ్ల దృష్టిలో 'పండితుల' లెఖ్ఖలో జమకు వచ్చానని విని అదిరిపోయాను. పండితు డంటే ఏమిటి? నా విషయంగా వాళ్లు అర్థం చేసిన పద్ధతిని ఆ మాటకు అన్వయం నేను అంతకుముం దెప్పుడూ విని ఉండలేదు. ఇంకా నాకు సరిగ్గా రాజకీయజ్ఞానము లేదన్న మిషమీద నన్ను నిరాకరిస్తారేమో ననుకొన్నాను. ప్రవర్తనా, అవీ, ఇంకా సరిగ్గా తెలిసికోవాలని అభ్యంతరపెట్టారేమో ననుకొన్నాను. ఏదీ లేదు. నన్ను చూసి పకపకా నవ్వేశారు.

నేను వేసికొన్న ఇస్త్రీచొక్కా, తళతళలాడుతున్న జోళ్లు, అందమైన నెక్టై, వీట్లన్నిటి విషయం, మా యూనిట్ నల్లకమ్యూనిస్టులు, ఆడిపోసికొన్నారని విని నిస్పృహుడనైపోయాను. అన్నిటికన్నా నా వాగ్ధోరణే వాళ్లకు మరీ విజాతీయంగా కనిపించింది.

"కేవలం పుస్తకంలోలాగా మాట్లాడతాడని ఒక నీగ్రో కామ్రేడ్ నన్ను గురించి విమర్శించాడు. నన్ను శాశ్వతంగా "బూర్జువా" అని నిరసించేందుకు ఆ ఒక్కటే చాలును.

౫

నా పార్టీ వ్యాసంగాలలో 'రాస్' అనే నీగ్రో కమ్యూనిస్టుతో పరిచయం కల్గింది. "రాస్" బజారుగుంపును మాటలతో రెచ్చగొట్టి తిరుగుబాటులు లేవదీయటంలో సమర్థుడు. దక్షిణాదిని జన్మించాడు. ఉత్తరదేశానికి వలస వచ్చేశాడు. పట్టణ జీవనంలో పల్లెటి వ్యక్తి అవ్యక్తపు ఆశలన్నీ విఫలమయిపోయిన జీవితం ప్రతిబింబం, రాస్ జీవితం. అపనమ్మకస్తుడు. ఆ అపనమ్మకాలతో కజ్జాకే ముందు కాలు దువ్వేవాడు. రెండు సాంఘిక వ్యవస్థల నడమధ్యంలో, ఒక సంస్కృతి తుదిఅంచుల వేలాడుతున్న వ్యక్తిలో ఉండే సుగుణ దుర్గుణాలు, సత్యాలు, నీరసాలూ, అన్నీ అతనిలో పుట్టగట్టుకొని మూర్తీభవించాయి. అతని జీవితం గనుక సరిగ్గా వ్రాయగలిగితే, పల్లెటి వ్యక్తి పట్టణ వాతావరణంలో, అమిరేందుకైన ప్రయత్నంలో, నైజతః అనుభవించాల్సిన బాధలు, కష్టాలు, ఎదుర్కొనవలసిన వైపరీత్యాలు అన్ని స్ఫుటంగా వెలువర్చవచ్చునని నా కనిపించింది. అతని జీవితం అతనికి అర్థమైనదానికన్న ఎక్కువగా ఇతరులకు అర్థమయేటట్టు చేయగల ననిపించింది.

రాస్‌ను కలుసుకొని నా ఉద్దేశం వెలువర్చాను. తన యింటికి రమ్మని పిలుచుకెళ్ళాడు. తన భార్య (యూదుయువతి)నీ, పిల్లవాడినీ, తన స్నేహితులనీ అందరినీ చూపించాడు. రాస్‌తో, కొన్ని గంటలసేపు మాట్లాడాను. నా ప్రయోజనం ఏమిటో తెలువరుస్తూ, అతనికి బైటపడటానికి ఇష్టంలేని సంగతు లేవీ తెలుపవద్దని మరీ మరీ హెచ్చరిక చేశాను.

"నువ్వు కమ్యూనిస్టు వెందుకయావో, ఆ పరిస్థితులూ విశేషాలూ నాకు కావలసినవి" అని చెప్పాను.

'రాస్' జీవిత విషయాలను నేను వ్రాసుకొంటున్నానని కమ్యూనిస్టుపార్టీ అంతకూ కబురు పాకిపోయింది. విపరీతాలు జరుగ నారంభించాయి. శాంతుడైన ఒక నీగ్రో కమ్యూనిస్టు ఒక రాత్రి మాయింటికి వచ్చి నాతో రహస్యంగా మాట్లాడాలని వీథిలోకి పిలచాడు. నా భవిష్యత్తు జోస్యం చెపుతూ నన్ను భయపెట్టాడు.

"వైట్, పండితులు కమ్యూనిస్టుపార్టీలో ఇముడలేరు" అని గంభీరంగా చెప్పాడు.

"నేను పండితుడను (*Intellectual*) కానే. వీధుల్లో పాకీవృత్తిమీద బ్రతుకుతున్నానే" అని అడ్డు చెప్పాను. అంతకుముందే వారానికి పదమూడు డాలర్ల మీద వీధులూడ్చే ఉద్యోగం ఒకటి, రిలీఫ్ సిస్టమ్, పుణ్యాన దొరికింది.

"దానికీ, దీనికీ సంబంధం లేదు. అంతమాత్రాన మారేదేమీ లేదు. గత దినాల్లో 'పండితుల' వల్ల మాకు వచ్చిన ఇబ్బందులన్నీ మాదగ్గిర చిట్టా కెక్కి ఉన్నాయి. వాళ్లలో నూటికి పదముగ్గురు మాత్రమే పార్టీలో నిలవగలరని అంచనాకు వచ్చింది."

"పోనీ అంతగా "పండితుణ్ణే" అంటున్నావు కాబట్టి పండితుణ్ణే అనుకొందాము. అయితే వాళ్ళెందుకు పార్టీలో నిలవరో చెప్తావా?"

"చాలామంది వాళ్లంతట వాళ్లే వెళ్లిపోతారు"

"మరి నాఅంతట నేను వెళ్లటం లేదే."

"కొందరిని వెళ్ళగొట్టారు" అని తీవ్రంగా అంటూ సూచన అందిచ్చాడు.

"దేనికి?"

"మామూలు పార్టీవిధానాలకు వ్యతిరేకంగా నడిచినందుకు"

"కాని పార్టీ ఏ విషయానికీ నేను ఎదురు తిరగలేదు"

"ముందు నీ విప్లవభక్తిని రుజువుచేసుకోవాలి"

"ఏ విధంగా?"

"వ్యక్తులను పరీక్షించేందుకు పార్టీకి ఒక పద్ధతి ఉంది."

"అల్లాగా! అయితే అది ఏమిటో చెప్పు"

"ఇరాన్స్ నెరుగుదువా—" అంటూ స్థానిక నీగ్రో కమ్యూనిస్టు వీరుని పేరెత్తాడు.

"చూశాను. కలుసుకొన్నాను కూడా."

"అతనికి గాయాలు తగిలాయని గమనించావా?"

"చూశాను. తలకు కట్టు కట్టుకొని కనపడ్డాడు."

"విప్లవ ప్రదర్శనంలో పోలీసుల చేతిలో అతనికా గాయాలు తగిలాయి. విప్లవభక్తికి అదే నిదర్శనం" అన్నాడు.

"అంటే నేనుకూడా వెళ్లి పోలీసులచేత తల పగలగొట్టించుకువస్తేనే గాని, నా నిజాయితీ నిరూపించుకోలేనా, నీ సూచన?"

"నే నేం సూచించటంలేదు. విషయం తెలియబరుస్తున్నాను."

"ఒక విషయం చూడు. పోలీసు నా తలమీద లాఠీతో కొట్టాడనుకో. నాకు మెదడు కమిలిపోతుందనుకో. అంతతో పిచ్చి ఎత్తుతుంది. అతర్వాత వ్రాయగలనా? నే నేం నిరూపించినట్టు".

"అతను తల పంకించాడు. "సోవియట్ యూనియన్ అనేకమంది పండితులను తుపాకివాత వెయ్యవలసి వచ్చింది" అన్నాడు.

"అరి భగవాన్! నువ్వు ఏమంటున్నావో నీకు తెలుసా? నువ్వు రష్యాలో లేవు. చికాగో వీధుల్లో, పేవ్‌మెంటుమీద ఉన్నావు. ఏదో కలగంటున్న వాడిలాగా మాట్లాడుతా వేమిటి?" అన్నాను.

"ట్రాట్స్కీని గురించి వినిఉంటావు. విన్నావు కాదూ?"

"ఆ!"

"అతని కేం జరిగిందో తెలుసునా?"

"సోవియట్ యూనియన్‌నుంచి వెడల నడి పారు" అన్నాను.

"ఎందుకో తెలుసా?"

రాజకీయాలలో నా కంత ప్రవేశం లేదు. సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీతో ట్రాట్స్కీ కున్న తగాదాలో వివరాలూ విశేషాలూ నే నంతగా చదివిఉండలేదు. నా అజ్ఞానం బైటపడకుండా సంకోచిస్తూ నీళ్లు నమిలాను.

"అదే. పార్టీ ఒక నిర్ణయం తీసుకొన్నాక ఆ నిర్ణయానికి ఎదురుతిరిగి పార్టీని ప్రతిఘటిస్తూ, ఉద్యమం లేవదీయటంవల్ల" అన్నాను.

"విప్లవ వ్యతిరేకచర్యలకు" అంటూ ఛర్రున అన్నాడు అతను. ట్రాట్స్కీ ఖండనంలో, రావలసిన తీవ్రతగాని అనూచానమైన భాషగాని మాటల్లో ఒదిగి రాలేదని తర్వాత తర్వాత నాకు తెలిసి వచ్చింది.

"నువ్వు చెప్పేది అర్థమయింది. కాని నే నెప్పుడూ ట్రాట్స్కీని చదవలేదు. మైనారిటీల విషయంలో ట్రాట్స్కీ పంథా ఏమిటి?" అని అడిగాను.

"నన్నడుగుతా వేం? నే నెప్పుడూ ట్రాట్స్కీ రచనలు చదవను"

"మాను. ఒకవేళ నేను "ట్రాట్స్కీ"ని చదువుతూండగా చూస్తావనుకో. ఏ మనుకొంటావు?"

అతను చిరాకుతో "కామ్రేడ్ నువ్వు అర్థం చేసుకోటం లేదు" అన్నాడు.

అంతతో సంభాషణ ముగిసింది. కాని "కామ్రేడ్, నీవు అర్థంచేసుకోటం లేదు" అన్న వాక్యం నేను వినటం అది చివరిసారిమాత్రం కాదు. నాలో ఏమైనా తప్పభిప్రాయా లున్నట్లు నాకు తెలియనే తెలియటం లేదు. ట్రాట్స్కీ రచనలు ఒక్కటి కూడా నేను చదవలేదు. అసలు నిజానికి నా చదువు తద్వ్యతిరేకంగానే ఉంది. నన్ను గాఢంగా ఆకర్షించింది స్టాలిన్ వ్రాసిన "నేషనల్ అండ్ కలోనియల్ క్వొశ్చన్సు" అన్న గ్రంథమే.

సోవియట్ యూనియన్‌లో జరిగిన పురోభివృద్ధులలోకల్లా, లెఖ్ఖకు మించిన వెనుకబడ్డ జాతుల నన్నింటినీ, మహాజాతీయ చైతన్యంతో ఒక త్రాటి మీదకు తెచ్చి, ఏకీకరణ మొనర్చటమే నన్ను విస్మయ విమోహితుణ్ణి చేసింది. జారుల పరిపాలనలో శతాబ్దాల తరబడి నలిగిపోయిన జాతులకోసం కమ్యూనిస్టులు, రష్యా మహా ఖండం దశదిశలకూ, నిపుణులను పంపించి, ఆయా జాతుల అవ్యక్త భాషాస్వరూపాలకు, రూపురేఖలు దిద్దించారని చదివి విభ్రమాశ్చర్యాలలో మునిగిపోయాను. ఈ భాషానిపుణులు, ఈమూగ జనాని కందరకూ, ఒక భాష సమకూర్చి పెట్టి, పత్రికలు, సంస్థలు ఏర్పరిచారని చదవటంతో నా హృదయం మొదటిసారిగా ఉద్విగ్నమైపోయింది. ఈ విస్మృతజనానీకా న్నందరినీ, తమతమ సంస్కృతులను భద్రంగా కాపాడుకోవలసిందనీ, తమ పూర్వ పద్ధతులలో, నవీనంగా కనిపించే ఉత్తమ విధానాలకన్నా, ఉత్తమమైనవి, గాఢమైనవి, ఏవేవి కలవో పరిశీలించుకొని అనుసరించుకోవలసిందనీ పదే పదే హెచ్చరిస్తూనచ్చారని చదివినాను. అమెరికాలో నీగ్రోలను చూసి వెక్కిరించే విధానానికీ దీనికీ ఎంత తేడా ఉందో అని నాలో నేను ఆదరంతో అనుకోసాగాను.

అట్లాంటిది, ఇప్పు డీ నీగ్రో కమ్యూనిస్టు నన్ను 'ఖబర్దార్' అని హెచ్చరించటంలో అర్థ మేమిటి? నీగ్రోజీవితంలోని శారీరక మానసిక క్లేశావస్థలను, ఈ నిరాకృతప్రజలలో అంతర్గర్భితంగా ఉన్న గాంభీర్యాన్ని—పర్వతాలు, నదులు, ప్రపంచము, మానవుడు, వీటిఅంతటి పౌరాతన్యం కలిగిన, అమెరికన్ నీగ్రో దారిద్ర్యంలోని నిత్య జీవితనాటకవిశేషాన్ని, వ్యక్తపరుప దలచుకొన్నందుకేనా, నేను అపనమ్మకస్తుడ నయిపోయింది? నీగ్రోల బాధలకు, తక్కిన పతితప్రజల బాధలకు ఉన్న సామ్యం, సామీప్యం, చూపించటంలో ఉన్న అపాయం ఏమిటి?

(హామిష్ హామిల్టన్ అండ్ కంపెనీ; బ్రిటిష్ ఇన్ఫర్మేషన్ సర్వీసులసౌజన్యంతో)

---

కథానిక:

# రాజులు



శ్రీ పైడిమఱ్ఱి వెంకటసుబ్బారావు

'బియ్యంలో పోసెయ్యడానికి ఎవరూ రాలేదు అక్కయ్యా! ఎంతకూలి యిస్తానన్నా గానీ" అన్నది సుశీల దిగులు పడుతూ పొరుగింటి సీతమ్మతో.

'రాజుల్ని పిలవక పోయావా?' అన్నది సీతమ్మ.

'ఔనుగదూ!' అంటూ మరచిన పాఠాన్ని జ్ఞాపకం తెచ్చుకొన్న విద్యార్థిలాగా సుశీల యింటి వెలుపలకు వచ్చింది.

'రాజులూ! ఓ రాజులూ' అని కేక పెట్టింది.

పదినిముషాలు కాలేదు. సుశీల వాకిట్లోనే నిల్చుండి ఎదురు చూస్తున్నది. పొడుగాటి నల్లటి శరీరం. పెరిగి నెరసిదుమ్ము పట్టిన తలా, గడ్డం. చింపులు వ్రేలాడుతూ ఉన్న మొలకు కట్టిన గుడ్డ. లెక్కలేని ఛిద్రాలతో లోపల ఉన్న శరీరాన్ని కనిపింపజేసున్న కప్పుకున్న అంగవస్త్రం. నేలకు చూస్తూ అడుగడుగూ యెత్తి పెడుతూ ఆముదుసలి కంకాళం వచ్చి నిల్చున్నది చేతిలోని చిప్పతో.

'ఏం. ఒరే, పిలిస్తే వినబడలేదూ? ఒరే!... రాజులూ! బియ్యం పోసెయ్యాలి. రా! లోపలికి' అన్నది సుశీల యింట్లోకి పోతూ. మారు మాట్లాడకుండా రాజులు తలవంచుకొని ఆమె వెంట వెళ్లాడు. మెరికెలతో ఉన్న ముడిబియ్యం రోటిలో పోసింది సుశీల. రాజులు చేతిలోని బొచ్చెదూరంగా పెట్టాడు. సుశీల రాజులు యిద్దరూ కలిసి దంచారు కొంచెంసేపు. సుశీల పోటుపడుతూన్న బియ్యం చేటలో పోసి చెరిగి తవుడు వేరేతీసి, జల్లెడతో తిప్పి నూకలు బియ్యం, మెదుగని మెరికలు వేరు చేస్తూ ఉన్నది. రాజులు మెరికలు దంచి పోస్తున్నాడు. ఆమె చేటలో పోసి చెరిగి బియ్యం కొడుతూ సన్న నూకలు తీసి, చేస్తూ రాళ్లు, నూకలు బియ్యం వేరుచేసి, చివరకు యిసుక రాళ్లతో మిగిలిన బియ్యపు నూకలను పోటు వేస్తే రాళ్లు ఏరుతూ కూర్చున్నాడు రాజులు. మొత్తం బియ్యం, మళ్ళీ ఒకసారి రోట్లో పోసి యిద్దరూ కలిసి పండ్లనీడలు కనబడేలాగు పోట్లు వేశారు. పూట అంతా అక్కడే గడిచింది.

సుశీల, రాజులు బొచ్చెలో పట్టెడన్నం, ఒక రొట్టెతుంప, పప్పుకూర, పచ్చడితెచ్చి పడవేసింది. రాజులు అక్కడే కూర్చుని తిన్నగా ఆరొట్టెముక్క తిన్నాడు. కొంచెము అన్నము మిగిలించుకొని బొచ్చె చంకన పెట్టుకొని బయలుదేరాడు నిర్ణయములేని తన తావుకు.

'ఉడుకన్నం వండి నాక పెడతారా రాత్రికి రాజులూ! అప్పలు మడిలో ఉన్నవి. కొంచెము తాళు కోయిస్తా' అన్నది సుశీల పోతున్న రాజులును ఆపి.

'వద్దులే బ్రాహ్మణమ్మ! ఇప్పటికి చాలు. రేపు యిత్తువులే.' అంటూ నిలువకుండా వెళ్లాడు రాజులు.

## 2

'గాలమ్మయింట్లో పసులదగ్గర పేడకళ్ళు తీసి రావాలి' అంటూ రాజులు ఆ సంసార్లయింట్లోకి పోయాడు.

'రాజులూ! రాజులూ!' అంటూ కేకలు పెడుతూ తిరుగుతున్నారు కొంచెము పెద్దపిల్లలు.

'బూచీ బూచీ' అని దూరంగా పరుగెత్తుతున్నారు చిన్నపిల్లలు.

'పాడిపంటలు మాకు భగవంతుడిస్తాడు.
వానిదయ ఉంటేను లోపమేమీలేదు,

బీదసాద మాకు సోదరీ సోదరులు.

పెట్టిపోతలు మాకు విడిపోని ధర్మాలు

లేదులేదను మాట లేదు మామాటల్లో..." అని పాడుతూఉన్న పెద్దమ్మాయి పాట చాలించి, 'అమ్మా! రాజులు వచ్చాడు' అని అరచింది.

'రాజులూ! రాత్రి అన్నానికి రాలేదేం?" అడిగింది గాలమ్మ.

'బ్రాహ్మణమ్మ గారింట్లో పెట్టారు... చీపురు యియ్యా' అని చీపురు పుచ్చుకొని దొడ్డి చిమ్మేశాడు, పేడకళ్లు తీశాడు.

'రాజులూ! పొయ్యిలో కట్టెలు ఇల్లా తెచ్చి పెట్టు' అన్నది గాలమ్మ. రాజులు మాట్లాడకుండా కట్టెలు తెచ్చి వేశాడు.

'మళ్ళీరా రాజులూ! అన్నం పెడతా!' అన్నది గాలమ్మ. రాజులు మాట్లాడకుండా వెళ్ళుతున్నాడు.

'ఎక్కడికి రాజులూ!' అన్నది గాలమ్మ.

'లక్ష్మమ్మ గారింటికి'

'మళ్ళీరా! అన్నం పెడతా! రాకపోయేవ్!'

జవాబులేదు. వెళ్ళాడు.

### 3

రాధాయమ్మ యింట్లో భోజనాలు జరిగినవి. నారాయణమ్మ తప్ప అంతా వెళ్ళారు. లోకాభి రామాయణం మొదలయింది గృహచ్ఛిద్రాలతో.

'ఏమే అక్కయ్యా! ఊళ్ళో యెట్లున్నదే! పేరమ్మగారి పిల్లాడిస్థితి ఏమనుకుంటున్నారే!' అన్నది రాధాయమ్మ.

'ఏమనుకుంటున్నా రక్కయ్యా!' నిన్న తెల్లవారుజామున నాలుగటూ రెండిటూ వెళ్లాయి. కళ్లు పెకెతల కీడ్చుకపోయాయి. మంచము పట్టాడు. రెండుగంటలకింద గొల్లుమన్నట్లున్నారు' అన్నది నారాయణమ్మ.

'అందరూ వెళ్లిపోతున్నారు. మేము వెళ్లుదా మంటే ముసలమ్మ మంచం పట్టింది. కాలు పెకలడం లేదు.'

'మేమూ వెళ్లుదామనుకుంటే మా నాన్న ఊరి కెళ్ళి వారంరోజులైనది. రాలేదు. ఎట్లా ఉండాలబ్బా!'

'ఇంట్లో పదిమంది ఉన్నవాళ్లకేం తెలియదు కాని ఒంటరిగా ఉన్నవాళ్లకు కష్టమేనమ్మా!'

'పాపము రాజులు అయినయిల్లు, కాని యిల్లు అనకుండా తిరుగుతాడు. ఈరోజులలో వాడికి కష్టమే అక్కయ్యా!

'ఏమో? ఈరోజు వాడు కనబడనేలేదు.'

'మాఅమ్మ అన్నానికి వస్తాడేమోనని ఎదురు చూసింది. వాడికి సుస్తీగా ఉన్నదని యెవరో చెప్పి నట్లున్నారు.'

'ఈరోజులలో యేసుస్తీ అయినా అదే అంటారు. దగ్గరికైనా పోరు.'

'ఎట్లా ఉందో తెలుసుకోవా లక్కయ్యా! వాడిని అడిగే వాళ్లెవరు? ఏంసుస్తీచేసిందో చూచి వత్తాం?"

'సరే, అక్కడికి వెళ్లివత్తాం, ఏం ఫరవాలేదు. చెపుతున్నాడు, అక్కయ్యా! మళ్ళీ వస్తా' అంటూ నారాయణమ్మ తనయింటికి బయలుదేరింది.

'రాజులుకు జావపోస్తే బాగుంటుంది. దప్పికంటున్నాడు. మంచినీళ్ళు వట్టి నెందుకుపోస్తా' రనే వాళ్ళొక్కరైతే, మీద యీగలు వాలుతున్నాయి. విసురాలి' అంటూ చేతితో యీగలు తోలుతున్నా రింకొకరు. రామస్వామి అరుగుదగ్గర పంచలో వళ్లు తెలియకుండా పడిఉన్న రాజులు చుట్టు జనం ఇసుక వేస్తే రాలకుండా మూగిఉన్నారు. పిల్లలూ పెద్దలు భయమనే మాటలేకుండా ఒకరివెంట ఒకరు చేరుతున్నారు.

'దూరంగా ఉండండి మీరంతా, పిల్లలూ మీరు వెళ్లండి యిండ్లల్లోకి' అంటున్నారొక పెద్ద మనిషి.

'వాడి గొంతులో నీళ్లుపోస్తే ధర్మశాస్త్ర ప్రకారంగా ప్రాయశ్చిత్తం చేసుకోవలసి వస్తుంది. మాలలతో కూడుతిన్నాడు వాడు.' అనేమాటలు కూడా అంటున్నారు ఇంకొకవైపు సనాతన ధర్మ పరాయణ శాస్త్రుల్లొకరు.

కాని యెవరు వింటారు యీమాటలు. ఊళ్ళో ఆబాల గోపాలం కట్టలు కట్టుకొని వస్తూనే ఉన్నారు. రాజులుకు కలరా తగిలిందని అందరికీ తెలుసు.

'ఏంకావాలి రాజులూ !' అని రాజులు దగ్గిరికిపోయి అడిగిందొక ముసలమ్మ.

'వాడికి నువ్వులు వేసిన రొట్టె చాలా యిష్టం' తింటారేమోనని తెచ్చా" నన్నది గుడ్డచాటున రొట్టె తెచ్చిన యింకొక సంసార్ల యిల్లాలు.

'అయింది వాడిపని, ఏంతింటా డిప్పుడు ?' అని పెదవి విరచి చెప్పాడు రెప్పగొట్టకుండా చూస్తూనిల్చున్న పెద్దమనిషి ఒకరు.

'ఎక్కడ పుట్టాడో ? ఎవరికీ తెలియదు. వచ్చినప్పటినుండి పిల్చినవాళ్లకు కాదనకుండా చెప్పిన పనల్లా చేసినాడు... అంతా పిచ్చివాడని అనుకున్నారు.... పాపం రాజులు' అన్నది ఒక యిల్లాలు.

'వాడు తన తెక్కలు దాచుకోకుండా ఈ ఊరికే అర్పించుకొన్నాడమ్మ !' అన్నది. నీళ్లకడవ భుజాన పెట్టుకొని నిల్చున్న ఒక నడి యీడు మనిషి.

'నాడీమాత్రము ఎట్లున్నదో ?' అంటూ నాడీ చూసి, 'నాడీ దొరకడము లేదు,' అన్నాడొక యువకుడు.

ఇంకొక అనుభవశాలి అయిన వృద్ధు ఆమాటను ఖాయపరచాడు. గ్రామమంతా కదలి వచ్చింది. నలుదైపులా మూగింది. కన్నీటిచుక్కలు పూలవానలాగా జల్లున రాలాయి. రాజులు ఆ జనాన్నంతా ఒక్కసారి కన్ను తెరచి చూచాడు. మళ్ళీ కళ్లుమూశాడు. చివర శ్వాస పీల్చాడు.

వాడికి యిల్లులేదు. డబ్బులేదు. బిడ్డలు లేరు. చుట్టాలులేరు. వాడెవరో ? ఏగ్రామమో తెలియని పిచ్చివాడు రాజులు. నల్లా తెల్లా తెలియకుండా సేవచేశాడు. వాడిసేవకు ఋణపడ్డ ఆ అగ్రహారమే వాడి సర్వస్వము. పెండ్లి పల్లకీలాగా జనమంతా వెళ్లి వాడి భౌతిక దేహానికి సంస్కారం చేశారు. ఈ సంగతంతా గుర్తుచేసుకొని మాఊరి వేదాంతి, 'యిదంతా నిష్కామ కర్మఫలితం' అన్నాడు.

——

# నూతన గీతి



శ్రీ మొక్కపాటి కృష్ణమూర్తి

ఉదయ రోచిస్తరంగమ్ముల
చెదరు రాత్రీకుంతలమ్ముల
ముదురుకొను కాంతులకు తమిగొని,
నిదురగొను భావములె మేల్కనె!
విశ్వమోహన విమల గీతము
విందువో సఖుడా!

తళుకుజుక్కల మినుకు మను కత
అంతు జిక్కని ఆకసము వెత
అలరు టోవరి అలికుమారకు
వలపు కలుముల సొదలు గలవిక
విందు రావోయి!

కోటి గొంతుల కొసరు కోరిక
నేటి మానవు నూటి పూనిక
ఏటి తరగల తేటిపాటల
తేలివచ్చెను తీయతీయగ
అచ్చమగు మాటొకటి ఉన్నది
ఆల కింతువుగా!

విలువలేని వినూత్న గీతుల
విరుల వీధుల చివురు మేడల
పరువుతక్కువ కరువలికి జత
పరువు లెత్తే పాటద్రిమ్మరి
మాట లనియెదవో !

ఈయుగాది నవోదయమ్మున
ఏ జగా తరి తీపు లారసెకో!
పిందె దొడిగిన వేపపువు తొలి
చిన్ని పాటల చివురుటడుగుల
చిన్నెలే ఎందున్!

# కాంట్ పరతత్త్వవాదం



శ్రీ జి. వి. కృష్ణరావు

## చిత్తవృత్తులు

ఇంతవరకూ బహిరంతరింద్రియ వ్యాపారం పరిశీలించాము. బుద్ధి ఆదేశాన్ని శిరసావహించి ఈ వ్యాపారం వేదనలను (*Sensations*) స్వీకరించి దేశ కాలాలతో వ్యవస్థీకరిస్తుంది. దీనితో శబ్దస్పర్శరూప రస గంధాలు గోచరిస్తాయి. కాని ఇవి సమన్వయ రహితంగా జ్ఞానం కాజాలవు. జ్ఞానం కలగాలంటే ఐంద్రియక వేదనలకు పరస్పరసంబంధం ఏర్పడాలి. గోళాకృతి, పసుపురంగు, కాఠిన్యం, ఒక విధమైన వాసన గోచరించా యనుకోండి. అంతమాత్రాన మనకు జ్ఞానం కలగటంలేదు. ఆ విషయా లేమిటో తెలియటంలేదు. గోచరిస్తున్న యీ అర్థాలకు ఐక్యం ఏర్పడాలి. ఈ ఐక్యమే బుద్ధివల్ల లభిస్తుంది. అయితే ఇది ఎలా సంభావ్యమౌతున్నదో చూదాము.

బుద్ధికి కాంట్ మతం ప్రకారం ప్రధానంగా నాలుగు వృత్తు లున్నవి. ఒకటి పరిమాణం, రెండు గుణం, మూడు సంబంధం, నాలుగు సంభావ్యత, (*Modality*) ఈ నాలిగింటిలో ప్రతి ఒకటీ త్రివిధ భేదాత్మకం. ఈ విధంగా ఏర్పడుతున్న పన్నెండు వృత్తులు వికల్పనశక్తిచే అన్వయింపబడి పన్నెండు పదార్థాలు అవుతున్నవి. నైయాయిక వైశేషికులకు పదార్థాలు ఏడైతే, కాంట్ సిద్ధాంతం ప్రకారం ఇవి పన్నెండు. ఏకత్వము, బహుత్వము, సమాహారము అన్నవి పరిమాణగతభేదాలు. యాథార్థ్యము (*Reality*) ప్రతియోగిత్వము (*Negation*) నియతత్వము (*Limitation*) అన్నవి గుణగతభేదాలు. ద్రవ్యము కారణము, పారస్పర్యము (*Reciprocity*) అన్నవి సంబంధగత భేదాలు. సాధ్యతాసాధ్యతలు, భావాభావాలు (*Existence and non-existaence*) నిరుపాధికత్వ సోపాధికత్వాలు *Necessity and Contingency*) అన్నవి సంభావ్యతాగతభేదాలు.

ఈ ద్వాదశ పదార్థాన్వయంతో మనకు విషయ జ్ఞానం ఎలా కలుగుతున్నదో చూదాము. ఇంద్రియాల ద్వారా గోచరించే వేదనలు అర్థంకావాలంటే స్మృతి, ప్రత్యభిజ్ఞ పునఃకల్పన ఉండాలి. అలాకాక ఎప్పుడు గోచరించిన వేదనలు అప్పుడే మరచిపోయినా, కలిగిన వేదనలను గుర్తించలేకపోయినా, గత వేదనలకు పునఃకల్పన జరగకపోయినా ప్రయోజనంలేదు. ఈ పనులను బుద్ధి ఆదేశానికి లోబడి అంతఃకరణం నిర్వర్తిస్తుంది. బాహ్యేంద్రియాలు ప్రతిపాదించే దేశగత వేదనలను అంతఃకరణం కాలగతాలను చేస్తుందని ఇదివరకే చెప్పుకొన్నాము. అంతే కాదు. అంతఃకరణం స్మృతి ప్రత్యభిజ్ఞాశక్తులవల్ల వాటిని తిరిగి ఉత్పాదించి ఏకోన్ముఖం చేస్తుంది. ఇలా ఏకోన్ముఖాలైన దేశకాలగత వేదనలు చిత్తవృత్తి సమవచ్ఛిన్నాలై విషయజ్ఞానం ఏర్పడుతుంది.

ఉదాహరణ తీసుకొంటే కాంట్ ఏమి చెబుతున్నాడో తేలికగా బోధపడుతుంది. పైని చెప్పుకొన్న గోళాకృతి, పసుపురంగు, కాఠిన్యం, ప్రత్యేక వాసన రుచి అంతఃకరణంవల్ల ఏకోన్ముఖా లవుతవి. అప్పుడు బుద్ధి తనవృత్తిద్వారా అది నారింజపండని గ్రహిస్తుంది. ఈవిధంగా కాలగతమై మార్పుపొందనిది ద్రవ్యమనీ, కాలగతాలై మార్పు పొందుతున్నవి గుణాలనీ బుద్ధి భావిస్తుంది. అనన్యథాసిద్ధ నియతపూర్వభావి అయినది కారణమనీ, అనన్యథా సిద్ధ నియత అపర భావి అయినది కార్యమనీ బుద్ధి వ్యవస్థ ఏర్పరుస్తుంది. అయితే యీ వివిధజ్ఞానాలను పొందటానికి సామాన్య చైతన్యం ఒకటి ఉండాలి. ఇది లేకపోతే 'ఇది ద్రవ్యమని నేను తెలుసుకొంటున్నాను. ఈ వాక్యాల్ని నేను చదువుతున్నానని తెలుసుకొంటున్నాను.' అన్న అనువ్యవసాయం ఏర్పడటానికి వీలు లేదు.

ఈవిధంగా దేశం ఇంద్రియవృత్తిజన్యము, కాలము, స్మృతిప్రత్యభిజ్ఞ, కల్పన (*Reproduction*)

అంతఃకరణవృత్తి జన్యాలు, ఏకత్వాది ద్వాదశ పదార్థాలు చిత్తవృత్తిజన్యాలు అవుతున్నవి. మనకు కలుగుతున్న విషయజ్ఞానంలోనుంచి వీటి నన్నిటినీ తీసివేస్తే మిగిలినవి ఏమిటి? కాబట్టి విషయాలన్నీ మనఃకల్పితాలే. దీనినిబట్టి కాంట్ కేవలం విజ్ఞానవాది అనీ (*Idealist*) మనః కల్పితవిషయప్రపంచం తప్ప మరేమీ లేదని అంటున్నాడనీ భావించరాదు. జ్ఞానస్వరూపవిచారమన్న గ్రంథం వెలువడిన క్రొత్తలో విమర్శకులు ఇలాంటి భ్రాంతికే పాలుపడ్డారు. కేవలం విజ్ఞానవాది అని కాంట్‌ను విమర్శించారు. ఆ అపోహను ఖండిస్తూ 'ప్రోలీగామినా'లో కాంట్ ఇలా అన్నాడు :—

"ఆలోచించే మనస్సులు ఆత్మలుతప్ప అన్యవస్తువులు లేవు. మనస్సుకు గోచరిస్తున్న వస్తువులు మన మనస్సులు కల్పిస్తున్నవే. ఈ భావ్యమానార్థాలకు భిన్నమైన మనస్సుకు వెలుపల విషయాలు లేవని విజ్ఞానవాద సిద్ధాంతం. నేను అలా చెప్పటంలేదు. మనస్సుకు గోచరిస్తున్న విషయాలు మనస్సుకు వెలుపల ఉన్నవి. అవి స్వతః ఎలా ఉంటవో మనకు తెలియదు. మనకు తెలిసినదల్లా భౌతికత్వమే. అంటే వేదనాసంపర్కంతో మనకు మనస్సులో గోచరిస్తున్న భావాలే మనకు తెలుసు. అందువల్ల మనకు వెలుపల వస్తువు లున్నవని అంగీకరిస్తాను. ఆ వస్తువుల యథాస్వరూప మేమిటో మనకు తెలియదు. ఇంద్రియాలపై ఆ వస్తుప్రభావం ఉండటంవల్ల భావాలు ఏర్పడుతున్నవి. ఈ భావాలనుబట్టి బాహ్యవస్తువులను శరీరాలుగా భావిస్తున్నాము. అంటే వస్తువుల ఆభాసాలు మాత్రమే మనకు తెలుస్తున్నవి. ఇవి ఆభాసాలు అయినంతమాత్రాన వాస్తవికతాన్యూనాలు కావు. ఇలాంటి వాదం విజ్ఞానవాదం అనవచ్చునా? లేదు ఇది విజ్ఞానవాదానికి కేవలం వ్యతిరేకం."

కాగా కాంట్ సిద్ధాంతం విజ్ఞానవాదం కాదు. మన అద్వైతవాదానికీ, ఈ వాదానికీ సామ్యమున్నది. ఇంద్రియాలకు బుద్ధికి గోచరిస్తున్న అర్థాలు ఆభాసాలని రెండు పక్షాలు అంగీకరిస్తవి. ఈ ఆభాసాలకు మూలమైన వస్తువులు ఏవో ఉన్నవి, వాని యథార్థతత్త్వం మన బుద్ధికికాని వివేచనకుకాని అందదు. అది "అచింత్యం, అతర్క్యం, అప్రమేయం," అని కాంట్ అంటాడు. ఉన్నది సచ్చిదానందస్వరూపమైన బ్రహ్మం ఒక్కటేననీ, మాయవల్ల, ఈ వ్యావహారిక ప్రపంచం గోచరిస్తున్నదనీ అద్వైతి అంటాడు. ఈ రెండు వాదాలకు మరికొన్ని సాధర్మ్య వైధర్మ్యాలున్నవి. వాటిని తరువాత పరిశీలింతాము.

ఇంద్రియాలు, బుద్ధి వీటి వృత్తులద్వారానే మనకు జ్ఞానం కలుగుతున్నది. ఈ జ్ఞానమంతా ఆభాసమే. వృత్తిఅవచ్ఛిన్నత లేక మనకు జ్ఞానం లేదు. వృత్త్యవచ్ఛిన్నమైనదంతా ఆభాసమే. అంటే వ్యావహారికజ్ఞానం. ఇది వస్తువుల యథార్థస్వరూపం తెలుపదు. గణితశాస్త్రమైనా, భౌతికశాస్త్రమైనా, మరే ఇతర సామాజికశాస్త్రమైనా వ్యావహారిక జ్ఞానం మాత్రమే ప్రసాదిస్తుంది. అంటే వీటికి విషయం భౌతికప్రపంచమేకాని యథార్థవస్తుప్రపంచం కాదు. అసలు దానినిగూర్చి ఇవి చెప్పలేవు.

## వి వే కం

ఇంతవరకూ ఇంద్రియాలు, బుద్ధి వాటి వృత్తివల్ల ఏమి జరుగుతున్నదో చూచాము. ఇంద్రియాల సహాయంతో బుద్ధి వివిధవిషయాల జ్ఞానం కలిగిస్తున్నది. ఈ వివిధవిషయజ్ఞానాలతో మానవుడు సంతృప్తిపడడు. ఈ వివిధజ్ఞానాలు సమన్వితం కావాలి. ఈపని బుద్ధివల్ల కాదు. మన వివేచనాశక్తి ఒక్కటే యీపని నిర్వహిస్తుంది. ఇంద్రియజన్యమైన ప్రత్యక్ష అనుభావాలను బుద్ధి సమన్వయిస్తున్నట్లే బుద్ధిజన్యమైన అనుభవాలను వివేకం సమన్వయిస్తుంది. కాని సాధ్య అనుభవ సమాహారమంతా అనుభవానికి రాజాలదు. అందువల్ల ఈ అనుభవ సమాహారం పొందటానికి వివేకం ప్రయత్నించక తప్పదు. అలా ప్రయత్నించినప్పుడు వివేకం అనుభవాన్ని అధిగమించాలని చూస్తుంది. అంటే సోపాధిక విషయాలనుండి (*Conditionedobjects*) నిరుపాధిక వస్తువులను తెలుసుకోవటానికి వివేకం ప్రయత్నిస్తుంది. వివేకం ఈ పనిని మూడు భావాల (*Ideas*) ద్వారా సాగిస్తుంది. మొదటిభావం జ్ఞానమూలకారణాన్ని అన్వేషిస్తుంది. అంటే ఆత్మతత్త్వాన్ని తెలుసుకోటానికి యత్నిస్తుంది. రెండవది జగత్తత్త్వం పరిశీలిస్తుంది. మూడవభావం ఆత్మ జగత్తుల పరమోపాధిని, అంటే ఈశ్వరుని అన్వేషిస్తుంది. ఈ విధంగా ఈ భావత్రయంవల్ల, ఆత్మదర్శనం, జగద్దర్శనం, ఈశ్వరదర్శనం ఏర్పడుతున్నవి.

## ఆత్మస్వరూపం - అపోహలు

నిరుపాధికవస్తువులు తెలుసుకోటానికి యత్నించటంలో భావాలు అనుభవాన్ని అధిగమిస్తవి. ఇలా అధిగమించి అనుభవానికి వర్తించే పదార్థబుద్ధిని అనుభవాతీత వస్తువులకు ఆపాదించి ప్రాతిభాసిక విషయాలను సృష్టిస్తవి. ఆత్మస్వరూప నిర్ణయంలో ఇలాంటి అపోహ ఏర్పడుతున్నది.

“నేను తెలుసుకొంటున్నాను అంటే తెలుసుకొనే కర్త ఉండాలి. విభిన్నకాలాలలో కలుగుతున్న జ్ఞానాలను తెలుసుకొంటున్నాను కాబట్టి నేను మారకుండా ఉండాలి. మారుతున్న పక్షంలో నాకు విభిన్న జ్ఞానాలు కలగటానికి వీలులేదు. ఈ జ్ఞానా లన్నిటికీ ఈ మారనికర్త ఉపాధి కావాలి. ఈ కర్తే ఆత్మ. ఈ ఆత్మ మారని ద్రవ్యం కావాలి. మారనిది కాబట్టి నిత్యం కావాలి. నిత్యం కాబట్టి నిరవయవం కావాలి. విభిన్నకాలాలలో ఉంటున్నదన్నా బాహ్యవిషయాలను పెక్కు గ్రహిస్తున్నదన్నా ఈ ఆత్మ ఏకమైనది కావాలి.” ఇది ఇతర దార్శనికుల వాదం.

ఈ వాదానికి కాంట్ ఇలా అంటాడు:— అనుభవానికి ఆత్మ విషయమౌతున్నదంటే, అనుభూతమైన ఇతర బాహ్యవిషయాలు ఎలాంటివో, అనుభూయమానమైన ఆత్మకూడా అలాంటి విషయమే. కాకపోతే బాహ్యవిషయాలు బహిరింద్రియాల ద్వారా గ్రహింపబడుతుంటే, ఈ ఆత్మాభాసం అంతరింద్రియంద్వారా గ్రహింపబడుతున్నది. అంతే కాని కేవల చైతన్యం విషయం కావటానికి వీలులేదు. అయినా యీ ఆత్మాభాసాన్ని కేవల చైతన్యంగా భావించి ఆత్మాభాసలక్షణాలను ఆత్మకు ఆపాదించటం జరుగుతున్నది. ఇలాంటి భ్రమకు లోనై ఆత్మాభాసలక్షణాలైన ఏకత్వ, తాదాత్మ్య, నిత్యత్వ అభౌతికత్వాలను ఆత్మకు ఆపాదించి అది ద్రవ్యమనీ, నిరవయవమనీ, ఏకమనీ, అభౌతికమనీ అంటాము. అనుభవగోచరమౌతున్న ఆత్మ జ్ఞానంలో ఈ విశేషణాలలో ఏ ఒకటీ భాగం కావటానికి అవకాశంలేదు. అంతఃకరణకు సాక్షాత్కరిస్తున్న విషయమేదీ నిరవయవంగా ఏకంగా పరమ ద్రవ్యంగా గోచరించటానికి వీలులేదు. నిజానికి అనుభవంలో బాహ్యవస్తువులతో ఏర్పడుతున్న సంబంధం ద్వారానే ఆత్మఉనికిని తెలుసుకోగలుగుతున్నాము. బాహ్యవస్తువులతో అనుభవంలో ఏర్పడుతున్న యీ సంబంధం సోపాధికం.

ఆత్మ ఆనందస్వరూపమని అంటున్నారు. సుషుప్తి అనంతరం సుఖంగా నిద్రించాను అన్న స్మృతి కలుగుతున్నది కాబట్టి ఆత్మ ఆనందస్వరూపమై ఉండాలంటున్నారు. సుషుప్త్యవస్థాగత జ్ఞానం చిత్తవృత్తిద్వారా కలుగుతున్నది. ఇలా వృత్తిద్వారా కలుగుతున్న జ్ఞానమంతా ఆభాసమే. కాబట్టి అది ఆత్మస్వరూప మనటానికి వీలులేదని కాంట్ సిద్ధాంతం. కాగా లౌకికజ్ఞాన సముపార్జనకు తోడ్పడుతున్న ఆలోచనారూపాలైన పదార్థాలను అలౌకిక వస్తులక్షణ నిర్ణయానికి వినియోగించవీలులేదు. అలా వినియోగిస్తే భౌతికవిశేషణాలను అలౌకికవస్తువులకు ఆపాదించి తద్వారా భ్రమకు పాల్పడటమౌతుందని కాంట్ వాదన.

## జగత్తు—అపోహలు

అనుభవంలో గోచరిస్తున్న విషయాలకు జగద్భావం స్వతంత్రసత్తా కల్పిస్తుంది. విషయాలు అనుభవాశ్రితాలు కాక స్వతంత్రమనీ, ఈ స్వతంత్రవిషయ ప్రపంచమే జగత్తనీ భావిస్తుంది. ఇలా మనఃకల్పిత విషయాలను యథార్థవస్తువులుగా భావించటంవల్ల అన్యోన్య విరుద్ధాలైన అపసవ్యవాదద్వంద్వాలు నాలుగు ఏర్పడుతున్నవి.

మొదటి వాదం :—కాలికంగా జగత్తు ఆద్యంత సహితం; దైశికంగా సావధికం.

జగత్తు నిజంగా కాలంలో ఒకప్పుడు ఉద్భవించి దేశంలో సావధికమై ఉన్నదనుకొందాము. ఆపక్షంలో జగదుద్భవానికి పూర్వం కేవలం కాలం ఒకటే ఉండి ఉండాలి. వస్తుశూన్యమైన కాలంలో ఒకప్పుడు జగత్తు ఏర్పడి ఉండాలి అంటే శూన్యంలో నుంచి జగత్తు ఏర్పడాలి. ఇది ఇలా ఉండగా జగత్తు సావధికమంటే వస్తుశూన్యమైనదేశం జగత్తుకు వెలుపల ఉన్నదన్నమాట. వస్తుశూన్యమైన దేశం ఉండటం అసంభవం.

మొదటి ప్రతివాదం :—జగత్తు అనాది, నిరవధికం.

ఈ వాదమే నిజమైతే, ఇప్పటికి జగత్తుకు అనంతకాలం గడచిఉండాలి. అలాగే ప్రతి పూర్వ యుగానికి పరంగా అనంతకాలం గడచిఉండాలి. దైశికంగా జగత్తు నిరవధికంగా విస్తరించిఉంటే జగత్తులోని ప్రతిప్రాంతంనుంచి నిరవధికజగత్తు విస్తరించి ఉండాలి. ఇది అసంభవం.

ఈ రెండు దోషాలు పరిహరించాలంటే ఒకటే మార్గం ఉన్నది. దేశకాలాలను ఐంద్రియకతా రూపాలుగా స్వీకరిస్తే ఈ చిక్కులు ఉండవు. ప్రతి అనుభవం దేశకాలగతం అవుతుంది. అనుభవాన్ని బట్టి దేశకాలాల పరాపరాలను గ్రహించటానికి వీలవుతుంది. అంతేకాని దేశకాలాలు అనుభవాల్ని విడిచి లేవు.

రెండవవాదం:— జగత్తుకు కారణమైన ద్రవ్యాన్ని అనంతంగా విభజించవచ్చును.

ప్రతివాదం :— జగత్తుకు మూలకారణమైన ద్రవ్యం నిరవయం.

మొదటివాదంప్రకారం ప్రతి అణువును అనంతంగా విభజించవచ్చును. ఆ పక్షంలో ఆ అణువు అవిభాజ్యాలైన అనంత భాగాలతో ఏర్పడాలి. అంటే రూపరహిత పరమాణువులనుంచి రూపసహితమైన ద్రవ్యాలు ఏర్పడాలి. ఇది ఎలా సంభవం.

ప్రతివాదం ప్రకారం నిరవయవాలైన పరమాణువులతో జగత్తు ఏర్పడిందంటే పరమాణువుకు— అది ఎంత సూక్ష్మమైనదైనా—కుడిప్రక్క, ఎడమ ప్రక్క, లోపలిభాగం, వెలుపలిభాగం అంటూ ఉండాలి. ఇలా భాగాలున్నప్పుడు ఇవి గణితశాస్త్ర దృష్ట్యా విభాజ్యాలే కావాలి.

ఇలా రెండు వాదాలకు బాధ ఏర్పడుతున్నది. ఈ బాధ పరిహరించాలంటే దేశకాలాలను ఐంద్రియకతారూపాలుగా స్వీకరించాలి. అనుభవగోచర విషయాలను కాలికంగా దైశికంగా ఇష్టంవచ్చినంత మేర విభజించవచ్చును. మానుకోదలచుకొన్నప్పుడు విభజన మానుకోవచ్చును. ఎందుకంటె యధార్థవస్తువులు దేశకాలగతాలు కావు అందువల్ల మనం విభజించేది అనుభవగత విషయాలే కాని యధార్థవస్తువులు కాదు. అందువల్ల ఈ బాధ ఉండదు.

మూడోవాదం:—జగత్తు కారణ కార్య బద్ధం.

ప్రతివాదం:—జగత్తు కేవలం కారణ కార్య భావావచ్ఛిన్నం కాదు. జీవికి జగత్తులో స్వాతంత్ర్యం ఉన్నది.

జగత్తు కారణకార్యభావ అవచ్ఛిన్నమంటే కారణానికి కారణం ఉంటూ దానివల్ల అనవస్థ ఏర్పడుతున్నది. కారణకార్యభావ అనవచ్ఛిన్నం అంటే గండశిలవృక్షాన్ని కనవలసివస్తుంది. ఈ రెండు బాధలను పరిహరించటానికి కాంట్ ఇలా సూచిస్తున్నాడు:—

మనకు అనుభవంలో గోచరిస్తున్న జగత్తుఅంతా కారణకార్యభావావచ్ఛిన్నమే. అందులో సందేహం లేదు. అయితే ఉన్నది విషయ ప్రపంచం ఒక్కటే కాదు. ఈ విషయప్రపంచం మనః కల్పితం. దీని వెనుక యథార్థ వస్తుప్రపంచం ఉన్నది. మనం వాంఛిస్తున్న స్వాతంత్ర్యం యీ వస్తుప్రపంచంలోనిది. అప్పుడు స్వాతంత్ర్యం ఉంటున్నది. ఇటు అనుభవమంతా కార్యకారణభావ అవచ్ఛిన్నమూ అవుతున్నది.

నాలుగోవాదం :—ఈ జగత్తుకు ఈశ్వరుడు కారణం.

ప్రతివాదం :—జగత్తుకు ఈశ్వరుడు కారణం కాదు.

ఈ వాదప్రతివాదాలను మైళిగంగా పూర్వపక్షం చేస్తూ, అనుభవ ప్రపంచంలో ఈశ్వరుడు లేడు. కాని యధార్థవస్తుప్రపంచంలో ఉండవచ్చునని కాంట్ అంటాడు.

## ఈశ్వరుడు

ఆధ్యాత్మికవాదులు ఈశ్వరాస్తిత్వం పరమసత్యమనీ, అతడు అనంతుడు, సర్వోపగతుడు, సర్వశక్తిసంపన్నుడు, అనీ అతనివల్లనే యీ సకల చరాచర ప్రపంచం ఏర్పడుతున్నదనీ ప్రతిపాదిస్తున్నారు. గోచరిస్తున్న యీ నానాత్వానికి ఏకత్వం కల్పించటంకోసం వివేచన ఇలా ప్రతిపాదించటం సహజం. అయితే అలాంటి ఈశ్వరుడు వాస్తవంగా ఉన్నాడని నిరూపించటానికి ఎంతవరకు సాధ్యపడుతుంది? అల్పజ్ఞులమైన మన జ్ఞానం మన అనుభవాన్ని అధిగ

మించిపోలేదు. అందువల్ల అనంతతత్త్వజ్ఞానం మనకు కలగటానికి అవకాశం లేదు. ఐంద్రియకతారూపాలు, చిత్తవృత్తులు నియత అనుభవసముపార్జనకు తోడ్పడుతవే తప్ప వస్తువుల యథార్థజ్ఞానం పొందటానికి తోడ్పడవు. అయినా ఆధ్యాత్మికవాదులు ఈశ్వరుడు ఉన్నాడని చెప్పటానికి ముఖ్యంగా మూడు ఉపపత్తులు చూపిస్తున్నారు.

1. ఈశ్వరుడు పరమసత్పదార్థం. సత్పదార్థానికి అనుయోగివిశేషణాలన్నీ ఉంటవి. సత్తా అనేది విశేషణమే. కాబట్టి ఈశ్వరుడు ఉన్నాడు.

ఈ వాదం సమర్థనీయం కాదు. భావం కలుగుతున్నది కాబట్టి భావితార్థం ఉండాలని లేదు. నా జేబులో వందరూపాయ లున్నవన్న భావం కలుగవచ్చును. వందరూపాయలు నిజంగా నా జేబులో ఉన్నవా లేవా అని నిరూపించాలంటే, నాకు కలిగిన భావం ఒకటే చాలదు. జేబులో వందరూపాయలు గోచరిస్తే, వందరూపాయలు ఉన్నట్లు, గోచరించకపోతే లేనట్లు. ఈశ్వరుడు ఇంద్రియాలకు గోచరించేవాడు కాదు. ఈ వాదన ఈశ్వర అస్తిత్వ నిరూపణకు సమర్థం కాదు.

2. రెండవవాదం జగత్తునుబట్టి ఈశ్వరఅస్తిత్వ నిరూపణకు పూనుకొంటున్నది. "అసలు ఏదైనా ఒకటి ఉంటున్నదంటే పరమపదార్థం ఒకటి ఉండాలి. నేను ఉన్నాను. కాబట్టి ఈశ్వరుడు ఉన్నాడు," అని యీ వాదం ప్రతిపాదిస్తున్నది. అంటే కారణం లేక కార్యమనేది ఎప్పుడూ ఉండదు. ఈ జగత్తు కార్యం కనుక దీనికి పరమకారణం ఉండాలి. అదే ఈశ్వరుడు అని యీ వాద తాత్పర్యం. అయితే కార్యకారణ భావమనేది మనస్సు కల్పించినదని చెప్పుకొన్నాము. అయినప్పుడు పరమకారణం అనేది మనఃకల్పితమే అవుతున్నది కాని యథార్థవస్తువు కావటంలేదు.

3. మూడోవాదం ఇలా అంటున్నది. ఈ జగత్తులో సర్వత్ర ఒక క్రమమనేది కనిపిస్తున్నది. ప్రతి విషయానికి కావ్యంలోని సన్నివేశానికివలె ప్రయోజనం కనిపిస్తున్నది. ప్రయోజనరహితమైనది ఏదీ కనిపించటంలేదు. ఇలాంటి వ్యవస్థ, సార్థక్యం ఉంటున్నప్పుడు వీటికి కర్త ఒకడు ఉండాలి. అయితే యీ వాదంవల్ల పరమస్వతంత్రుడైన ఈశ్వరుడు సిద్ధించడు. కాకపోతే ఉన్న విషయాలను వ్యవస్థీకరించే నియతశక్తిమంతుడైన ఈశ్వరుడు సిద్ధించవచ్చును.

ఈ విధంగా కాంట్ ఆధ్యాత్మికవాదులు ప్రతిపాదిస్తున్న జీవేశ్వర జగత్స్వరూప నిరూపక సిద్ధాంతాలకు సోవనార్ పేర్కొన్నట్లు గొడ్డలిపెట్టు పెట్టాడు. అంతమాత్రంచేతనే జీవేశ్వరులు లేరని అతని సిద్ధాంతం కాదు. జీవేశ్వరస్వరూపం సోపపత్తికంగా నిరూపించలేము. నిరూపించటానికి పూనుకొంటే అనుభవంలో గోచరించే విశేషణాలను పారమార్థిక వస్తువులకు ఆపాదించటం జరుగుతుంది. ఇలా ఆపాదించి నిరూపింపబడుతున్న జీవేశ్వరులు మిథ్య అవుతారని కాంట్ అంటాడు. దీనినిబట్టి జీవేశ్వరులు లేరని అతడు భౌతికవాదులను సమర్థించటం లేదు. ఉన్నారు. అయితే వారు యథార్థ వస్తుప్రపంచంలోనివారు. వారు అప్రతక్ర్యులు, అచింత్యులు, అప్రమేయులు. అసలు వారు లేరు అంటే మనకు గోచరిస్తున్న ఆభాసప్రపంచం, ఈ భౌతికప్రపంచం లేకపోవాలి. కాబట్టి జీవేశ్వరులు లేరని ఎలా అనగలుగుతామని కాంట్ వాదన.

వివేచనావృత్తులైన భావాలు అనుభవ సమన్వయానికే వినియోగిస్తవికాని అనుభావాన్ని అధిగమించి జ్ఞానంపొందాలంటే తోడ్పడవు సరిగదా భ్రాంతిరూపానికి దారితీస్తాయి. అందువల్ల ఈ భావాలు బుద్ధి చోదకాలేకాని జ్ఞాననిర్మాపకాలు కావు.

ఇంతవరకూ తేలిన విషయాలు :—1. దేశకాలాలు ఐంద్రియకతా రూపాలుకావటంవల్లను ఏకత్వాది ద్వాదశపదార్థాలు చిత్తవృత్తులు కావటం వల్లను అనుభవగోచరాలైన విషయాలన్నీ మనఃకల్పితాలు. 2. మనస్సు శూన్యంలోనుంచి విషయాలను సృష్టించటంలేదు. వస్తుప్రపంచం ఒకటి ఉన్నది. దాని ప్రభావంవల్ల మనస్సు యీ విషయప్రపంచాన్ని కల్పిస్తున్నది. అంతేకాని విషయప్రపంచానికి వస్తుప్రపంచం కారణం కాదు. కార్యకారణ భావం విషయప్రపంచంలోనిది కాని వస్తుప్రపంచం లోనిది కాదు. అందువల్ల వస్తుప్రపంచానికి కారణత్వం చెప్పటానికి వీలులేదు. 3 మనకు తెలుస్తున్నది విషయప్రపంచమే కాని వస్తుప్రపంచం కాదు,

ఈ తెలుస్తున్నవి కూడా ఆభాసాలే. ప్రకృతి శాస్త్రాలైనా సామాజికశాస్త్రాలైనా ఈ ఆభాసికప్రపంచానికి చెందినవే. 4 'అనుభవాన్ని బట్టి ఆత్మస్వరూపాన్ని తెలుసుకొంటున్నాను. ఈశ్వరానుభవం నాకు కలిగింది' ఈమొదలైన జ్ఞానాలన్నీ వ్యావహారికప్రపంచంలోనివే. 5 వస్తుతత్త్వం అతర్క్యం, అచింత్యం, అప్రమేయం. 6 జీవేశ్వరస్వరూపం సోపపత్తికంగా నిరూపించలేము. అంతమాత్రాన లేరనటానికి అసలే వీలు లేదు.

## ధర్మస్వరూప విచారం

తత్త్వజ్ఞానస్వరూపము, అవధులు పరిశీలించాము. ఈ జ్ఞానం భౌతికప్రపంచం దాటి అవతలికి పోలేదు. అయితే ధర్మజ్ఞానానికి కూడా ఇదే అన్వయిస్తుందా? లేక మానవుడు ధర్మజ్ఞానసహాయంతో ఈ భౌతికప్రపంచం అధిగమించి చూడటానికి అవకాశ మున్నదా? ఈ విషయం పరిశీలించవలసి ఉన్నది.

## స్వాతంత్ర్యం

ప్రకృతి సంఘటనలైనా, మానవ కర్మకలాపాలైనా, భౌతిక ప్రపంచమంతా కారణతాసూత్రబద్ధమేనని తేలింది. అనన్యథాసిద్ధ నియతపూర్వభావి అయిన కారణంవల్ల అవచ్ఛిన్నం కాని విషయమంటూ ఈ ఇంద్రియగోచర ప్రపంచంలో ఏదీ లేదు. ఇది ఇతరవిషయాలకు ఎంతవరకు వర్తిస్తుందో మానవ కార్యకలాపాలకుకూడా అంతవరకు వర్తిస్తుంది. నిజంగా కాలమనేది విషయాలకంటే వేరుగా ఉన్న ద్రవ్యమై కార్యకలాపావచ్ఛేదకమే అయితే స్వాతంత్ర్యం ఉండటానికే వీలులేదు. ప్రతి కర్మ తత్పూర్వకర్మావచ్ఛిన్నం కాకతప్పదు. దేశకాలాలు ఆభాసికవిషయధర్మాలు కాక కేవల యథార్థ వస్తుధర్మాలైనా స్వాతంత్ర్యం ఉండటానికి వీలు లేదు. ఎందుకంటే ప్రతి వస్తువు దేశకాలావచ్ఛిన్నం కావలసివస్తుంది. ఆ విధంగా కారణతాసూత్రం అనివార్యంగా వర్తిస్తూ ఉంటుంది. ప్రతిఉపాధి కూడా తత్పూర్వ ఉపాధి సమవచ్ఛిన్నమవుతుంది. ఆ విధంగా ఇదే పరమ ప్రారంభం అన్న భావానికి కూడా అవకాశం లేకుండాపోతుంది. అయితే చిత్తవృత్తులు కేవలం భౌతిక ప్రపంచానికి మాత్రమే అన్వయిస్తవనీ, కారణతాసూత్రం కేవలం భౌతికప్రపంచంలోనిదేననీ జ్ఞానస్వరూపవిచారంవల్ల తేలింది. కాబట్టి ఈ కారణతా సూత్రంవల్ల అలౌకికమైన స్వాతంత్ర్యానికి బాధకం ఏర్పడటంలేదు. ఈ లౌకికప్రపంచమే పరమయథార్థమంటే అప్పుడు స్వాతంత్ర్యానికే తావు లేదు. యథార్థవస్తువులు ఈ లౌకికప్రపంచానికి భిన్నమై ఉన్నవని అంగీకరిస్తే, ఆ ప్రపంచానికి లౌకిక కారణతాసూత్రం అన్వయించటానికి వీలుండదు. అప్పుడు ఆ ప్రపంచంలో స్వాతంత్ర్యం ఉన్నదని భావించటానికి అవకాశం ఉంటుంది. "ప్రకృతిలో ఆభాసాలన్నిటికీ సంపూర్ణమైన అనివార్య సంబంధం ఉన్నది. ఈ ఆభాసాలే యథార్థమంటే స్వాతంత్ర్యధ్వంసం సాగించటమౌతుందని చూపటమే నా ప్రయోజనం. వ్యావహారికప్రపంచమే యథార్థమనేవారు ప్రకృతికీ, స్వాతంత్ర్యానికీ సమన్వయం కల్పించజాలరు."

కాబట్టి పారమార్థికప్రపంచం ఉన్నదనీ, స్వాతంత్ర్యం ఆ ప్రపంచంలోనిదనీ కాంట్ సిద్ధాంతం, ధర్మసూత్రం ఉన్నది. లేదని త్రోసివేయ వీలు లేదని అతని అభిప్రాయం. అది ప్రతిమానవుని వివేకంలోను సాక్షాత్కరిస్తుంది. ప్రతి నైతికచర్యకు, ప్రతి ధర్మజ్ఞానానికి ఈ సూత్రమే మూలం. ఈ సూత్రమే లేకపోతే ఇది నీతి, ఇది అవినీతి అని నిర్ణయించటానికే వీలులేదు. కాబట్టి ధర్మస్వరూప విచారసందర్భంలో ధర్మసూత్ర మనేది అసలు ఉన్నదా లేదా 'అన్న ప్రశ్నకే తావు లేదు. ఆ సూత్రం మానవకర్మలను ఎలా అవచ్ఛిన్నం చేస్తున్నది అన్నదే ప్రశ్న.

ధర్మంసూత్రం ఉన్నది. వివేకవంతులైన జీవుల సంకల్పాలను అవచ్ఛిన్నం చేయటమే దీని స్వభావం. ఈ సూత్రాన్ని పాటించినప్పుడు సంకల్పం స్వతంత్రమౌతున్నది. ఈవిధంగా ధర్మం స్వాతంత్ర్యం అనేవి స్వతస్సిద్ధంగా ఉన్నవి. అయితే ఈ ధర్మ స్వాతంత్ర్యాలలో ఏది ముందు, ఏది వెనుక? ధర్మసూత్రజ్ఞానంద్వారా మనకు స్వాతంత్ర్యజ్ఞానం కలుగుతున్నది. ముందు మనకు ధర్మసూత్రం భాసిస్తుంది. ఈ సూత్రం ఉన్నదనీ, తదనుగుణంగా వర్తించాలనీ, జ్ఞానం కలిగినప్పుడు మనం తదనుగుణంగా ప్రవర్తించగలమనీ తద్ద్వారా స్వతంత్రులము కాగలమనీ తెలుస్తున్నది.

స్వాతంత్ర్యం అనేది అతీంద్రియవస్తువు. అందువల్ల దాని యథార్థస్వరూపాన్ని మానవుని తత్త్వజ్ఞానం తెలుపజాలదని కాంట్ వాదం. ధర్మసూత్రస్వరూపంలోనే స్వాతంత్ర్యం ఉన్నది. అయితే ఇది తత్త్వజ్ఞానంవల్ల తెలుసుకోటానికి వీలులేదు.

ధర్మం అనేది కాంట్ మతం ప్రకారం లౌకికార్థాలమీద ఆధారపడలేదు. అది కేవలం పరమమూ సామాన్యమూ అయిన సూత్రంమీద ఆధారపడి ఉన్నది. ఈ ధర్మసూత్రం మనలో ఉన్నది. ఇది తనకనుగుణంగా మన కార్యకలాపాలను సాగించాలని అనుశాసిస్తుంది. అయితే అటు పారమార్థిక ప్రపంచానికీ, ఇటు మన కార్యకలాపాలు సాగుతున్నవన్న భౌతిక ప్రపంచానికీ, చెందినది ఒకటి ఉండాలి. అదే కర్తృసంకల్పం. తన కార్యకలాపాలవల్ల భౌతిక ప్రపంచంలో ఎలాంటి ఫలితాలు ఏర్పడుతున్నవన్న ప్రశ్నతో నిమిత్తంలేకుండా కర్త ధర్మసూత్రాన్ని అనుసరించి తన సంకల్పాన్ని నిర్ణయించుకోవలసి ఉంటుంది. ఎందుకంటే సంకల్పం భౌతికవిషయాలమీద ఆధారపడిలేదు. భౌతికవిషయాలే ఐంద్రియకశక్తిమీద, చింతనాశక్తిమీద ఆధారపడిఉన్నవి. ఒక ప్రత్యేకవ్యక్తి ఒక ప్రత్యేక విషయం అభిలషిస్తున్నాడంటే, అది ఆ వ్యక్తి ప్రత్యేకస్వభావంమీద ఆధారపడి ఉంటుంది. తాను విషయేచ్ఛతో ప్రవృత్తినిమగ్నుడు అవుతున్నప్పుడు ఇతరులు ఇతర విషయేచ్ఛతో ప్రవర్తిస్తారని గ్రహించటం కష్టంకాదు. కర్త ధర్మసూత్రానుసారంగా సంకల్పించుకొన్నప్పుడు తాను తన స్వభావానుగుణంగా కాక స్వతంత్రంగా వ్యవహరించానని గ్రహిస్తాడు. ఈ సూత్రం అందరికీ అవశ్యాచరణీయంగా ఉండాలని అతడు భావిస్తాడు. అయితే లౌకిక జగత్తుకు చెందిన వ్యక్తి పరమూ, సామాన్యమూ, అలౌకికమూ అయిన ఈ సూత్రాన్ని ఎలా నిర్ణయించగలుగుతాడు? ధర్మస్వరూపవిచారానికి ఇది అత్యంతప్రధానసమస్య.

ధర్మవివేకానికి ధర్మాధర్మాలే విషయాలు. పరతత్వసూత్రాలవల్ల ధర్మాధర్మాలు అవతరిల్లుతున్నవి. ఇంతవరకూ తత్త్వవేత్తలు సంకల్పానికి విషయమేదా అని అన్వేషిస్తూవచ్చారు. సుఖమో, అభ్యుదయమో, నిశ్రేయసమో లక్ష్యంగా పేర్కొంటూవచ్చారు. అలా కాక సంకల్ప అవచ్ఛేదకసూత్రంకోసం అన్వేషించి ఉండవలసినది. ఆ తరువాతనే సంకల్పవిషయమేదా అని పరిశీలించిఉండవలసినది. సంకల్పవిషయాలు ముందనీ, ఆ తరువాతనే వాటినుండి ధర్మసూత్రాన్ని నిష్పన్నం చేయవచ్చుననీ భావించారు. ఇది పొరపాటు. ధర్మసూత్రం లౌకికవిషయాలమీద ఆధారపడిలేదు. ఎందుకంటే ప్రకృతిగత విషయ అస్తిత్వం దానికి ముఖ్యం కాదు. సకల్పావచ్ఛేదకత్వంతోనే దానికి సంబంధమున్నది. జ్ఞానమాత్రమైన ఈ సూత్రాన్ని అనుసరించి సంకల్పం తన్ను తాను అవచ్ఛిన్నం చేసుకోగలదు.

సంకల్పం అటు అలౌకికప్రపంచానికి, ఇటు లౌకిక ప్రపంచానికీ చెందినదని చూచాము. కార్యసంకల్పం ధర్మసూత్రానుసారంగా జరిగితే, కర్మఫలం. లౌకికస్థితిగతులను అనుసరించి ఏర్పడుతుంది. అయితే కర్మక్షేత్రంలో ఫలంతో నిమిత్తం లేకుండా ధర్మసూత్రానుగుణంగా వ్యవహరించాలి. ఇలాంటి ఆత్మనిర్ణయమే ధర్మక్షేత్రంలో ముఖ్యం. ఎందుకంటే భౌతిక ప్రపంచంలో ఫలాని ఫలం ఏర్పడాలని ధర్మంసూత్రం ఆదేశించదు. ఆత్మసూత్రానుగుణంగా సంకల్పం అవచ్ఛిన్నమై కర్మను నిర్వర్తించాలని మాత్రమే ధర్మం చెబుతుంది.

కాగా ధర్మానికి సాఫల్య వైఫల్యాలతోను, ప్రయోజన అప్రయోజనాలతోను నిమిత్తం లేదు. కేవలం విధియందలి గౌరవంతో వ్యవహరించాలి. ఈ విధి వివేకవంతమైన జీవకోటికి అంతకూ అవశ్యం అనుష్ఠేయం. కాంట్ సిద్ధాంతంప్రకారం ఇలాంటి విధులు మూడున్నవి.

1. ఇతరులంతా విధిగా ఏ సూత్ర మనుసరించాలని అభిలషిస్తున్నారో ఆ సూత్రాన్ని అనుసరించి ప్రవర్తించు. ఈ సూత్రం కాంట్ పేర్కొన్న దృష్టాంతాలను ఉదాహరిస్తే సుగమమౌతుంది. ఒక వ్యక్తి ఆత్మహత్య చేసుకోవాలనుకొంటాడనుకోండి. ఇది తప్పు. ఎందువల్లనంటే ఇది అందరికీ అనుసరణీయం కాదు. దుఃఖపీడితుడు దుఃఖనివృత్తికోసం ఇతరులు కూడా ఇలాగే వర్తించాలని కోరుకోవచ్చును. ఇలాంటి అవకాశం లేకపోలేదు. కాని అందరూ అతనిలాగా ప్రవర్తిస్తే ఆత్మహత్య చేసుకోటానికి మిగిలేవారు లేకపోతారు. అప్పుడు ఈ విధి నిరర్థకమౌతుంది. కాబట్టి ఆత్మహత్య సామాన్యసూత్రం కావటానికి వీలులేదు. ఈ చర్య స్వతః బాధితమౌతున్నది.

ఒక వ్యక్తి ఆర్థికంగా బాధపడుతున్నాడనుకోండి. ఇతరుల సహాయం పొందుదామనుకొంటాడు. పుచ్చుకొనే అప్పు నిర్దిష్టకాలంలో తిరిగి తీర్చుకొంటానంటేనే అప్పుపుడుతుంది. కాని సకాలంలో తిరిగి అప్పు తీర్చలేనని అతనికి తెలుసుననుకోండి. అయినా అతడు అప్పుచేస్తాడు. ఈ పని తప్పు. ప్రతివాడు తిరిగి ఇస్తానని బూటకపుమాటలు చెప్పి డబ్బు తీసుకోటానికి ప్రారంభిస్తే ఎవడూ మళ్ళీ అప్పు ఇవ్వడు. కాబట్టి ఇలాంటివి సర్వసామాన్య విధులు కాజాలవు.

ఒకడు ఇతరులకు తోడ్పడటానికి శక్తి ఉండి తోడ్పడ దనుకోండి ఇది తప్పు. ఎందుకంటే ఎప్పుడో ఒకప్పుడు తనకు ఇతరుల సహాయం కావలసి రావచ్చును. అప్పుడు ఇతరులు తనకు తోడ్పడాలని కోరుకొంటాడు. అందువల్ల ఇతరులకు తోడ్పడరాదు అన్నది సర్వసామాన్య సూత్రం కావాలని అభిలషించడు.

2. ప్రతిమానవుడు తనకు తానే ప్రయోజనం కాని మరొకదానికి సాధనమాత్రుడు కాడని పరిగణించి వ్యవహరించాలి. అంటే ప్రతివాడు తన్ను తాను గౌరవించుకొంటూ ఇతరులనుకూడా తనవలెనే నిష్పాక్షికంగా గౌరవించాలి. అంతేకాని పరులను కేవలం సాధనమాత్రులుగా వాడుకొని స్వార్థం సాధించటానికి ప్రయత్నించరాదు. నాయకుల కోసమో, రాజ్యంకోసమో, జాతికోసమో, సమాజం కోసమో, పార్టీకోసమో ప్రజలున్నారుకాని ప్రజల ఉనికికి వేరే ప్రయోజనం లేదనటం అధర్మమని కాంట్ సిద్ధాంతం.

3. ప్రతివాడు ఆదర్శరాజ్యంలో సభ్యుడైనట్లుగా ప్రవర్తించాలి. అలాంటి రాజ్యంలో ప్రతివాడు విధివిహితంగా వ్యవహరిస్తాడు. అంటే వివేకవిహితంగా ఇతరుల ప్రవర్తనకు అనుగుణంగా వ్యవహరిస్తాడు. దాని ఫలితంగా అలాంటి రాజ్యంలోని చట్టాలు ప్రతివాడు సంకల్పిస్తాడు. ప్రతివాడు వాటిని ఆచరిస్తాడు. ఈ అర్థంలో ప్రతివాడు అనుశాసకుడుగా చట్టాలు చేసి సభ్యుడుగా వాటిని శిరసావహిస్తాడు.

ఈవిధంగా ధర్మమనేది పరతత్త్వమనీ ఈ తత్త్వానికి వివేకం ఆశ్రయమనీ, అందువల్ల దేశకాలాలతోను, ఆచార వ్యవహారాలతోను, ఆస్తిక్యంతోను, భౌతిక శాస్త్రాలతోను, ఆధ్యాత్మిక శాస్త్రాలతోను నిమిత్తంలేదని తేలుతుంది. కర్మ ఫలప్రదమైనా కాకపోయినా, ధర్మం ధర్మమే. అధర్మం అధర్మమే. ఈ ధర్మం ఒక కాలంలో ధర్మమై మరొక కాలంలో ధర్మం కాకపోదు. ధర్మానికి రాగద్వేషాలతోగాని సుఖ దుఃఖాలతోగాని, దయా దాక్షిణ్యాలతోగాని, ప్రయోజన అప్రయోజనాలతో గాని నిమిత్తం లేదు. కేవల దయాదాక్షిణ్యాలతో గాని, లేక స్వార్థ-చింతతోగాని, విధి నిర్వర్తించటం అవగుణమే కాని గుణం కాదు. విధికోసం విధిని అనుసరించటమే ధర్మం.

ధర్మమనేది వివేకవంతునికి సహజమని కాంట్ అంటాడు. అందువల్ల ఇతరుల నడవడిని సరిదిద్దుదామనీ, ధర్మపథాన నడుపుదామనీ ఎవడూ ప్రయత్నించరాదు. నయాననో, భయాననో, ఆసపెట్టో సత్కర్మలు చేయించరాదు. అసలు చేసే కర్మలు నిజంగా ధర్మస్థాయి పొందాలంటే ఆయా వ్యక్తులు తమకు తాముగా వాటిని నిర్వర్తించాలి. శాసించి చేయిస్తే అవి ధర్మాలు కావు. ఈశ్వరుడైనా శాసించరాదనీ, వ్యక్తికి స్వాతంత్ర్యం ఉన్నదనీ కాంట్ అంటాడు. అయితే విధివిహితంగా వ్యవహరిస్తున్నప్పుడే మానవుడు స్వతంత్రుడు అవుతున్నాడని అతడు అంటాడు. ఈశ్వరుడుకాని, మతాలుకాని, ధర్మశాస్త్రాలుకాని, చట్టాలుకాని అనుశాసిస్తున్నవి కాబట్టి కేవలం తదనుగుణంగా వ్యవహరించటం ధర్మం కాదు. ఇది మన విధ అవి గుర్తించి మనకు మనమై వివేకనిర్దిష్టకర్మలను చేయటమే ధర్మం.

ధర్మమే నిశ్శ్రేయసం. అయితే ధర్మవంతుడైన ప్రతివ్యక్తి ఆనందానికిపాత్రుడు కాబట్టి నిశ్శ్రేయసంలో ధర్మం ఆనందం రెండూ ఉండాలి.

మర్త్యజీవితంలో మానవునికి సంపూర్ణ స్వాతంత్ర్యం, ధర్మం, ఆనందం ప్రాప్తించటం లేదు. కాని యీ మూటిని అతడు సమగ్రంగా పొందాలి. కాబట్టి ఆత్మకు అమృతత్వం ఉంటే తప్ప ఈ పరిపూర్ణతాసాధన కొనసాగటానికి వీలు లేదు. దీనికి తోడు నిర్వర్తితధర్మం, ఆనందప్రదం కావాలంటే ఈశ్వరుడు ఉండాలి. అలా ఉన్నప్పుడే అధర్మం శిక్షితమై ధర్మం ఫలిస్తుంది. అయితే పరిపూర్ణత అనేది మానవ దృష్టిలో ఎప్పుడూ సిద్ధించదు. కాని జీవి అంతకంతకు ఇతోధికాభివృద్ధి పొందవచ్చును.

ఈ విధంగా ధర్మాచరణమే స్వాతంత్ర్యమనీ, ఈ అనుష్ఠానం మానవునికి ఏ అవస్థలోనూ మానరానిదనీ, ధర్మం దేశకాలాలకు, భక్తివిశ్వాసాలకు, ఆచారవ్యవహారాలకు, ప్రతిశ్రుతులకు, అతీతమనీ కాంట్ సిద్ధాంతీకరించి వ్యక్తివివేకానికి పట్టం కట్టాడు. ప్రజాస్వామ్యానికీ, సంపూర్ణదోహదం కల్పించాడు.

అసలు ఈ మానవస్వాతంత్ర్యంకోసమనే వస్తుప్రపంచమనీ, భౌతికప్రపంచమనీ విభజించి ద్వైతానికికూడా దోసిలి ఒగ్గాడు. "*I must, therefour abclish knouledge, to make room for belief*" అని బాహాటంగా ఉద్ఘాటించాడు. స్వాతంత్ర్యానికి, ప్రమాణశాస్త్రానికి (*pure logic*) తిలోదకాలిస్తే ఏకత్వం సాధించవచ్చునని అతనికి తెలుసు. కాని అలాంటి ఏకత్వం నిరర్థకంఅన్న అభిప్రాయంతోనే ద్వైతసిద్ధాంతంతో కాంట్ సంతృప్తిపడ్డాడు.

ఇంతటితో ఈ విషయం వదలి అసలు మనకు ముఖ్యమైన రామణీయకాన్నిగూర్చి కాంట్ ఏమి చెబుతున్నాడో పరిశీలించవలసి ఉన్నది.

# భాస్కర రామాయణము



శ్రీ శిష్టా రామకృష్ణ శాస్త్రి

ఆంధ్రభాషలో మొలుత రచింపబడిన రంగనాథ భాస్కర రామాయణముల కాలకర్తృక నిర్ణయములను గూర్చి భిన్నభిన్నమతములు బయలుదేరినవి. ఆయా కాలములలో నున్న శాసనాది నిదర్శనముల బట్టి పలువురు పండితులు వారికి దోచిన రీతి చర్చించి తమ యభిప్రాయములను వెల్లడించిరి. కందుకూరి వీరేశలింగముగారు భాస్కర రామాయణమందలి యారణ్యకాండను తిక్కన తాత యగు మంత్రి భాస్కరుడును, యుద్ధకాండ పూర్వ భాగమును హుళక్కి భాస్కరుడును రచించిరని విశ్వసించియు, కొన్ని యాక్షేపణల మూలమున నిశ్చయమునకు మాత్రము రాక, యారణ్యకాండ శైలి యుద్ధకాండ పూర్వభాగ శైలికంటె నుత్తమముగా నున్నదని తెల్పిరి. చిలుకూరి వీరభద్రరావుగారాంధ్రుల చరిత్రలో భాస్కర రామాయణారణ్య కాండము సాహిణి మారాంకితమని యంగీకరించిరి కాని నది హుళక్కి భాస్కరుడు రచించెనని వీరు దలచిరని యెన్నను. భాస్కరరామాయణమును గూర్చి వావిళ్లవారి గ్రంథ పీఠికలో మేడేపల్లి వెంకటరమణాచార్యులవారు పూర్వ పక్షసిద్ధాంతములతో యుక్తియుక్తముగ చక్కగ విమర్శించిరి. అందు స్వల్ప ప్రమాదములున్నను నది దేశమును గొంత సమాధాన పఱుపగల్గినది. కాని దరిమిలా భాస్కరరామాయణమున గొన్ని ఘట్టములకు రచనాద్వయము గొన్ని తాళపత్ర గ్రంథములలో గనబడుటచే, డాక్టరు నేలటూరు వెంకటరమణయ్య ఎం. ఏ, పి. హెచ్.డి. గారు తిరిగి తత్కాలకర్తృత్వ చర్చను రగులుగొల్పి ౧౯౩౯ సంవత్సరమున తిరుపతిలో జరిగిన ౧౦ వ అఖిలభారత ప్రాచ్య విద్యా సమావేశమున (*All India Oriental Conference*) నొక వ్యాసమును చదివి, దానినే ౧౯౪౦—౪౧ సంవత్సరము ఆంధ్రపత్రిక యుగాది సంచికలో బ్రచురించిరి. ఈ పాఠాంతర సాధనముతోబాటు పూర్వవాద సాధనములైన కాండాంత ఫలశ్రుతి పద్యములను, నాశ్వాసాద్యంత పద్యగద్య భేదముల నూతగా జోడించి మరల భాస్కర రామాయణ కాలకర్తృక చర్చలను రచ్చకు లాగిరి. అందు పాఠాంతర బలమున వారిట్లు వ్రాసిరి. "ఇట్లు వ్రాయసగాండ్రచే జేర్పబడిన యన్య కవి కృతములగు పద్యములీ భాస్కరరామాయణమున నెన్నియో గలవు." అని యొకచోట "ఆశ్వాసాంతపద్యముల మార్పు లేఖకులు చేసియుందురు" అని యింకొక చోటను," మల్లికార్జునభట్టు కృతమగు మూడు కాండలును, వీరే యరణ్యకాండాది పద్యముల రచయితలని సూచించుచున్నది" అని మఱియొకచోటను వ్రాసి, చిట్టచివరకు తమ వాదమునిట్లు క్రోడీకరించిరి. (౧) రామాయణ రచనాకవు లందరు నేకకాలము వారుగారు. (౨) అయ్యలార్యుడు ౧౫ వ శతాబ్దారంభమున నున్న దేవరకొండ ప్రభువగు పెదవేదగిరి నాయనింగారి యాస్థానకవి. (౩) హుళక్కి భాస్కరుడు, సాహిణిమారుడు, శాకల్యమల్లుడు సమకాలీనులు గావచ్చును. (౪) ఆరణ్యకాండను రచించిన భాస్కరుడు హుళక్కి భాస్కరుడుగాడు. అతడు ప్రాచీనుడు. అతడే అయోధ్యాకాండను రచించెను. అతడే బాలకిష్కింధాకాండలను గూడ రచించెనను తలపున కెడముగలదు. అతడు రచించిన రామాయణము శిథిలమగుటచే నందలి విశిష్టభాగములను బూర్తిజేసుకొని కుమార రుద్రదేవాదు లాయా కాండాదులను దమ కాండనామముల ప్రకటించిరి. (౫) వీరే కాండాద్యంత పద్యములను మార్చి సాహిణి మారాంకితముగ జేసిరి." డాక్టరు నేలటూరు వెంకటరమణయ్యగారు సుప్రసిద్ధ చారిత్రక పరిశోధకులు. వీరినిగూర్చి లోకమునకు దెలియనిది లేదు.

విపరీతమైన యీ నూతన వాదము నూతగా దీసికొని గాబోలు, వారిపేరు వాడకపోయినను, ఆంధ్ర

కవి తరంగిణి రెండవభాగములో శ్రీ చాగంటి శేషయ్యగారు భాస్కర రామాయణమును తిక్కన తాతయైన మంత్రి భాస్కరకవి రచించెనని పూర్వవాదమును రేకెత్తించి యిట్లు వ్రాసిరి. "మంత్రి భాస్కరుడు రామాయణమున నారణ్య కాండమువఱకు రచించెననియు, నీతనినిబట్టియే రామాయణమునకు భాస్కర రామాయణమని పేరు వచ్చినదనియు, నది యే కారణముననో యుత్పన్నమైపోగా, తరువాత కవులు దానిని మరల రచించిరనియు లోకమున ప్రతీతియున్నది. రామాయణము నాతడు పూర్తిగనే రచించెననువాదముగూడ గలదు. (ఆం. క. త. II. పుట. ౬౯). మఱియు "మంత్రి భాస్కరుడు రచింపగా మిగిలిన భాగమును రచించియు, రచించిన భాగమును విపులీకరించియు, సంపూర్ణరామాయణమును లోకమునకీయవలయునని సంకల్పించుకొని, హుళక్కి భాస్కరుడు, మల్లికార్జున భట్టు, కుమారరుద్ర దేవుడు పని చేసిరని యూహింపదగినది" (II. ౧౨౮) చాగంటి శేషయ్యగారి యీ వాక్యములు డా. నేలటూరి వెంకటరమణయ్యగారి పై పలుకులకు ప్రతిధ్వనులనుట యందరికి స్పష్టమేకదా. మఱియు శేషయ్యగారా గ్రంథమున ౧౦౫ వ పుటలో "మంత్రి భాస్కరుని స్థానమును నిలబెట్టి యాతనికి న్యాయము గలుగుటకై ప్రయత్నింపక మాన' ననియు, ౧౨౮ వ పుట లో" భగవదనుగ్రహముండె నేని యీ (భాస్కర రామాయణ) పరిశోధన భాగ్యము నాకు గూడలభింపవచ్చును" అని వ్రాసిరి. పై లోక ప్రతీతికి గారణముగ తిక్కన నిర్వచనోత్తర రామాయణమున వంశవర్ణనలో దన తాతయైన మంత్రి భాస్కరునిగూర్చి యిట్లు రచించినాడు.

సారకవితాభిరాము, గుంటూరువిభుని
మంత్రి భాస్కరు, మత్పితామహునిదలచి,
యైన మన్ననమై లోక మాదరించు
వేఱనాకృతి గుణములు వేయునేల.

మఱియు తానుత్తర రామాయణమును మాత్రమే రచించుటచేతను, గొంతకాలమునకువిమ్మటదేశములో గాకతాళీయన్యాయముగ భాస్కరుని పేరితో రామాయణ పూర్వభాగము మాత్రమే వెలువడుట చేతను, నందు యుద్ధకాండమధ్యవఱకు హుళక్కి భాస్కరుడు రచించెనని యయ్యలార్యుడు చెప్పి నను నారణ్యకాండ గద్య సందిగ్ధ నిరుపపద భాస్క పరముగ నుండుటచేతను, భాస్కరనామ సామ్యమ చేతను, ముఖ్యముగా నీరామాయణమున కృత్య తారిక లేకపోవుటచేత నీవాద ప్రతివాదముల కవకా శము గల్గినది. కాననీ వాదములోని సత్యమును విచారింతును.

కవుల కాలకర్తృత్వ నిర్ణయము పట్ల నీక్రిం ముఖ్యవిషయముల గమనింపవలయు. లేనిచో సత్య తేలదు. (౧) అంతర ప్రమాణము:— కవి స్వం ముగ గ్రంథస్థము చేసినవి. కృత్యవతారికలు, నాశ్వా సాంతగద్యలు మొదలైనవి. దీనిని మించిన ప్రబ ప్రమాణమింకొకటి లేదు. దీని యభావమున ద్వితీ స్థానమాత్ర మించదగినది (౨) బాహ్యప్రమాణము:— లక్షణకర్తలు, నితర కవులు వ్రాసిన వ్రాతల శాసనములు మొదలైనవి. ఇది మొదటిదానిని పోషించుటకు గూడ పనికివచ్చును గాని, మొదటిదాని తిరస్కరించుటకు దగినంత బలము దీనికి చాల ఇక మూడవది (౩) శైలి:— ఇది పైవానిని స ర్థించుటకు సహాయకారిగాగలదు కాని స్వతంత్రం కాలనిర్ణయమునకు పనికిరాదు. ఎందుకన, చాల ప్రమాదకరమైన గుణము గలది. ఏల శైలి కవి ప్రత్యేకశక్తి సామర్థ్యముల మీద నాధా పడియున్నను, ముఖ్యముగా కథాసందర్భము నా యించుకొని యుండును. ఒక్కకవియే భిన్నస వేశములందు భిన్న శైలి ననుసరించును. మఱియు మఱియొక సంకటముగూడ గలదు. పఠితల యభిరు భేదములననుసరించి శైలియోగ్యతలు మారుచుండు ఇంకొక ప్రమాదముగూడ దీనగలదు. ఒకప్పుడొకరి నింకొకరనుకరింతురు. శబ్దజాలమును, శబ్దాలంకార లనుగూడ ననుకరించి భ్రాంతిగొల్పుదురు. దాన దీని నాధారపడి నిర్ణయించుట ప్రమాదమంటిని. తర్వాత (౪) జనశ్రుతి:— పైమూడుసాధనము లేనిచో దీనిని బట్టికొంతవరకు తాత్కాలిక కార్యసాధనకు ప్రయత్నింపవచ్చును. కొంతకాల నకు బాహ్యాంతర ప్రమాణములు దొరికినచో నీజనశ్రు మారవచ్చును. కాన కేవలము దీనిమూలముననే ని యించుటకిది నిశ్చలమైనదిగాదు. లోకము కాక పాలు. ఇతరాధారములులేని జనశ్రుతి తలకొక తల స్వతంత్రముగా దీనిపై కాలనిశ్చయముచేయబ

నుచో నిది శైలికంటె నొకప్పుడెక్కువ దోషకారి యగును. జనశ్రుతులు, ప్రవాదులు, పైనజూపిన బాహ్యాంతర ప్రమాణములచే పటాపంచలగు చున్నవి. ఇందులకు తార్కాణముగా నాంధ్రవాఙ్మయ విషయమున నన్నయ భారతరచనా విఘ్నమునకు భీమనాథర్వణులకథలు. నన్నయ తిక్కనలు సమకాలము వారనుకథలు. తెనాలిరామకృష్ణ కృష్ణదేవరాయలకథలు. సంస్కృతమున నిట్టివే భోజకాళిదాసుల కథలు. ఇకవిజ్ఞానశాస్త్ర ప్రయోగనిదర్శనముల మూలమున ననేకయంధవిశ్వాసములు, జనశ్రుతులు, విధ్వస్తములగు చున్నవిగదా. కాన జనశ్రుతి ప్రత్యక్ష ప్రమాణముల ముందు నిలువలేదు. చివరిది (౫) వాదపద్ధతి:– ఇందుముఖ్యముగ గొన్నినియములు పాటింపవలసి యున్నది. హేతువాదమున పూర్వపక్షము కంటె, సమాధానము బలహీనమై, నీరసమై, పూర్వపక్షమే ప్రబలతరముగా నున్నప్పుడా సమాధాన వాక్యములు ప్రమాణముగా గ్రహింపబడక, దానినికొట్టివేసి పూర్వపక్షమతము నే గ్రహింపవలెగాని, మట్టిబండియైనను ముందే పోవలెనని యొంచగూడదు. ఇంకొకటి ప్రక్షిప్తవాదము:— తనవాదన కనుకూలింపని మాత్రమున నెంతప్రబల నిదర్శనవాక్యమునైన ప్రక్షిప్తముని కొట్టివేసి, దుర్బలవాక్యములకు ప్రామాణిక మొసంగకుండుట మఱియొకటి, సర్వాంగీకారమై, మితపరిమాణముగల పరిమాణ సంఖ్యల నవలంబించుట. ఉదా: వంశానుక్రమణ కాలనిర్ణయమునకు తరమునకు ౨౫ లేక ౩౦ సం. మాత్రము గ్రహించుట మొదలైనవి. ఈ నియమములను బాటించుచు సత్యాన్వేషణమునకు బ్రయత్నించుచో ఫలములు సంతృప్తి కరముగ నుండును. లేనిచో నెవరికి వారే యమునాతీరే.

(౧) మంత్రి భాస్కరుడు రామాయణమును రచించెనన్న లోకప్రతీతికి సంతృప్తికరమైన ప్రమాణమేదైనగలదా, లేక యూహామాత్ర జనితమాయనియు, నా లోకప్రతీతి యెప్పటినుండి బయలుదేరినదియు, నాలోకప్రతీతి సందేహాస్పదముగ నున్నదో, లేక సుస్పష్టముగ, నిస్సందేహముగ నున్నదాయనియు విచారింపవలసి యున్నది. ఈ లోకప్రతీతిని విశ్వసించియే కాబోలు కందుకూరి వీరేశలింగముగారు భాస్కరరామాయణమున నారణ్యకాండను మంత్రి భాస్కరుడు రచించెనుభావము సాంధ్రకవుల చరిత్రలో సూచించిరి. యథార్థమునకు మంత్రి భాస్కరుడనిగాని, కేతన భాస్కరుడనిగాని, లేక భాస్కరప్రెగ్గడయని కాని నిస్సందేహమై, సుస్పష్టముగనుండ, నుపపదసహితమైన భాస్కరకవికృత రామాయణము గలదని తెలుపు నొకపద్యముగాని, గద్యగాని, శాసనముగాని యింతవఱకెక్కడ లేదనుటనిశ్చయము. మంత్రిభాస్కరుడు రామాయణమును రచించెనని యతని మనుమడైన తిక్కన సోమయాజిగాని, దశకుమారచరిత్రమున తిక్కన వంశవర్ణనమును జేసిన కేతనగాని చెప్పలేదు సరికదా, మార్కండేయపురాణ కర్తయు, తిక్కనశిష్యుడు నగుమారనగాని, కేయూరబాహుచరిత్రకర్తయగు మంచనగాని, హుళక్కి భాస్కరుని కాలమైన క్రీ. శ. ౧౩౨౦ వఱకుగల కవులెవరు మంత్రి భాస్కరకవిని పూర్వకవులస్తుతులలో స్మరింపలేదని శేషయ్యగారే యంగీరించిరి. (చూ. ఆం. క. త. II. 70 పుట) క్రీ. శ. ౧౩౨౦ వఱకు భాస్కర రామాయణ ప్రసంగ మేమూల నెవరు వినలేదని యందలి ౨౫ వ పుటలోనే శేషయ్యగారు చెప్పచున్నారు. అనగా నాలోకప్రతీతి ౧౩౨౦ వరకు బయలుదేర లేదనుట స్పష్టమే కదా. క్రీ. శ. సుమారు ౧౪౦౦ ప్రాంతమునాటి క్రీడాభిరామమున.

నన్నయభట్టు తిక్కకవి
నాయకులన్న, హుళక్కి భాస్కరుం
డన్నను, జిమ్మపూడియము
రాధిపుడన్నను, సత్కవీశ్వరుల్
చెన్నుదు టంగరాంజలులు
నింతురు జేయని, రావిపాటితి
ప్పన్నయు నంతవాడు తగు
నా యిటుదోసపు మాటలాడగన్.

హుళక్కి భాస్కరుడని స్పష్టముగ జెర్కొనబడెను. ఆ సమీపకాలముననే కొఱవి గోపరాజు ద్వాత్రింశత్సాల భంజికలో,

అనఘుహుళక్కి భాస్కరు,
మహామతి పిల్లలమఱ్ఱి వీర రా
జును, ఘనునాగరాజు,
కవిసోముని, ధిక్కన సోమయాజి గే
తన, రంగనాథు, నుచితజ్ఞుని
నెఱ్ఱన, నాచిరాజు సో

ముని, సమరేశ్వరుందలంతు
మత్కులచంద్రుల సత్కవీంద్రులన్.

అని హుళక్కి భాస్కరుడని స్పష్టముగ పేర్కొనినాడు. అనంతామాత్యుడు భోజరాజీయమునందును, రాజరాజభూషణుడు వసుచరిత్ర యందును నిరుపపదముగ భాస్కరుడని పూర్వకవి స్తుతి పద్యములలో వ్యవహరించిరి. భాస్కరకవిని పేర్కొన్నవారిలో గొందరైనను హుళక్కి భాస్కరుడని స్పష్టముగ పేర్కొనిరి. కాని యెక్కడైనను మంత్రి భాస్కరకవియని గాని, కేతన భాస్కరుడని గాని, భాస్కర ప్రెగ్గడయని గాని సందేహరహితముగ పేర్కొనలేదు. నిరుపపదముగ వాడిన భాస్కరకవి ప్రశంస మంత్రిభాస్కరున కన్వయించుననియు, "వీరు తమకావ్యములలోనే భాస్కరుని మనమునందుంచుకొని స్మరించిరో నిర్ణయింపజాలను" అని శేషయ్యగారు వ్రాసినారు (మా. ఆం. క. త. *II.* ౬౦.) భాస్కరుని స్తుతించిన తర్వాత కవులమనసులలో భాస్కరులగూర్చి యీ వికల్పము లేనేలేదు. వారి మనసులలో నిద్దరు భాస్కరకవు లున్నచో భాస్కరకవిద్వయ మనియేస్తుతించెడివారు. ప్రత్యేక వ్యక్తిని పేర్కొనవలసినవారు హుళక్కియని గాని, మంత్రియని గాని యుపపదమును జేర్చి వాడియుందురు. అట్లెవరు వాడకపోవుటచే రామాయణకర్తలలో భాస్కరకవిద్వయము లేదనుట స్పష్టము. రామాయణ కర్తలలో హుళక్కి భాస్కరుడు గలడని యయ్యలార్యుడు దెలిపెనుగదా. కొఱవి గోపరాజును, క్రీడాభిరామకర్తయు స్పష్టపఱచిరికదా. ఇక మల్లికార్జునభట్టుగద్యలో "భాస్కర సత్కవి పుత్ర' అను పదమునకు హుళక్కి భాస్కరుడే యని యంగీకరించిన చా. శేషయ్యగారు (మా. ఆం. క. త. *III.* ౨౧౬.), కుమార రుద్రదేవుడు అయోధ్యాకాండ గద్యలో 'సాహిణి మారయకుమార' యనుటకు నిరుపపదముగ "మారయకుమార కుమారరుద్రదేవుడని" వాడుట కంగీకరించిన శేషయ్యగారు, ఇతర కవులస్తుతులలోను, అరణ్యకాండగద్యలలో నిరుపపదముగ వ్యవహరించిన భాస్కరుని, హుళక్కి భాస్కరుడేయని యెందుల కంగీకరింపరో తెలియకున్నది. రామాయణకవిగా ద్వితీయ భాస్కరుని, యధార్థమెరుగని నవీనులు గొందఱు గల్పించిరి గాని ప్రాచీనులు గ్రహింపలేదు. చా. శేషయ్యగారు తలంచినట్లు మంత్రి భాస్కరుడెంత సుప్రసిద్ధుడో, ద్వితీయ ప్రతాపరుద్రుని సభలో ప్రథమముగా పేర్కొనబడిన హుళక్కి భాస్కరకవిగూడ నంత ప్రఖ్యాతి గణించిన కవియేకాని యనామకుడు గాడు. కాన లోకమున రామాయణరచయితలైన యిద్దరు భాస్కరకవు లున్నచో, నిష్పాక్షికముగ, నిస్సందిగ్ధముగ, నిస్సందేహాస్పదముగ భాస్కరకవిద్వయమనియే కవిస్తుతులలో వాడబడి యుండెడివారు. లేదా, మంత్రి, హుళక్కి పదములను జేర్చియే వాడియుండెడివారు. అందుచే వారి మనసులలో గాని, లోకప్రతీతిని వాడు లౌకికుల మనసులలో గాని రామాయణ కవులైన భాస్కరకవిద్వయము లేదనుట స్పష్టము. హుళక్కి భాస్కరునే, భాస్కరకవియని సాధారణముగ మల్లికార్జున భట్టు వాడినట్లు లోకమంతా వాడినదనుట దృఢము. ఈ నామసామ్యావకాశమును గ్రహించి హుళక్కి భాస్కరుని కీర్తిలో భాగమును పంచి మంత్రిభాస్కరునికి గల్పించ నవసరము లేదు. కాన నీలోకప్రతీతి కేవల మూహామాత్ర జనితమే కాని ప్రామాణికమైనది కాదు.

(౨) తిక్కన యుత్తర రామాయణ రచనకు గారణము :— ఉత్తరరామాయణమును తిక్కన రచించెనుగాన, నందు తన తాత సత్కవియని చెప్పికొనెను గాన, పూర్వరామాయణమును మంత్రి భాస్కరకవి రచించియుండునని మఱియొక యూహ. కాని తిక్కన, తన తాత పూర్వరామాయణమును రచించెనని చెప్పలేదు కద. తిక్కన యుత్తర రామాయణమును రచించుటకు గారణము గోనబుద్ధారెడ్డి పూర్వరామాయణమును రచించుటచేతనే యనియు, రంగనాథరామాయణమే యాంధ్రమున ప్రథమ రామాయణమనియు నాంధ్ర విశ్వకళా పరిషత్తువారు ప్రకటించిన రంగనాథ రామాయణ పీఠికలో శ్రీ పింగళి లక్ష్మీకాంతం, ఎం. ఏ. గారు వ్రాసిరి. (మా. పుటలు. ౫, ౬, ౯,) కాని యివన్నియు యధార్థములు గాజాలవు. ఒకవేళ మంత్రి భాస్కరుడు పూర్వరామాయణమును రచింప, దానిని పూరించుటకై తిక్కన యుత్తరరామాయణమును రచింపదలచినచో నావిషయమును స్పష్టముగ, ద్విపద రామాయణమున గోనకాచ విభుడును, విఠలరాజు చెప్పికొనినట్లే క్రింది రీతిని,

గోన కులార్ణవ కువలయేశుండు
నా నొప్పు గోనగన్నక్షితీంద్రునకు,
ననఘాత్మయగు చున్న నన్నమాంబికకు
దనయుండు, సాహిత్య తత్త్వకోవిదుఁడు,
దానప్రసిద్ధుఁడు, ధర్మశీలుండు
భూనుతాచారుండు బుద్ధభూవిభుఁడు,

*       ”       *

తెలుగున నొప్పుగా ద్విపదరూపమున
నలిపూర్వరామాయణమును జెప్పి.

*       *       *

మనము బిల్వబంచి

*       *       *

నాకుల దీపకుల్ నాసుణాన్వితులు
నాకీర్తి వర్ధనుల్ నాకూర్మిసుతులు,
గాన నాపూనిన కథ యెల్లజనులు
మానుగా గొనియాడ మధురవాక్యముల
నెమ్మిఁజెప్పుడు మీరు నిపుణులైయనుచు
మమ్ము పంచిన మేము మాతండ్రి ప్రతిన
చిరకీర్తి లెసగంగ జెల్లింప గనుట
పరమ ధర్మంబని భక్తితోఁగోరి

*       *       *

వినుత నూతన పదద్విపద రూపమునఁ
బ్రాకటమ్ముగ నాంధ్రభాషను జెప్పఁ
గైకొన్న యుత్తరకథ యెట్టిదనిన”—
(ద్విపదోత్తర రామాయణావతారిక)

అనురీతి గాఁ జెప్పియుండును. తిక్కన భారతరచనా సందర్భమున విరాటపర్వారంభమున దన రచనకు గారణమును:

ఆదరణీయసార విని
ధార్థగతి స్ఫురణంబు గల్గి యా
స్వాదపర్వనిర్వహణ
సంభృతమై పెనుపొంది యుండ నం
దాదిఁ దొడంగి మూఁడు కృతు
లంధ్రకవిత్వవిశారదుండు వి
ద్యాదయితుండొనర్చె మహి
తాత్ముఁడు నన్నయభట్టు దక్షతన్
హృదయాహ్లాది చతుర్థమూర్జితకథో
శితంబు నానారసా
భ్యుదయోల్లాసి విరాటపర్వమట ను
ద్యోగాదులుంగూడఁ గాఁ
బదునేనింటఁ దెనుంగుబాస జనసం
ప్రార్థ్యంబులై పెంపునన్
దుదముట్టంగ రచించుటొప్పు బుధ సం
తోషంబు నిండారగన్.

అని స్పష్టముగ జెప్పికొనినట్లుగ దన యుత్తర రామాయణ రచనమునకు గారణమును జెప్పికొనియే యుండునుగదా. అట్లు గాక, పూర్వ రామాయణముతో సంబంధము లేక, తన నిర్వచనోత్తర రామాయణరచనకు గారణముగా,

ఎత్తఱినైనను ధీరో
దాత్తనృపోత్తముడు రామధరణీపతి స
ద్వృత్తము సంభావ్యమగుట
నుత్తర రామాయణోక్తి యుక్తుడనైతిన్.

అని స్వతంత్రించి, పూర్వరామాయణ మాంధ్రమున లేకపోయిననుగూడ తాను రచించుటకు గల కారణమును దెల్పెను. కాని తన తాతయైన భాస్కరమంత్రి కృత పూర్వరామాయణమును పూరించుటకు గాదు. అట్లు పూరించుటకే యగుచో తిక్కనమంత్రి భాస్కరుడు రచించెనని తలంచు చంపూమార్గమును పరిత్యజించి సంస్కృత కావ్యరీతిని నిర్వచనమున రచించి యుండడుగదా. చంపూ మార్గముగల మంత్రి భాస్కర రచితపూర్వరామాయణమునకీ నిర్వచన పద్ధతి యతికి యుండదుగదా. నన్నయ భారత పర్వత్రయమునకు సరిగా నతుకుటకైకదా, తాను పూర్వముత్తర రామాయణమున నవలంబించిన నిర్వచన పద్ధతిని మార్చికొని చంపూ మార్గమును గైకొనిన తిక్కన, రామాయణ పూరణ సందర్భమున భాస్కరమంత్రి యవలంబించిన చంపూ మార్గమును వదలి భిన్నపద్ధతి గ్రహింప నేల? కాన, భాస్కరమంత్రి రచిత పూర్వరామాయణ పూరణార్థము తిక్కన యుత్తర రామాయణమును రచింప లేదని నిర్ణయింపవచ్చును.

పింగళి లక్ష్మీకాంతం గారు తలచినట్లు తిక్కన యుత్తర రామాయణమును రచించుటకు బుద్ధారెడ్డి రచిత పూర్వ రామాయణముగూడ కారణము గాదు. అట్లేయగుచో దాని కతుకుటకై ద్విపద మార్గము నే తిక్కన స్వీకరించి యుండును.

మరియు బుద్ధారెడ్డి క్రీ. శ. ౧౨౮౦ ప్రాంతము వాడని వీరు రంగనాథరామాయణ పీఠికలో వ్రాసిరి. తిక్కన ౧౨౬౦ ప్రాంతమువాడనిరి. ఈ ౨౦ సంవత్సరములలోపుననే బుద్ధారెడ్డి పుత్రు లుత్తరరామాయణమునుగూడరచించియే యుందురని ద్విపదోత్తర రామాయణ కృత్యవతారికనుబట్టి తెలియగలదు. మఱియు నింకొక విశేషము. బుద్ధారెడ్డికాలము ౧౩౦౦ ప్రాంతమైయుండునని ౧౨౭౬ సంవత్సరము బూరుపురపు శాసనమునుబట్టి గ్రహింపనగును. శేషయ్యగారి యుద్దేశము గూడనిదియే. పి. లక్ష్మీకాంతంగారు గూడనట్లు నిర్ణయింపకుండుటకు తిక్కన నిర్వచనోత్తర రామాయణ రచనా సమస్యసాధన కొఱకే యట. (చూ. రంగనాథ రామాయణ పీఠిక.) అందుచే బుద్ధారెడ్డికాలము తిక్కన కాలము దాటిపోగూడదట. ఇక శేషయ్యగారి మతమున బుద్ధారెడ్డి, ద్వితీయప్రతాపరుద్రుని సమకాలము వాడైన పాల్కురికి సోమనాథునికి పూర్వము వాడై యుండరాదట. కాని పాల్కురికి సోమనాథుని ప్రథమ ప్రతాపరుద్రుని కాలమువానిగా భావించి, యతనికి తర్వాతకాలమువాడే బుద్ధారెడ్డియని పింగళి లక్ష్మీకాంతంగారు గూడ రంగనాథ రామాయణ పీఠికలో నంగీకరించిరి. ఇందులూరి అన్నయ మంత్రి శాసనమువలన పాల్కురికి సోమనాథుడు ద్వితీయ ప్రతాపరుద్రుని కాలమువాడని స్పష్టపడుటచేతను, బుద్ధారెడ్డి పాల్కురికి సోమనాథుని తర్వాతవాడని పి. లక్ష్మీకాంతంగారు పూర్వమే యంగీకరించుట చేతను (చూ. రం. రా. పీఠిక పుట ౧౨.) బుద్ధారెడ్డి కాలము ౧౩౦౦ తర్వాతనేయని లక్ష్మీకాంతంగారు గూడ నంగీకరింపకతప్పదు. కాన బుద్ధారెడ్డికృతికి పూర్వ రామాయణమున కుత్తర భాగమునుపూరించుటకై క్రీ. శ. ౧౨౬౦ ప్రాంతమువాడైన తిక్కన యుత్తర రామాయణమును రచించెనను ఊహాగూడ సమంజసముగారు.

ఐనచో తిక్కన యకస్మాత్తుగా పూర్వరామాయణమును వదలి యుత్తరరామాయణము నేల రచించెననుటకు సమాధానము తిక్కన పైపద్యమున కతివ్యాప్త్యవ్యాప్తి దోషములేకుండ నున్నదున్నట్లు అర్థము చెప్పుటయే. కంకంటిపాపరాజుత్తరరామాయణమును మాత్రమేల రచించెనో, యట్లే తిక్కన గూడ గ్రహించి యుండును. లేదా, భవభూతి యుత్తరరామచరిత నాటక ప్రశస్త్యాకర్షణము వలననైన రచించి యుండవచ్చును. అట్లైయగుచో సంస్కృత నాటకములను శ్రవ్యకావ్యములుగా నాంధ్రీకరించుటకు మంచన, పిల్లలమఱ్ఱిపినవీరన, నందిమల్లయ, ఘంటసింగనాదులకు తిక్కనయే మార్గదర్శకుడయ్యెనని భావింపవచ్చును. లేదా, తిక్కన ప్రథమ ప్రయత్నముగ నొక చిన్న స్వయంసంపూర్ణమైన కావ్యమును చక్కగ రచింపదలచి, పవిత్రనాయకుడైన శ్రీ రాముని కథను చేపట్టదలచి, షట్కాండలు గల పూర్వరామాయణ ముద్గ్రంథమగునుగాన, దానిని చేపట్టిన నిర్విఘ్నముగ తన జీవితకాలములో సంపూర్ణముగ రచింపగల్గునో లేదో, నన్నయకువలె విఘ్నములు వచ్చునేమోయని శంకించి, శ్రీనాథుడు పురాణములందలి ఖండముల నాంధ్రీకరించి స్వయంసంపూర్ణకావ్యముల రచించినట్లుగ, రామాయణోత్తర కాండమును మాత్రము గ్రహించి యుండును. అందుచేతనే తిక్కన, "ఎత్తఱి నైనను ధీరోదాత్తనృపోత్తముడు" అని సమర్థించెనే కాని, యప్పటికే పూర్వ రామాయణము కొంతయైనను రచింప బడి యున్నచో భారతవిషయమునవలె నున్నదున్నట్లు చెప్పుటకు దాపరిక మేలకావలయు. ఇందులో తెర మాటును, ముసుగులో గ్రుద్దులాటయు నేల. పండితైక గోచరముగను, వ్యంగ్యముగను చెప్పవలసిన యావసరమే మున్నది. భాస్కరాంధ్రీకృత పూర్వరామాయణ మప్పటికి లేకపోవుట యేయని స్పష్టముగదా.

(౩) మంత్రి భాస్కరుని రామాయణము ప్రాగభావమా, ప్రధ్వంసాభావమా :— నన్నయతోడి వేములవాడ భీమనాగర్వణాచార్యులవంటి కల్పిత కథలు గాని, పోతన— సర్వజ్ఞసింగనవంటి ప్రహిదులు గాని, భాస్కరమంత్రి రామాయణ ముత్పన్నమగుట కితని పక్షమున లేవు. అదియు కాక మంత్రి భాస్కరుని పుత్రపౌత్రులు మహాకవులు. వారి శిష్యులుగూడ గురువంశమం దభిమాన పరులు. అట్టితఱి మంత్రిభాస్కర రామాయణము చెదలుపాలు గాకుండ భాస్కరుని జ్యేష్ఠపుత్రుడైన, కాదంబరికర్త యగు కేతనప్రెగ్గడ పితృగ్రంథమును రక్షించియుండును. అసంపూర్ణముగ నుండినచో పూరించగల సమర్థుడు గూడ గాన, నతడేల యాకావ్యమునకు బూనుకొన లేదు. ఇక పౌత్రుడుగూడ తాతగారి రామాయణ






USHA

మును దేవతార్చన పేటికయందుంచి రక్షించి యుండును. పూరించవలసినచో యుద్ధవర్ణనా నైపుణ్యముతో భారతయుద్ధపంచకమువలె రామాయణ యుద్ధకాండను రచించియుండును. తిక్కనకు కేతన వంటి మిత్రులనేకులును, మారనవంటి శిష్యులు పలువురునుండి తాను కులపతివలెనుండెడి వాడని తెలియుచున్నది. కాన వారందఱు తిక్కన భారతముతో బాటు, తిక్కనతాతగారి రామాయణమునకుగూడ, నందలి కవితాభిమానమునను, రామకథాగౌరవము ననుగూడ పవిత్రముగ భావించి, బహుప్రతులను వ్రాసికొనిపోయి భద్రముగ రక్షించియుందురు. అవన్నియు శిథిలమైనవనుట సంభావ్యము గాదు. మారన తనమార్కండేయ పురాణమును నాగయ్య గన్నమంత్రియను ద్వితీయ ప్రతాపరుద్రుని సేనానులలో నొకని కంకితముచేయుటచే నతని కాలమువఱకు మంత్రి భాస్కరుని రామాయణము సురక్షితముగ నే యుండియుండును గదా. ద్వితీయప్రతాప రుద్రుని కాలమువాడేగదా హుళక్కి భాస్కరుడు. ఇట్టిచో మంత్రిభాస్కరుని రామాయణ ముత్సన్నమగుటకు గాని, యితరులు పూరించుటకు గాని, సంస్కరించుటకు గాని యవకాశమే లేదు. కాన మంత్రిభాస్కర రామాయణోత్సన్నవాద మసత్యకల్పన మనుమాట నిశ్చయము. కాన క్రీ. శ. ౧౩౨౦ వఱకు భాస్కర రామాయణ కర్తగాని, భాస్కర రామాయణ కావ్యము గాని, తదుత్సన్నజనశ్రుతి గాని లేదనుట సత్యము. కాబట్టి భాస్కర రామాయణము ప్రాగభావమే కాని, ప్రధ్వంసాభావము గాదనుట స్పష్టము.

(౮) అయ్యలార్యుని విషయము :— భాస్కర రామాయణ యుద్ధకాండ శేషమును రచించిన యయ్యలార్యుడాశ్వాసాంత గద్యనిట్లు రచించెను. "ఇది శాకల్యమల్లకవి వీరనరసింహావరజాప్పలార్య నందనోభయ భాషాకవితా విశారద, శారదా చరణకమలపరిచరణపరివృఢమానసాయ్యలార్య విరచితంబైన శ్రీరామాయణమహాకావ్యంబు నందు యుద్ధకాండ శేషంబు సర్వంబు నేకాశ్వాసంబు"— ఈ గద్యనుబట్టి యయ్యలార్యుడు శ్రీ శాకల్య కవియొక్కయు వీరనరసింహుని యొక్కయు తమ్ముడైన యప్పలార్య నందనుడని కందుకూరి వీరేశలింగంగారు వ్యాఖ్యానము చేసినారు. డా. నేలటూరు వెంకటరమణయ్యగారు, చా. శేషయ్యగారును అయ్యలార్యుడు శ్రీ శాకల్యకవి యొక్క కుమారుడైన వీర నరసింహుని తమ్ముడైన అప్పలార్యుని పుత్రుడని యన్వయించినారు. అనగా శ్రీ శాకల్య కవి మనుమడని వీరి భావము. ఈ గద్యకు రెండు విధములను గూడ నర్థము చెప్పవచ్చునని శేషయ్యగారే యంగీకరించినారు. (ఘూ. ఆం. క. త. *IV*. 154.) అయ్యలార్యుడు ప్రసిద్ధ శాకల్యభట్టుయొక్క మనుమడే యగుచో స్పష్టముగ గద్యలో "శాకల్యమల్లపౌత్ర అప్పలార్య నందనుడ"నియే వ్రాసికొనియుండును గాని, తన తండ్రి యగు నప్పలార్యుడు, శ్రీ శాకల్య కవియొక్క కుమారుడైన వీరనరసింహుని తమ్ముడని, "అగస్త్య భ్రాత" యనినట్లును, తద్దినము పెట్టువాని తమ్ముడని నట్లును ద్రవిడ ప్రాణాయామమున చెప్పికొనడుగదా. కాన శాకల్యమల్లుడు వీరసింహునితోబాటు అయ్యలార్యునకు పెద్ద తండ్రి యనియే తలచుట యుచితము. అతడుగూడ శాకల్యభట్టుతో గూడ ప్రతాపరుద్రుని సభలో, హుళక్కి భాస్కరునితోబాటు అతని పుత్రుడైన మల్లికార్జునభట్టువలె నుండి యుండును. అందుచే హుళక్కి భాస్కరునికి శాకల్యభట్టుతోబాటు అయ్యలార్యుడు గూడ మిత్రుడై యుండునని పురాణ నామ చంద్రికకర్త యూహించి వ్రాసియుండును. అంతమాత్రముచే నయ్యలార్యుడు మిత్రుడని, కుమార రుద్రదేవుడు భాస్కరునికి శిష్యుడని వారు వ్రాసికొనకపోవుట లోప మని యాక్షేపింపరాదు. మిత్ర శిష్యులు కాకపోయినను రామాయణ రచన కంతరాయము రాదు. అట్లుగాక అయ్యలార్యుడు వేదగిరిరాయనింగారి ప్రేరణమున యుద్ధకాండశేషమును రచించుచో, హుళక్కి భాస్కరుని రచనమును సూచించినవాడాయన విషయమును గూడ వ్యంగ్యముగనైన సూచించుటకాని, యతనిని స్తుతించుటకాని చేయలేదే. అయ్యలార్యుడు వేదగిరిరాయనింగారి కాలమువాడని చెల్పు దాన శాసనములు గాని, యయ్యలార్యుడు వేదగిరిరాయనింగారికి కృతియిచ్చిన యితర కృతులేవైనను గాని లేవు. కాన నా విషయము సత్యమైయుండదు. తర్వాతి లేఖకు లెవ్వరో యూహించి కొన్ని ప్రతులలో మాత్రము వేదగిరిరాయని విషయమును జేర్చియుందురు. అయ్యలార్యుడు క్రీ. శ. ౧౪౦౦ ప్రాంతపు వేదగిరిరాయనింగారి కాలమువాడే యగుచో, భాస్కర రామాయణయుద్ధకాండ శేష

మంతవఱకు నసంపూర్తిగనే యున్న దనవలయును. కాని యట్లుండుట నిర్హేతుకము. హుళక్కి భాస్కరుని మరణానంతరమైన నతని పుత్రుడగు మల్లికార్జున భట్టు, పూర్వమే మూడు కాండములు రచించినవాడగుటచే యుద్ధకాండ శేషమును తప్పక సమర్థతతో బూరించియుండెడివాడు. లేదా, కుమారరుద్రదేవుడైన నా పనికి బూనికొనియుండెడివాడు. కాని యంతకాల మసంపూర్తిగ నుండదు. అట్లు సంపూర్తిగా నుండవలయు ననిన, హుళక్కి భాస్కర సాహిణమారులు మాత్రమే కాక, మల్లికార్జునభట్టును, కుమారరుద్రదేవుడును గూడ నకస్మాత్తుగ నకాల మరణ మొందినగాని సాధ్యము గాదు. అది యసంభావ్యము. మఱియు నీ యసంపూర్ణగ్రంథమును సాహిణమారున కంకిత మొనర్చుటగాని, యతడు స్వీకరించుటగాని యసమంజసము. అది మొదటనే యతని కంకిత మీయ నిర్ణయింపబడిన దనినచో, నన్నయ్య భారతమువలె దీనికి గృత్యవతారిక లేకపోవుటచే నదియు విశ్వసింపదగినది కాదు. కాన నయ్యలార్యుడు శాకల్యమల్లుని తమ్ముని కుమారుడై, హుళక్కి భాస్కరుని సమకాలమువాడై రామాయణ రచనకు సాయపడెనని భావించుటయే సమంజసముగ నుండును.

హుళక్కి భాస్కరుడు రామాయణమును శీఘ్రకాలములో సలక్షణముగ, సంపూర్ణముగ నాంధ్రీకరించుటకై తన కుమారుడైన మల్లికార్జునభట్టును, కృతిపతి కుమారుడైన కుమారరుద్రదేవుని మాత్రమే మొట్టమొదట సాయముచేసికొని, యొక్కొక్కరు రెండేసి కాండములవంతున చొప్పున షట్కాండలను వ్రాయుట కంచనా వేసికొని, మొదటి మూడుకాండలను నిర్విఘ్నముగ రచించినపిమ్మట మిగిలిన మూడు కాండముల నదే క్రమమున గ్రహించి రచించి షట్కాండలను బూర్తిచేయవచ్చునుకదాయని తలచియుండును. ఇందులో మూడవకాండయగు నారణ్యకాండమును, నారవదియగు యుద్ధకాండమును శుభేతరములగుటచే వర్ధిష్ణువులగు మల్లికార్జున భట్టకుమారరుద్రదేవుల వంతున కీయక, యనుభవశాలియు, వృద్ధుడునగు తన వంతునకు గ్రహించియుండును. అందుచే బాలకాండమును మల్లికార్జునభట్టునకును, నయోధ్యాకాండమును కుమారరుద్రదేవునకు నొసగి, తా నరణ్యకాండమును గైకొని ముగ్గురు నొక్కమారే ప్రారంభించియుందురు. అంతేకాని కం. వీరేశలింగంగారు తలచినట్లు మొట్టమొదటనే యయ్యలార్యుడు రామాయణ రచనమున భాస్కరాదులతో జేరియుండలేదు. అట్లే చేరియున్నచో, నందలి నాల్గవ కాండమైన కిష్కింధాకాండము నయ్యలార్యునికిచ్చి, హుళక్కి భాస్కరుడు నాల్గుకాండల నొక్కమారే ప్రారంభింపజేసియుండును. అప్పుడు కిష్కింధాకాండము నయ్యలార్యుడు రచించియుండెడివాడు. అట్లు జరుగమిచే నయ్యలార్యుడు ప్రారంభమున హుళక్కి భాస్కరాదులతో గలసి వ్రాయలేదని యూహింపవలసి వచ్చుచున్నది. హుళక్కి భాస్కరుడు రామాయణము నతని జీవితకాలములో శీఘ్రముగ రచింపజూచుటయందే జాగ్రత వహించెనేకాని, దాని యంకితమునుగూర్చి యెట్లయిన నంతగా పాటించియుండడు. దానిని గూర్చి యతడు లక్ష్యము చేయలేదు. మొదటి కాండత్రయము నిర్విఘ్నముగనే సాగినది. అందుచే నాల్గవదియగు కిష్కింధాకాండమును మల్లికార్జున భట్టును, నైదవకాండమగు సుందరకాండమును కుమార రుద్రదేవునకు పూర్వపువరుసనేయిచ్చి తాను యుద్ధకాండము గ్రహించి సాగించియుండును. కాని కుమార రుద్రదేవుడు కార్యాంతరములచే రచననుండి విరమించికొనియుండును. అందుచే మల్లికార్జునభట్టు కిష్కింధాకాండమును, హుళక్కి భాస్కరుడు యుద్ధకాండమందు సుమారు ౧౧౩౪ పద్యములు వ్రాయుసరికి హుళక్కి భాస్కరుడు వ్యాధిగ్రస్తుడై యుండియుండును. తానింక కావ్యరచన జేయగలడనునాశ భాస్కరునకు బూర్తిగ పోయియుండును. కాని రామాయణము తన జీవితకాలములో పూర్తి చేయబడవలయునను పట్టుదల వదలక పోయియుండవచ్చును. సమర్థుడైన తన కుమారుడగు మల్లికార్జున భట్టు రామాయణమును పూరించగలడను విశ్వాసము గలదుకాని, యతడొక్కడు సుందరకాండమును, యుద్ధకాండశేషమును సుమారు ౧౫౬౬ పద్యములను వ్రాయగల్గిన కాలమువఱకు తాను జీవింపగలడా లేదా యని సందేహము గల్గియుండవచ్చును. దాన సుందరకాండమునుగూడ మల్లికార్జునభట్టును రచించునట్లుచేసి, తన స్నేహితుడగు శాకల్యమల్లుని తమ్ముని కుమారుడగు నయ్యలార్యుని 'కావ్యరచనా సామ

ర్థ్యము నెఱిగి యుండినవాడగుటచే నతనిని పిలిపించి యతనిచే యుద్ధకాండశేషమును రచింపించి, తన జీవితకాలములోనే భాస్కర రామాయణమును బూర్తిచేసియుండునని నా యూహ. ఈ విషయమునే యయ్యలార్యుడు యుద్ధకాండాంతమున నిట్లు దెలిపెను.

"అమరహుళక్కి భాస్కర మ
 హాకవి చెప్పగనున్న యుద్ధకాం
డము తరువాయి చెప్పె విక
 ట ప్రతిభాషణుడప్పలార్య స
త్తమసుతుఁ డయ్యలార్యుడు కృ
 తస్థితినార్యులు మెచ్చునట్లుగా
హిమ కర తార భాస్కర మ
 హీవల యస్థిరలక్ష్మి చేకుఱన్,

## ౫. కాండాంత గద్యలు-కాండరచయితలు:-

కాని యొకటి రెండు వ్రాత ప్రతులలో నితర కాండలకు గూడ భాస్కర గద్యయుండుటచేతను, సుందరకాండాది పద్యము సాహిణమార సంబోధనముగ నుండుటచేతను గాబోలు కందుకూరి వీరేశలింగముగారు తమ యాంధ్రకవుల చరిత్రలో—

"పిన్నయీడు వాడైన మల్లికార్జున భట్టేండ్లు చెల్లినవాడైన తండ్రికంటె నధిక వేగముగా పద్యరచన చేయగల కవితాధార గలవాడగుటచే జనకు డారణ్యకాండమును ముగింపకమున్నె తన బాలకాండమును ముగించి, తన సహపాఠియైన కుమార రుద్రదేవుని కిచ్చిన యయోధ్యాకాండమును, తండ్రి చేయుచుండిన యారణ్యకాండమును విడిచిపెట్టి కిష్కింధా కాండమునుజేయ బ్రారంభించెను. ఇంతలోపల భాస్కరుడు దన యారణ్యకాండమును ముగించి కొడుకు చేయుచున్న కిష్కింధాకాండము తరువాయి నందుకొని దానిని పరిసమాప్తినొందించి సుందర కాండను జేయ నారంభించెను. తరువాత మల్లికార్జునభట్టందుకొని సుందరకాండమును ముగించి యుండును. మరల భాస్కరుడు యుద్ధకాండమును జేయుచుండగా మిత్రుడైన యయ్యలార్యు డాతని యనుమతిమీదనే యుద్ధకాండముయొక్క యుత్తర భాగమును గైకొని రామాయణమును తుదముట్టించి యుండును. ఈ రామాయణము పలువురచే దెనిగింపబడిన దగుటచేత శైలియు బహువిధములు గానుండును." అని యొకచోటను, (మా. ౧౯౩౭ సం. అచ్చుప్రతి. పుట ౩౧౦). ఇంకొకచోట "తన పుత్రునకును, భ్రాతునకును, మిత్రునకును భాస్కరుడు కొంత కొంత భాగమిచ్చి తానొక భాగమును బుచ్చుకొని, వారు చేయుచువచ్చినదానిని తా నప్పుడప్పుడు చదివి సంస్కరించుచు, నడుమ నడుమ దన పద్యములను జేర్చుచు, శ్లాఘ్యముగా నున్న దానిని తన పుస్తకములోని భాగముగా స్వీకరించుచు వచ్చియుండును. ఈ హేతువుచేతనే రామాయణమునకు మూడు కాండములు చేసిన మల్లికార్జునభట్టు పేరుగాక, యొక కాండమునో, కాండమునరనో చేసిన భాస్కరుని పేరు వచ్చెననుటకు సందేహములేదు." (మా. పుట. ౩౦౯). చిట్టచివరకు, "రామాయణ కవిత్వమంతటిలోను మొట్టమొదట నారణ్యకాండ కవిత్వమును, దానికి తరువాత యుద్ధకాండ కవిత్వమును మేలయినదిగా గానబడుచున్నది." అని తికమకలుగ, నసమంజసముగ, నసంభావ్యముగను వ్రాసిరి. మొట్టమొదటనే "తన పుత్రునకు, భ్రాతునకు, మిత్రునకు భాస్కరుడు కొంత కొంత భాగమిచ్చి తానొక భాగమును బుచ్చుకొని" నచో పిన్నవాడును వర్ధిష్ణువునైన యయ్యలార్యున కేదో ప్రత్యేక కాండమును మొదటినుండి యిచ్చియుండును గాని యుద్ధకాండమునందులో మధ్యభాగమునుండి యిచ్చెననుట యనుచితము నసంభావ్యముగ నుండును. ఇక మూడు కాండముల రచించిన మల్లికార్జునభట్టునకు వరుసనే మూడు కాండముల నిచ్చియుండును గాని, మధ్య కుమార రుద్రదేవున కిచ్చియుండడు. హీనపక్షము బాలకాండముతో బాటయోధ్యాకాండమును గూడ నాతని భాగమునకే యేర్పరిచియుండును. కుమార రుద్రదేవునకే కిష్కింధాకాండమునో సుందర కాండమునో యిచ్చియుండును. "భాస్కరుడు తన యారణ్యకాండమును ముగించి కొడుకు చేయుచున్న కిష్కింధాకాండము తరువాయి నందుకొని, దానిని పరిసమాప్తి నొందించి, సుందరకాండమును చేయ నారంభించెను. తరువాత మల్లికార్జునభట్టందుకొని సుందరకాండమును ముగించి యుండును." అనినట్లే జరిగియుండుచో, నాయా భాగముల ముందుగాని,

చివరగాని వారువారు రచించినట్లు, అయ్యలార్యుడు యుద్ధకాండమున జెప్పికొనినట్టుగా చెప్పికొని యుండురుగదా. అట్లు లేదేమి. పై యూహారీతి భాస్కరుడు కిష్కింధాకాండోత్తరభాగమును సుందరకాండ పూర్వభాగమును రచించువఱకు మల్లికార్జునభట్టారక కూర్చొని యెప్పుడు భాస్కరుడు దానిని తనకు వదలివేయునా యని కనిపెట్టుకొని యుండెననియా? సుందరకాండమును ప్రారంభించి రచించుచున్న హుళక్కి భాస్కరుడు దానిని పూర్తిచేయకుండ మధ్యలో వదిలి యుద్ధకాండమును రచింపబోవుటకు దగిన కారణము లేదు. శీఘ్రముగ రామాయణ రచనమును బూర్తిచేయదలచుకొనిన భాస్కరుడు, తాను కిష్కింధా కాండోత్తరభాగ, సుందరకాండ పూర్వభాగములు రచించులోపల, మల్లికార్జున భట్టారక కూర్చుండజేయునా? కిష్కింధా కాండోత్తరభాగము భాస్కరుడే రచించినచో నందలి కాండాంత పద్యములు, బాల సుందరకాండాంత పద్యములవలె శివపరముగా నున్నవేమి? ఒక వేళ యది యథార్థమే యనుచో కిష్కింధాకాండోత్తర భాగమునను, సుందరకాండ పూర్వభాగమునను కవిత్వ శైలి యరణ్యకాండ శైలివలెనో, లేదా, యుద్ధకాండ పూర్వభాగ శైలివలెనో యుండవలెనుగదా. అట్లుగాక శైల్యుత్కృష్టత యారణ్యకాండ యుద్ధకాండలకు మాత్రము దక్కనేల. కాన నా భాగములుగూడ మల్లికార్జునభట్టే వ్రాసియుండును. బహు లిఖిత ప్రతులలో గద్య లతనిపరముగనే యున్నవిగదా. యథార్థమునకు రామాయణము మొత్తమున వివిధశైలు లున్నను, నొక్కొక్క కాండకు బహువిధశైలులు చాలవరకు సామాన్యముగ గానబడుటలేదు. యుద్ధకాండ మొక్కటిదక్క మిగిలిన ప్రతికాండయందు మొదటినుండి చివరవఱకు నేక కవికృత రచనాశైలియే కనిపించుచున్నది. కాన బాల కిష్కింధా సుందర కాండములు మల్లికార్జునభట్టును, నయోధ్యాకాండమును కుమార రుద్రదేవుడును నారణ్యకాండమును యుద్ధకాండ పూర్వభాగమును హుళక్కి భాస్కరుడును, యుద్ధకాండోత్తర భాగము నయ్యలార్యుడును రచించెననుటయే సుసంగతముగ నుండును. అయోధ్యాకాండ ప్రతులలో నొకటి రెంటియందు గూడ భాస్కరునిపేరు గద్యలలో నుండుటచే నా కాండయందుగూడ కిష్కింధా సుందరకాండలందు దలచినట్లు వీరేశలింగంగారు దీనియందుగూడ కుమార రుద్రదేవునితో బాటు భాస్కరుని కవిత్వము గలదని యేల దలంపలేదో? వీరుమాత్ర మట్లూహింపక పోయినను నా కొఱతను డా. వే. వెంకటరమణయ్యగారును, చా. శేషయ్యగారును దీర్చుటయేకాక, యింకొక మెట్టు పైకిపోయిరి. కాండాంత గద్యలు వివిధ ప్రతులలో పరస్పర విరుద్ధముగా నుండినపుడితర సాధన సహాయమున నిర్ణయించుట మేలు. అందొకటి శైలి. భాస్కరుని శైలికి మల్లికార్జునభట్టు కుమార రుద్రదేవుల శైలికి నధిక వ్యత్యాస ముండుటచే సాధారణముగ భేదమును గనిపెట్టవచ్చును. భాస్కరుని శైలి యయ్యలార్యుని శైలితో విశేష భేదము లేకుండుటచే యుద్ధకాండమున చక్కగ నతికి కలిసిపోయినది. పైన కం. వీరేశలింగంగారు కిష్కింధా కాండోత్తర భాగమును సుందరకాండ పూర్వభాగమును భాస్కరుడు రచించెననుటచే మల్లికార్జునభట్టు బాలకాండతోగూడ గలసి సుమారు రెండు కాండములును, భాస్కరుడు రెండున్నర కాండములు వ్రాసినట్లగును. అట్టిచో వారు "మూడు కాండములు వ్రాసిన మల్లికార్జునభట్టు పేరుగాక, కాండమునో, కాండమునరనో వ్రాసిన భాస్కరుని పేరు వచ్చెను రామాయణమున"కని వ్రాయుట పరస్పర విరుద్ధము గదా. వృద్ధుడును, విద్వత్కవియు నైన హుళక్కి భాస్కరుడు మిగిలిన కవులను జేరదీసి, వారికి సలహా నిచ్చి, కొంత తాను వ్రాసి, వారిచే వ్రాయించి, యాజమాన్యమును, సంపాదకత్వమునుగూడ నెరవేర్చియుండును. అందుచే జ్ఞానవయోవృద్ధుడైన యాతని పేరనే రామాయణము వ్యవహరింపబడుచు వచ్చెను. ఇట్లు రామాయణ రచనాభాగములు తలవని తలంపుగా నొక వరుస లేకుండ వ్రాయవలసివచ్చుటచేతను, ప్రారంభమునందే కృతిపతివరణము నిశ్చయింపబడకపోవుటచేతను, సంప్రదాయానుగుణముగ కృత్యవతారిక యుండదగిన బాలకాండను ప్రధానకవియు, కృత్యవతారిక వ్రాయదగినవాడునైన హుళక్కి భాస్కరుడుగాక మల్లికార్జునభట్టు వ్రాయవలసివచ్చుటచేతను, నితర కావ్యములందువలె నిందు కృత్యవతారిక లేక విలక్షణముగ నున్నది. రామాయణ రచన పూర్తియైనపిమ్మట తత్సందర్భానుగుణముగ సమష్టి కృత్యవతారిక

హుళక్కి భాస్కరుడు వ్రాయుదలచియుండును. కాని పరిస్థితులు వ్యత్యస్తమగుట కృత్యవతారిక లేకుండ సాహిణిమారాంకిత పద్యములు మాత్రము రచింపబడియుండునని యూహింప దగును. ఈ చిక్కులకు తోడు, మల్లికార్జునభట్ట రచిత భాగము శివాంకితము చేయబడుటచే, కృతికర్తలను వారి కాలములనుగూర్చి యనేక వాదోపవాదముల కవకాశము గల్గినది.

## ౬. ఆశ్వాసాంతపద్యములు

### ఆశ్వాస విభాగములు :

ఈ విషయమున మేడేపల్లి వెంకటరమణాచార్యులగారు వావిళ్లవారి భాస్కర రామాయణ పీఠికలోనిచ్చిన సమాధానము సమంజసము, సంతృప్తికరముగ నున్నది. హుళక్కి భాస్కరు డారణ్యకాండమునకు మాత్రమే యాశ్వాసాంతపద్యగద్యలు వ్రాసి, యాశ్వాసవిభాగము చేయుట కవకాశము గల్గినది. తాను యుద్ధకాండమునుగూడ పూర్తిగ రచించినచో దానికిగూడ నారణ్యకాండము రీతి యాశ్వాస విభాగముచేసి, దానికిగూడ విభక్త్యంతములతో నాశ్వాసాంత పద్యములను వ్రాసి యారణ్యకాండాంత గద్యనే యుద్ధకాండాంతమున జేర్చియుండెడివాడని తప్పక భావింపవచ్చును. యుద్ధకాండమును హుళక్కి భాస్కరుడు చివరవరకు రచింపనపుడట్లుపోల్చి, యవి భేదముగా నున్నవనియు, నందుచే కవులు భిన్నులనియు నిర్ణయించుట తగదు. అరణ్యకాండాంత గద్యలు నన్నయగద్యలను బోలియుండుటచే భాస్కర కవి నన్నయకు సమీపకాలమువాడనియు, కాండాంత పద్యములు తిక్కన నిర్వచనోత్తర రామాయణాశ్వాసాంత పద్యముల బోలియుండుటచే, దన తాత ననుకరించెననియు వాదించుట యసమంజసము. ఇతరు లీ విషయముల ననుకరింపరాదను నిషేధ మెక్కడైన కలదా. లేనప్పుడీ వాదమున కవకాశమే లేదు. యుద్ధకాండ పూర్వభాగమునగూడ హుళక్కి భాస్కరుడు, తిక్కనకవిత్వము ననుసరించిన పద్యములు గనబడుచున్నవని చి. వీరభద్రరావుగారు గూడ తలచుచున్నారు.

డా. నే. వెంకటరమణయ్య, చా. శేషయ్య గార్ల వాదము ప్రకారము యుద్ధకాండముతప్ప మిగిలిన యైదు కాండములను ప్రథమమున మంత్రి భాస్కరుడే రచించియుండి, తర్వాత మల్లికార్జున భట్టాదులు మధ్యమధ్య కొన్ని ఘట్టములను విపులీకరించుట మాత్రమే యొనర్చినచో నాయా కాండములలోని పద్యముల సంఖ్యలు మొదటికవి రచనమున, ముద్రిత ప్రతియందు, కల్పినవి, నిల్పినవి, తీసివేసినవి సూచికలో ఈ క్రింద విధముగ నున్నవి* (మా. ఆం. క. త. II పుటల సంఖ్యలు.)

ఇందారణ్యకాండముకంటెను బాలకాండమున మొదటి రచనమునసే యెక్కువ సంఖ్యగల పద్యములు గలవుగదా. మంత్రి భాస్కరుడు బాలకాండ నేల యాశ్వాసములుగ విభజింప లేదు. అట్లే కిష్కింధాకాండముగూడ నున్నదే. కాన బాల కిష్కింధాకాండములను మంత్రి భాస్కరుడు మొట్టమొదట రచింపలేదనుటయే సుసంగతము. అందుచే నాశ్వాసవిభాగవాదము సహేతుకముగ లేదనుట స్పష్టము.

౭. పాఠాంతరముల విషయము:—భాస్కర రామాయణ లిఖితప్రతుల బోల్చిచూచినచో నందలి కొన్ని ఘట్టము లేక సన్నివేశమునే పునరుక్తిగా రెండుసార్లు రచింపబడినవాయను భావము గల్గునని పరిశోధన పండితు లనేకు లంగీకరించిన విషయమే. ననుక మాపినట్లు డా. నే. వెంకటరమణయ్యగారే కాక, వ్రాతప్రతుల గ్రంథాలలో మునిగితేలిన కీ. శే. వేటూరి ప్రభాకరశాస్త్రిగారు చిరకాలము క్రిందటనే యీ విషయమును గుర్తించిరి. వారు ౧౯౩౯ సం. జూను నెల భారతిలో ఎఱ్ఱాప్రెగ్గడ రామాయణ మను వ్యాసమున నిట్లు వ్రాసిరి. "ఇపుడు

| | ముద్రితప్రతి | మొదటిరచన- | నిల్పినవి- | తీసివేసినవి- | కల్పినవి. |
|---|---|---|---|---|---|
| బాలకాండము (మా. పుట ౧౧౫) | ౭౮౩ | ౪౦౦ | — | — | ౩౮౩ |
| అయోధ్యాకాండము (మా. పు. ౧౦౮) | ౪౫౦ | ౨౬౭ | | | ౧౨౮ |
| అరణ్యకాండము (మా. పు. ౯౯) | ౭౨౬ | ౩౯౦ | ౨౧౦ | ౧౮౦ | ౫౧౬ |
| కిష్కింధాకాండము | ౮౨౭ | | | | |

ముద్రితమై వెలయుచున్న భాస్కర రామాయణమునగూడ ఎఱ్ఱాప్రెగ్గడ రామాయణ పద్యము లనేకములు చేరియున్నట్లు తెలియవచ్చుచున్నది. పెక్కేండ్లకు పూర్వము ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమున తెలుగు గ్రంథములకు డిస్క్రిప్టివ్ క్యాటలాగు వ్రాయునపుడు భాస్కర రామాయణమును సామాన్య దృష్టిని పరిశీలింపగ పాఠభేదములు, గ్రంథభేదములు చాలగా గానవచ్చినవి. ఆ విషయ మప్పుడందు నెల్లడించితిని. ఆనంద ముద్రణాలయమువారి భాస్కర రామాయణ ముద్రణముకొఱకు వారియొద్ద పండితులుగా నుండిన కీ. శే. తంజనగరం తేరు పెరుమాళ్లయ్యగారు అరణ్యకాండమున రెండు భిన్న రచనము లుండుటనుగూర్చి కొంత నాతో చర్చించిరి. "మఱియొకచోట" అరణ్యకాండ రచనాభేదములెల్లగూడ ఎఱ్ఱాప్రెగ్గడ రచనములు కావచ్చునేమో యని కూడ నే ననుమానించుచున్నాను" అనియు, నింకొకచోట, "అయోధ్యాకాండమునగూడ రచనాభేదములు చాల గ్రాగలవు. అందుగూడ గొన్ని ఎఱ్ఱాప్రెగ్గడ పద్యము లుండునేమో" మఱియు, "యుద్ధకాండమున మఱి కొన్ని పద్యములు గొన్ని ప్రతులలో మాత్రమే యధికముగా గానవచ్చుచున్నవి. దొరకిన యుద్ధకాండ ప్రతులనెల్ల పరిశీలించినయెడల నిట్టివి మఱికొన్ని పద్యములుగూడ భాస్కరునివిగనో, ఎఱ్ఱాప్రెగ్గడవిగనో వేర్పడగలవనుకొందును. భాస్కర రామాయణమున ఎఱ్ఱాప్రెగ్గడ రచనములు గొన్ని చేరియుండుట తథ్యము" అనియు వ్రాసిరి.

హరివంశమునకు బూర్వమే ఎఱ్ఱాప్రెగ్గడ రామాయణమును రచించెనని హరివంశ కృతిపతియగు ప్రోలయ వేమారెడ్డి పల్కినట్లుగా నా గ్రంథమున నిట్లు గలదు.

నా తమ్ముండు ఘనుండు మల్ల
    రథినీనాథుండు నిన్నాతత
శ్రీ తోడఁగా సముపేతుజేసి యెలమిన్
    జేపట్టి మా కిచ్చుటన్
జేతో మోదమెలర్ప రామ
    కథమున్ జెప్పించి యత్యుత్తమ
ఖ్యాతిం జెందితి నింకనుం దని
    యనేఁ గావ్యామృత స్వాదనన్॥

అని నుడివెనుగదా. దీనికి తోడు కూచిమంచి తిమ్మకవి తన సర్వలక్షణసార సంగ్రహమున నెఱ్ఱాప్రెగ్గడ రామాయణమునుండి పద్యముల నుదాహరించెను. కాని ప్రస్తుత మా రామాయణము గానరాదు. మఱియు క్రీ. శ. ౧౪౦౦ ప్రాంతమున కొఱవి సత్యనారాయణకవి మఱియొక రామాయణమును రచించెనని కొఱవి గోపరాజు తన సింహాసన ద్వాత్రింశికలో నిట్లు వ్రాసెను.

కం. రామాయణ కృతికర్తయై
    తా మెఱయుచు నాంధ్రకవి పితామహుఁ డనగా
    భూమిం-చిన భీమనయను
    నామంబున వెలిసె సత్యనారన ఘనుడై

ఇప్పు డీ రామాయణముగూడ గానరాదు. ఎఱ్ఱాప్రెగ్గడ రామాయణమందలివిగా యనుమానింపబడి, సంకీర్ణ గ్రంథములలో దొరికిన పద్యములలో గొన్ని నీలకంఠేశ స్తుత్యాత్మకములుగ నున్నవి. (మా. వే. ప్ర. శా. గారి పై వ్యాసము) ఎఱ్ఱాప్రెగ్గడ రచించిన గ్రంథము లన్నియు విష్ణుసంబంధము గలవియేయైనను శంభుదాసుడను పేరతనికి గల్గుట కతని కాపురస్థలమైన నెల్లూరు ప్రాంతస్థమగు గుడ్లూరునందలి నీలకంఠేశ్వర స్వామి భక్తుడగుటయే ముఖ్యకారణము. నృసింహపురాణము నహోబలస్వామి కంకితము చేసిన యెడ్డను, తన ముఖ్యదైవమైన నీలకంఠేశ్వరస్వామికి భక్తుడై "ప్రోలయ వేమారెడ్డిగారి ప్రేరణమున నాతడు రామాయణము నా నీలకంఠేశ్వరస్వామి కంకితముగా రచించెనేమో" యని వే. ప్ర. శాస్త్రిగా రనుమానించిరి.

[సశేషము]

# గ్రంథ విమర్శనము

## క్షేత్రయ్య పదములు: శృంగార రసమంజరి

సంపాదకుడు: విస్సా అప్పారావు. ఆంధ్ర గాన కళాపరిషత్తు: రాజమహేంద్రవరము. వెల: నాలుగురూపాయలు.

దాక్షిణాత్య వాగ్గేయకారకులలోను, తత్రాపి పదకర్తలలోను క్షేత్రయ్య నామధేయము చిరస్మరణీయము. క్షేత్రయ్య వేలాదిగా పదాలు రచించి ఉండవచ్చునని ఆయన రచించిన పదాలవల్లనే నిశ్చయించవచ్చును. అయితే ఈ పదాలలో చాలా భాగం మన కిప్పుడు లభించడం లేదు. ఇంతకు పూర్వం ప్రకటింపబడిన క్షేత్రజ్ఞుని పదాలు ౨౪౧ కంటె ఎక్కువ లేవు. ప్రస్తుతం శ్రీ విస్సా అప్పారావుగారిచే సంపాదితమైన గ్రంథంలో ౩౩౦ పదాలదాకా ఉన్నాయి. అనేకమైన ప్రాచీన ప్రచురణలు, తాళపత్రగ్రంథాలు పరిశీలించి తాను పదాలన్నీ సేకరించామని సంపాదకులు పీఠికలో తెలియజేస్తున్నారు. అసలు క్షేత్రయ్య వ్రాసిన పదాల దృష్ట్యా చూస్తే ప్రస్తుతం సేకరింపబడిన పదాలు తక్కువే అనాలి.

ఈ గ్రంథంలో వీరు కేవలం మువ్వగోపాలుని మీద రచించిన పదములే కాక, క్షేత్రయ్య తంజావూరి విజయరాఘవునిమీద, తుపాకుల వేంకటకృష్ణునిమీద రచించిన కేవల శృంగార పదాలుకూడా చేర్చారు. అందుచేతనే ఇతఃపూర్వం ప్రకటింపబడిన క్షేత్రయ్య పదాలన్నిటికన్నా పదసేకరణదృష్ట్యా ఈ గ్రంథం సమగ్రమైనట్లు కనిపిస్తున్నది.

క్షేత్రయ్యనుగురించి మనకు తెలిసిన చారిత్రికాంశాలు చాలా తక్కువ. అతని పదాలను బట్టి క్షేత్రయ్య అనేకమైన రాజాస్థానాలు సందర్శించాడనీ, ఆ కాలంలో పదకర్తగా ప్రత్యేక గౌరవం పొందాడనీ ఊహించవచ్చును. ఇప్పటికి దొరికిన ఆధారాలను బట్టి అతడు మొవ్వనివాసియై ఉండవచ్చునని ఊహించడంకూడా సముచితమే.

కాని శ్రీ విస్సా అప్పారావుగారు మువ్వగోపాల పదాలనుబట్టి, క్షేత్రయ్యకు వేశ్యాసంపర్కం కలిగి ఉండవచ్చుననీ, ఆయా పదాలలో అతని ప్రేమభావాలు ప్రకటింపబడి ఉండవచ్చుననీ ఊహిస్తున్నారు. ఈ విషయం నిర్ధారణ చెయ్యడానికి వారు పీఠికలో సుమారు ఆరుపేజీలు ప్రత్యేకించారు.

ఒక రచయిత రచనలనుబట్టి ఆతని జీవిత చరిత్ర ఊహించడం ఒకప్పుడు అతిశయోక్తి పూరితమైన అపసిద్ధాంతాలకు దారితీస్తుంది. ఒక రచయిత కేవలం తటస్థుడుగా ఉండి తన రచనలలో లోకవృత్తం వ్యక్తీకరించి ఉండవచ్చును. మరి ఒక రచయిత ఆత్మజీవితానికే లోకవృత్తంతో ఒక బురఖా తగిలించి రచనలు సంతరించి ఉండవచ్చును. లేకపోతే మరి ఒక రచయిత చాలా మర్యాదగా సంసారయాత్ర సాగిస్తూ తనకు అభీష్టమైన భావనా జగత్తే తన కావ్యంలో సృజించి ఉండవచ్చును. విశ్వసనీయమైన చారిత్రకాధారాలు లభిస్తే తప్ప రచనలనుబట్టి ఒక రచయిత బాహ్యజీవితం చిత్రించడం కేవలం సాహసమే.

ఈ విషయంలో శ్రీ అప్పారావుగారు వాస్తవికమైన చారిత్రక పరిశోధన పద్ధతి విడిచిపెట్టి ఎందుచేతనో గాని, కేవలం శృంగార పూరితమైన భావనా జగత్తులో విహరించారు.

## రసమంజరి

క్షేత్రయ్య పదాలతో కలిపి వీరు రసమంజరి కూడా ప్రకటించారు. ఈ ఆంధ్ర శృంగారరసమంజరి కర్త ఎవరో తెలియడం లేదని ప్రకాశకులు వ్రాస్తున్నారు. ఈ రసమంజరి సంస్కృతంలో భానుదత్తుడు రచించిన రసమంజరికి సరియైన అనువాదంలా కనబడడం లేదు. పోనీ ఇది భానుదత్తుని రసమంజరి దృష్ట్యా కేవలం క్షేత్రయ్య పదాలకు లక్ష్యలక్షణ సమన్వయం చేసిన గ్రంథంకూడా కాదు. అనేకమైన ఇతరోదాహరణాలుకూడా దీనిలో కనిపిస్తున్నాయి. దీనికి ఒక ఆశ్వాసాంత గద్య, కాని గ్రంథకర్తృనామాదికంగాని ఏవీ కనిపించడం లేదు. గ్రంథాన్ని బట్టిచూస్తే ఇది ఎవరో ఆయా ఆలంకారిక గ్రంథాలు కొన్ని, క్షేత్రయ్య పదాలు కొన్ని పరిశీలించి ఈ పదాలు అభినయించడానికి కావలిసిన కొన్ని ఉపయుక్త విషయాలు వ్రాసుకున్న పుస్తకంలా కనిపిస్తుంది. దీనిలో క్షేత్రయ్య పదాల లక్ష్య సమన్వయం కూడా ఒక క్రమాన్ననుసరించి జరగలేదు. కొన్ని కొన్ని క్షేత్రయ్య పదాలకు దీనిలో లక్ష్యలక్షణ సమన్వయమే కనబడడం లేదు. అదీగాక అలంకార శాస్త్రంలోని ఏదో ఒక ప్రసిద్ధ గ్రంథం ప్రమాణంగా తీసుకుని ఆ గ్రంథలక్షణాల దృష్ట్యా లక్ష్యసమన్వయం చెయ్యడం అంతకష్టమైన విషయం కాదు. ఈ కారణాలచేత ఈ గ్రంథంతో కలిపి రసమంజరి ప్రకటించడం పాఠకులకుగాని, పదాలు అభినయించేవారికి గాని అంతగా ఉపయోగకరంగా లేదు.

శ్రీ వేదాంతంలక్ష్మీనారాయణగారు క్షేత్రయ్య పదాలు అభినయించే పద్ధతి సూచిస్తూ ఒక పదానికి అభినేతలదృష్ట్యా వ్రాసిన వ్యాఖ్యానం శ్రీ అప్పారావుగారు ప్రకటించారు. ఇది చాలా చక్కగా ఉన్నది. ఈ విధంగా పదాలన్ని ప్రకటిస్తే శృంగార రసమంజరికన్న అది అన్ని విధాలా చాలా ఉపయోగకారిగా ఉండేది.

క్షేత్రయ్య ఆ కాలంలో ఉన్న మోహశృంగార సంప్రదాయం ప్రకారం పదరచన చేశాడు. తాత్కాలికమైన ఆచార దృష్ట్యా రచన చేసి ఉండడంవల్ల కాబోలు ఈ పదాలలో కొన్నిచోట్ల శృంగార రసానికి సముచితమైన ఔచిత్యం సన్నగిల్లింది. అయితే క్షేత్రయ్యను కేవలం సాహిత్య దృష్ట్యా సమీక్షించడంకంటె పదకర్తగానే సమీక్షించడమే న్యాయ్యము. ఆ విధంగానే తెలుగు సాహిత్యంలో అతనికి సమున్నత గౌరవం ఏర్పడింది. అయినా ఔచిత్యం అంతగా పాటించకపోవడం అతని పదాల కొకలోటే.

క్షేత్రయ్య సమస్తమైన నాయికానాయిక భావాలు సమగ్రంగా తన పదాలలో అభివర్ణించాడు. కేవలం బాలెంతఅయిన నాయికశృంగారంకూడా విడిచిపెట్టకుండా తన పదంలో వర్ణించడంవల్ల ఇతడెంత సమగ్రంగా ఈ విషయం వర్ణించాడో ఊహించుకోవచ్చును.

శ్రీ రాజన్నారుగారు పీఠికలో సూచించినట్లు ఈ పదాలలో కేవలం మువ్వ గోపాలపరమైన శృంగారానికేగాని, భక్తిభావానికి తగా. ప్రమేయం కనబడదు. పదాలలో అక్కడక్కడ మరీ అసభ్యంగా ఉన్న చరణాలు చుక్కలు పెట్టి విడిచివెయ్యడంకంటె ఈ పుస్తకం విద్వాంసుల ప్రచురణగా (*Scholar's Edition*) ప్రకటించి ఆ చరణాలు కూడా సమగ్రంగా ప్రకటించి ఉండవలిసింది.

క్షేత్రజ్ఞుడు పదకవితద్వారా ఆంధ్రజాతికి ఆరాధనీయుడు. త్యాగరాజ కృతుల వలెనే ఈ పదకర్త పదావళికూడా ప్రాచీనాధున సంగీత, నృత్య వేత్తల మన్ననలందుకొన్నది. గేయ పదకర్తగా క్షేత్రయ్య ఉత్తమమైన శ్రేణికి చెందినవాడు. ఇలాంటి ఉత్తమపదకర్త రచనలు కొన్ని నేటి కాలపు అభిరుచుల ననుసరించి అక్కడక్కడ చుక్కలతో పూరించడం సముచితంకాదు.

శ్రీ అప్పారావుగారి 'క్షేత్రయ్యపదములు' పూర్వపు ప్రచురణలకంటె సమగ్రంగా ఉన్నా ప్రస్తుతం ప్రచురణలో సూచించిన దోసగులు సంపాదకులు రాబోయే ప్రచురణలోనైనా సరిదిద్దుకుంటే ఈ గ్రంథం ఇతోధికంగా పదాభినేతలకు పాఠకులకు ఉపయుక్తంగా ఉండగలదు.

---

## ఆంధ్ర గీతగోవింద కావ్యము

శతావధాని చల్లా పిచ్చయ్యశాస్త్రి, సంస్కృత కళాశాల, పొన్నూరు. బాపట్లతాలూకా, గుంటూరు జిల్లా. వెల: రెండు రూపాయలు.

ఇది సంస్కృత వాఙ్మయంలో సుప్రసిద్ధమైన జయదేవుని గీతగోవిందకృతికి శ్రీ చల్లా పిచ్చయ్యశాస్త్రిగారు రచించిన ఆంధ్రానువాదకావ్యము. ఇంతకు పూర్వము అనేకులు ఈ కావ్యం తెలుగులోకి అనువదించారు—అయితే వారందరూ ఈ కావ్యం పద్యాత్మకంగానే అనువదించారు. జయదేవుని అష్టపదిలో శ్లోకాలు, గేయాలూకూడా ఉన్నాయి. అయినా జయదేవుని కావ్యం ఎక్కువగా గేయాత్మకమైనది కావడంవల్లను, ఆ గేయాలకు ఎనిమిదేసిచరణాలుండడంవల్లను దీనికి అష్టపది అనే విఖ్యాత నామధేయంకూడా వచ్చింది. జయదేవుని కృతిలో సంగీత కవిత్వాలు రెండు మంచిపాకంలో పడి పరస్పరాచ్ఛాదనం చెయ్యకుండా మనోహర సమ్మేళనం పొందగలిగాయి. అందుచేత గీతగోవిందానువాదకులు, గేయరచనలోకూడా సిద్ధహస్తులైతే తప్ప అనువాదంలో కృతకృత్యులు కాలేరు.

ఈ అనువాదకులు జయదేవుని శ్లోకాలు పద్యాలుగాను, అష్టపదులు గేయాలుగాను అనువదించి యథామూలతః సంపాదించడానికి ప్రయత్నించి చాలావరకు కృతకృత్యులయినారు.

ఈ క్రింది గీతగోవిందానువాదానువాదాన్నిబట్టి వీరి అనువాదసరణి గ్రహించవచ్చును. గీతగోవిందంలోని:—

"ధీరసమీరే యమునా తీరే
వసతివనే వనమాలీ
గోపీ పీనపయోధరమర్దన
చంచలకరయుగ శాలీ"

అనే అష్టపదిని వీరీవిధంగా అనువదించారు.

ఘూర్జరాగము—ఏకతాళము.

పర్యేద వీచెడు యమునాతటవని
వసియించును వనమాలి
ఒయ్యారుల యురువక్షోజమ్ముల
నొయ్యుచు క్రేవల గ్రాలి

హాయిగూర్చు సంకేత పదమ్మున
కరుగు నితంబిని వేగ
చేయకు మాలస్యము రమణుడు రమ
ణీయుడు చేయును సైగ
మురియుచు మురళిని మెరయించుచు
జాతురి నిను మొగి బలికించుచు
విరివిగ నీపై సోకిన పయ్యెద
వెడలు రేణువును భావించుచు"

ఇల్లాగ ఈఅనువాదం అంతా మనోజ్ఞంగా నడిచి పోతుంది.

అయితే ఈ అష్టపది అనువాదంలోనే "పతతి పతత్రే విచలతి పత్రే, శంకిత భవ దుపయానం" అన్న పాదానికి వీరు

'ఈక రాలినను నాకు కదలినను
నీ వరుదెంచితి వనుచున్'

అని అనువదించారు. ఇక్కడ 'పతతి పతత్రే' అన్నదానికి వీరి 'ఈకరాలినను' అన్న అనువాదం బాగా కటువుగా ఉన్నది.

ఇలాగే,

"కేలం బూనకు మావిలేజివురు ము
ల్కిన్ వింట సంధింప కో
లీలానిర్జిత విశ్వ! యో మదన! మే
లే! పిండిదంపంగ నా
లోలాలోక లగించు చూడ్కు లొగి నా
లోఁజొచ్చుటన్ వ్రీలి, క
ల్లోలంబై మది యించుకేనియును
నిల్వంగాంచ దీ పట్టునన్."

అన్న పద్యంలో వీరు మూలంలోని 'మూర్ఛిత జనాఘాతేన కిం పౌరుషమ్' అన్నదానికి 'మేలే పిండి దంపంగ' అని అనువదించాడు. ఈ అనువాదం మూలమాధుర్యం తెలుగు పాఠకులకు అందించడం లేదు సరిగదా, మూలంలో లేని కటుత్వం కూడా కొత్తగా తీసుకు వస్తూంది.

అన్ని విధాలా చక్కగా ఉన్న వీరి అనువాదంలో ఇలాంటి దోసగులు కొన్ని సవరించుకొంటే సంస్కృతానభిజ్ఞులయిన ఆంధ్రుల నీ గ్రంథం చాలా వరకు మూలానికి సన్నిహితంగా తీసుకుపోతుంది.

---

## నన్నయభట్టు

[పద్యకావ్యము.]

-చిలుకూరి రామభద్రశాస్త్రి. ప్రకాశకులు, వేంకటరామా అండ్ కో విజయవాడ.

వెల. ౧-౪-౦

ఇది నన్నయభట్టు చరిత్రము కథగా తీసుకుని రచించిన అయిదాశ్వాల పద్యకావ్యము. దీనిలో రచయిత నన్నభట్టును మహారాష్ట్ర బ్రాహ్మణునిగా చిత్రించారు. ఇదీగాక దీనిలో ఇంకా సందేహాస్పదాలైనమరికొన్ని చారిత్రికాంశాలు చేర్చారు. అందుచేత దీనిలో నన్నయభట్టారకచారిత్రానికి రావలసిన గౌరవం రాలేదు.

దీనిలో పద్యరచనాదికం కూడా అంతంతగా సామాన్యధోరణిలోనే నడిచింది. అంతేగాని ఈవిషయంలో ప్రత్యేకంగా పేర్కొనవలసిందేమీ లేదు.



Printed & published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty Street, Madras. Editor: S. Sambhu Prasad